శ్రీవిశ్వనాథసేన కృత "పథ్యాపథ్య"మను పుస్తకమునకు "వివరణ" మను నాంధ్రటీక రచియించి ద్వితీయ గుచ్ఛముగ ముద్రించితిని.

మఱియు నాయుర్వేద వైద్యమందలి ప్రత్యేక ప్రత్యేక విషయములనంబరఁగు శస్త్ర,గర్భిణీ,రసాయన, ఓషధితత్త్వము, మొదలగు కొన్నిటిని నితర వైద్యపద్ధతులతోఁ జక్కఁగఁజర్చించి యాంధ్రభాషలో గ్రంథములుగవ్రాసి ముద్రించెదను.

దేశాభివృద్ధికిని, సర్వజనారోగ్యమునకును, నావశ్యకములైన గ్రంథములు ప్రచురించి సర్వత్రాయుర్వేద గ్రంథాభివృద్ధిచేయుటయే యీ గ్రంథమాలయొక్క యుద్దేశము.

గ్రంథమాలయందలి గ్రంథములన్నియు జనోపయోగముకొఱకై ముద్రింపఁబడుచున్నందున సులభమైన వెలలకు నీయఁబడును.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలోఁ బ్రచురింపఁబడు గ్రంథములన్నియుఁ గైకొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపుఁ జందాదారులుగ నెంచఁబడుదురు.

శాశ్వతపుఁజందాదారులకు మా గ్రంథమాలలోనిమాధవనిదానమునకుతప్ప మిగిలిన గ్రంథములన్నిటికిని నియమించిన ఖరీదులలో నొకరూపాయకు నాలుగు అణాలవంతునఁ దగ్గించి యిచ్చెదను.

శాశ్వతపుఁజందాదారులు కానివారికి నిర్ణీతమగు వెలలకు నేమాత్రము తగ్గింపఁబడదు.

శాశ్వతపుఁ జందాదారులుగాని, శాశ్వతపుఁ జందాదారులు కానివారలుగాని యంచెకూలి (వి. పి. చార్జి) వగైరాలు భరింపవలెను.

ఈగ్రంథమాలలో మొదటిగుచ్ఛమగు "మాధవనిదానము" నకు మిక్కిలి తక్కువవెల యేర్పాటుచేయుటచేత దానికి నిర్ణీతమగు రు. 3—0—0(మూడురూపాయల) వెలకు నేమియుఁ దగ్గింపఁబడదు.

మాగ్రంథమాలకు శాశ్వతపుఁ జందాదారులుగనుండు వారు ముందుగాఁ జందాధనమును నియ్యనక్కఱలేదు.

పుస్తకములు ముద్రణమైనతోడనే ముందుగఁ దెలియఁ జేసి యాయాగ్రంథములను వి. పి. గాఁ బంపెదను.

శాశ్వతపుఁ జందాదారులుగఁ గాఁదలచినవారు ప్రవేశము రుసుము క్రింద రు. 0—2—0ల పోష్టుబిళ్లలను బంపుచు నిందుఁగనఁబఱచిన ప్రకారము గ్రంథమాలాధిపతులకు నుత్తరమును వ్రాసికొనవలయును.

అట్లుప్రవేశము రుసుమును ముందుగాఁబంపక పుస్తకములను గోరువారికి ముందుగాఁ బంపెడు పుస్తకముల వీఁపీలో రెండు అణాలను జేర్చి వసూలుచేయఁబడును.

ఆయుర్వేదాశ్రమ
55 ఆచారప్పన్ వీధి
జార్జిటవున్ మదరాస్.
25-4-1911.

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి,
పండిత డి. గోపాలాచార్యులు, ఎ.వి.యస్.

అయ్యా,

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలోఁ బ్రచురించు పుస్తకముల నన్నిటిని గొనఁగోరుచున్నాఁడను.

కావున నన్ను శాశ్వతపుఁజందాదారులలో నొక్కనిగఁ జేర్చికొని యన్నిగ్రంథములు వి. పి. మూలమునఁ బంపుచుండ వలెనని ప్రార్థించుచున్నాఁడను.

ప్రవేశ రుసుముక్రింద నిందుతో రెండు అణాల పోస్టు చీట్లను పంపినాఁడను.

పేరు.

గ్రామము.

తపాలాఫీసు.

జిల్లా.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు ముద్రింపఁబోవు

# ఆయుర్వేద గ్రంథములు.

———:o:———

ఆయుర్వేద సూత్రములు (సంస్కృత వ్యాఖ్యాన సహితములు)

కాశ్యపసంహితా.
కల్యాణకారక.
ఆనందకంద.
రసార్ణవ.
రససార.
వాగ్భటమండన.
శివతత్వరత్నాకర.
షడ్విధనాడీతంత్ర.
రససిద్ధి.
భేషజతర్క.
వైద్యశతక.
రసప్రదీపము.

మొదలగు గ్రంథములు యనేక గ్రంథముల సాహాయ్యము వలనను నాయుర్వేదాశ్రమ పండితులచేతను జక్కఁగఁ బరిశోధింపంబడి ముద్రణమునకు సిద్ధముగ నున్నయవి.

మఱియుఁ బై గ్రంథములుగాని యింక నితరవైద్యగ్రంథములుగాని యెవరివద్దనైన నుండినయెడల మా కార్యాలయమునకు దయతోఁ బంపిన వందనములతో నందుకొని మా పుస్తకములతో సరిచూచుకొని పంపెదము.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలోఁ బ్రకృతము

ముద్రణలోనున్న

# గ్రంథములు.

ఆయుర్వేదపరిభాష. (సంస్కృతమూలము తెనుఁగువ్యాఖ్య)

నాడీతంత్రము. ,,

సుశ్రుతసంహిత. ,, (సచిత్రము)

మసూరిక. (అనేకాయుర్వేద గ్రంథముల, నాధార పఱుచుకొని వ్రాయఁబడిన తెనుఁగు)

విషూచి. ,,

జ్వరము. ,,

## విక్రయమునకు సిద్ధముగనుండు గ్రంథములు.

| | | రు. అ. పై. |
|---|---|---|
| మాధవనిదానము. (రాయల్ 8 పేజీలసైజు షుమారు పేజీలు 600) | | 3—0—0. |
| పథ్యాపథ్యము. (క్రౌను 16 పేజీలసైజు షుమారు 200 పేజీలు) | | |
| | శాశ్వతపుఁజందాదారులకు | 0—12—0. |
| | ,, ఇతరులకు | 1—0—0. |
| ఆయుర్వేదము. (ఉపన్యాసము) (క్రౌను 16 పేజీలసైజు పేజీలు 40) | | 0—4—0. |

పోస్టేజి ప్రత్యేకము.

పండిత డి. గోపాలాచార్యులు, ఏ. వి. యస్.

ఆయుర్వేదాశ్రమము, ౧౧, ఆచారప్పన్ వీధి,

జార్జిటవున్, మదరాస్.

# పీఠిక.

శ్రీమత్పరాత్పరునిచే సృజింపఁబడినమానవులకుఁ బలుతెఱంగులైనకారణములచే సంభవించు వ్యాధులను నివర్తింపఁజేయ నాయుర్వేదము నిర్మింపఁబడియె. అట్టి యాయుర్వేదమున ఋషిపుంగవు లనేకవిధములుగ మానవుల బాధించు జ్వరాది రోగములఁ దెలిసికొనుటకై ముఖ్యముగ నిదానములను, వాని నివారణమునకై చికిత్సలను వాని సాధ్యాసాధ్య లక్షణములను విస్తరముగ నిరూపించిరి.

మఱియు నిదానాదులచే వినిశ్చితమగు వ్యాధిసామాన్యమునందుఁ జికిత్సారంభమునకుఁ బూర్వముఁ దాయావ్యాధుల కనుకూలముగ నాచరింపఁదగిన రోగశమనోపాయములు పెక్కులుగలవు. ఇవియే పథ్యములనంబరఁగు. పథ్యమనఁగా లోకమున రూఢిగా వ్యవహరింపఁబడు నాయా వ్యాధుల నివర్తింపఁజేయు భోజనము, శాకాదులు, విహారములేగాక యౌషధరహితోపాయసామాన్యమునకుఁగూడ పథ్యమని యీ గ్రంథమున గ్రహింపఁదగును.

"వినాపిభేషజైర్వ్యాధిః పథ్యాదేవనివర్తతే। నతుపథ్యవిహీనస్య భేషజానాంశతైరపి" పథ్యనియమముగలవానికి నౌషధసేవలేకయే రోగనివర్తి కాఁగలదనియు పథ్యనియామములేనివాని కెన్నివిధములగు నౌషధసేవ జరిగినను ఫలములేదనియు నీగ్రంథాదిని బోధింపఁబడియుండుటచేతఁ బ్రతిరోగికిని నౌషధసేవనకన్న నాహారాదులయందుఁ బథ్యాపథ్యనియమములే ముఖ్యములై యున్నయవి.

అట్టి పథ్యాపథ్య నిర్ణయము చరకాది మహర్షి ప్రణీతములగు నాయుర్వేదీయ గ్రన్థములలోఁ జికిత్సాభాగములయందాయా వ్యాధుల ననుసరించి సవిస్తరముగఁ జెప్పఁబడియున్నను జికిత్సకులకనేక గ్రంథ పర్యాలోచనచేఁ

గలుగు శ్రమను నివృత్తిచేయుటకై యీ గ్రంథకర్తయగు "కవిరాజ విశ్వనాథసేన్" అనేక గ్రంథములనుండు పథ్యాపథ్యములనన్నిటి నొక్కెడఁ దెల్ప నుద్యమించి స్నేహము, స్వేదము, వమనము, విరేచనము మొదలగు కర్మలయొక్కయు, అన్నము, శాకము, యూషము, ఫలము, మాంసము, మున్నగు నాహార పదార్థములయొక్కయు, వ్యాయామాది విహారములయొక్కయు రోగములు రాకుండ ఆరోగ్యముగనుండుటకై వసంతాది ఋతువులయందు నాయా ఋతుధర్మముల ననుసరించి యాచరింపఁదగిన యాహారవిహారాది హితాహితములను జక్కఁగఁ జర్చించి "పథ్యాఽపథ్యము" అను పేర నీగ్రంథమును రచించి లోకమునకు మహోపకారము జేసెను.

ఈగ్రంథకర్త గ్రంథాంతమునఁ గనఁబఱచిన "విద్వద్భర్తురుమాపతేః ప్రఖిల సత్కీర్తేః ప్రపౌత్రస్తుయః పౌత్రశ్శ్రీతపనస్యసత్కవిమణేస్సద్వైద్యచూడామణేః। శ్రీగౌరీనరసింహసేనతనయో నిశ్శేషతన్త్రోద్భవం పథ్యాఽపథ్య వినిశ్చయం సమతనోత్ శ్రీవిశ్వనాథస్సుధీః" అను శ్లోకముచే దిగంతవ్యాప్తకీర్తిశాలియగు నుమాపతియనువానికిఁ బ్రపౌత్రుఁడనియు, కవిశ్రేష్ఠుండును వైద్యశిరోమణియునగు "తపనుఁడు" అను వానికిఁ బౌత్రుఁడనియు, గౌరీనరసింహసేనులను దంపతులకుఁ బుత్రుండనియు, "విశ్వనాథుఁ" డను పేరుకలవాఁడనియుఁ దెలియుచున్నదికాని యాతనికాలము మున్నగునవి గనఁబడవు.

మఱియు "నరసింహసేన్" అని తనతండ్రిపేరును జూపుటచే నీగ్రంథకర్త ప్రకృతకాలమున వంగదేశమునందలి 'మహామహోపాధ్యాయ కవిరాజ శ్రీద్వారకానాథసేన్' 'మహామహోపాధ్యాయ కవిరాజ విజయరత్నసేన్ కవిరంజన్' మొదలగు వైద్యప్రముఖులంబోలె వంగదేశీయుఁడనియు, సుప్రసిద్ధ కవిరాజులలో ఖ్యాతిగాంచినవాఁడనియుఁ దేటపడుచున్నది.

వెండియు సర్ శ్రీరాజారాధాకాంతదేవు బహద్దూర్ కె. సి. యస్. ఇ. గారిచేఁ బ్రకటితమగు శబ్దకల్పద్రుమమను సంస్కృత మహానిఘంటువునఁ బథ్యాపథ్యమను శబ్దమును విమర్శించునపు డీగ్రంథముయొక్క వరుసనే వారలు వాక్యరూపముగ గ్రహించియుండుటంబట్టి విశ్వనాథ కవిరాజకృత

మగు నీగ్రంథము మొదటిదో లేక వారిపమున్ననుజూచి యీవిశ్వనాథసేనులు ప్రత్యేకముగఁ బుస్తకరూపమున నీపథ్యాపథ్యమును రచించిరో నిర్ణయింపఁ జాలకున్నాఁడను.

ఈగ్రన్థమున జ్వరము, అతిసారము, క్షయము, శోఫము, కుష్ఠము మున్నగు నానావిధ వ్యాధులయందు నాచరింపఁదగిన యాహార విహారాదుల యొక్కయు, వమన, విరేచన, వస్తి, స్వేద, అభ్యఞ్జన, అపతర్పణ, బృంహణ, లఙ్ఘన, ప్రతిసారణములు మొదలగు నుపాయములయొక్కయు నుపయోగా నుపయోగ క్రమము నిర్ణయింపఁబడియుండుటంబట్టి ప్రతివైద్యునకును జికిత్సా కాలమునందిందలి విషయములు మిక్కిలి యుపకరించునవి.

మఱియు ఋతుభేదముల ననుసరించి యాహారాది నియమములనుగూడ బోధించుటంజేసి మనుజసామాన్యమునకు నాయావ్యాధుల పథ్యాపథ్యములఁ దెలియుటకై యీ గ్రన్థము మిక్కిలి యపేక్షణీయమైనది.

ఈ యాంధ్రటీక రచించుటలో విషయప్రాముఖ్యతయే ప్రధానముగ గమనింపఁబడుటనుబట్టి భాషాశైలి మొదలగు వానిలోఁ బెక్కుదోషములుండ వచ్చును. అట్టి దోషములను క్షమించి గుణములను మాత్రము గ్రహించి నాకుఁ బ్రోత్సాహము గలుగఁజేయుదురని పండితులం బ్రార్థించుచున్నాఁడను.

ఈ టీక రచించినపుడు నాకు మిక్కిలి నెక్కుడుగఁదోడ్పడి శ్రద్ధతో సంస్కరించిన విద్వాన్. బ్రహ్మశ్రీ నదురుపాటి - విశ్వనాథశాస్త్రిలవారి యెడలఁ గృతజ్ఞుఁడనైయున్నాఁడను.

ఆయుర్వేదాశ్రమం,
55 ఆచారప్పన్ వీధి
మదరాస్
25-4-1911.

డి. గోపాలాచార్యులు.

శ్రీ

పథ్యాపథ్యంబను నీ గ్రంథమునందలి

# విషయానుక్రమణిక.



☞ ఇందలి సంస్కృతరోగ నామములకుసరియగు ఇంగ్లీషు తెనుగు పేర్లను మాగ్రంథమాలలో ప్రథమగుచ్ఛముగు మాధవనిదానమునందు చూడం దగును.

శ్రీరస్తు.

శ్రీమతే శ్రీనివాసాయనమః.

శ్రీమద్ధన్వన్తరయేనమః.

# పథ్యాపథ్యము

## వివరణమను ఆన్ధ్రతాత్పర్యసహితము.

ఓంనమః ప్రజాపత్యశ్విబలభి ద్ధన్వన్తరి సుశ్రుత చరక వాగ్భట ప్రభృతిభ్యో మహద్భ్యో గురుభ్యః.

శ్లో॥ నమామి ధన్వన్తరి మాదిదేవం
సురాఽసురై ర్వన్దితపాదపద్మమ్।
లోకే జరారుగ్భయమృత్యునాశం
దాతార మీశం వివిధౌషధీనామ్॥

— మంగళాచరణము. —

మూలమ్॥ శ్రిత్వా రజస్సత్వతమాంసి విశ్వా
న్నిర్మాతి పాతి క్షిపతి స్వయం యః।
అశేషబృన్దారకబృన్దవన్ద్యః
పాయాదపాయా న్మనుజాన్గిరీశః ॥౧॥

[శ్లో॥యః క్షీరామ్బునిధే స్సుధాం సముదితాం గృహ్ణన్ స్వయం మాయయా
దేవేభ్యో వితరన్ దదా వమరతాం సమ్మోహయ న్దానవాన్।
తత్ప్రత్యా మధురాఽధరాఽమృతరసం లబ్ధ్వా చ యో నిర్వృత
శ్శ్రేయో మే నితరాం తనోతు సతతం స శ్రీనివాసో విభుః॥

ఆత్రేయ చరక సుశ్రుత వాగ్భట ముఖ్యాన్ భిషక్కులాచార్యాన్।
నత్వా తనోమి పథ్యాఽపథ్యవివరణం రమాధవా దరతః॥
పూర్వాచార్యమతా న్యపి సానుభవం పరికలయ్య హృది శశ్వత్।
అర్థార్థి విప్రార్థో మే చరితార్థో భవతు బలవదుద్యోగః॥]

తాత్పర్యము॥ సకలదేవతలచే నమస్కరించదగిన యేమహానుభావుం డగు దేవదేవుండు రజోగుణము నాశ్రయించి ప్రపంచముయొక్క నిర్మాణమును, సత్వగుణము నాశ్రయించి పరిపాలనమును, తమోగుణము నాశ్రయించి సంహారమును జేయుచుండునో అట్టి పరమేశ్వరుడు మనుజుల నపాయముల బోనడచి రక్షించుగాత.

—॥ ఈగ్రన్థమునకు ప్రామాణికత్వ నిర్ణయము. ॥—

శ్లో॥ ఆలోక్య వైద్యతన్త్రాణి యత్నా దేష నిబధ్యతే।
వ్యాధితానాం చికిత్సాసు పథ్యాపథ్యవినిర్ణయః॥ ౧॥

తా॥ జ్వరాదిరోగములచే పీడితులగు మనుజులకు చికిత్సల జేయు విషయమై పథ్యాపథ్యముల నిర్ణయమును దెల్పునట్టి యీగ్రన్థము నానావిధములగు వైద్యతన్త్రముల నన్నిటిని పరిశీలించి మిగుల ప్రయత్నముచే సమకూర్చబడు చున్నది. (ఇట్లు చెప్పుటచేత నీగ్రన్థము ప్రాచీన వైద్యతన్త్రములఁ బరిశీలించి తత్సారభూతమగు విషయములనన్నిటి నొక్కెడజేర్చి రచించబడినదిగాన ప్రామాణికమనియు, గ్రన్థబాహుళ్యములేక సులభముగ దెలిసికొనదగినదియనియు దెలియబడుచున్నది.

—॥ నిదానాది పరిజ్ఞానమున కావశ్యకత. ॥—

శ్లో॥ భిషక్సర్వేషు రోగేషు నిర్దిష్టాని యథాయథమ్।
నిదానపథ్యాఽపథ్యాని త్రీణి యత్నాద్విచిన్తయేత్॥

తా॥ వైద్యుండు ఆయారోగముల ననుసరించి నిర్ణయింపబడిన నిదానము, పథ్యము, అపథ్యము అను నీమూడిటిని ప్రతిరోగమునందును మిక్కిలి ప్రయత్నముచే నాలోచించవలెను.

—॥ రోగములయందు ముఖ్యముగ విడువదగిన యంశము. ॥—

శ్లో॥ పూర్వం సర్వగదే కుర్యాన్నిదానపరివర్జనమ్।
తేనైవ రోగాక్షీయన్తే శుష్కనీరా ఇవాఙ్కురాః॥ ౪॥

తా॥ సకలరోగములయందును మొట్టమొదట నిదానమును (రోగముల గల్గించు మిథ్యాహారవిహారాది కారణములను) విడువవలెను. అట్లు విడచినచో పాదులలో నీరెండుటచే నందుగల విత్తనముల మొలకలు నశించు కరణి రోగములు వృద్ధినొందక నశించునని భావము.

—॥ రోగములయం దపథ్యముల విడచుటకు గారణము. ॥—

శ్లో॥ రుక్షు సర్వాస్వపథ్యాని యథాస్వం పరివర్జయేత్।
తా స్త్వపథ్యైర్వివర్ధన్తే దోహదైరివ వీరుధః॥౫॥

తా॥ సర్వరోగములయందును ఆయారోగముల కపథ్యములగు నాహార విహారాదులనన్నిటిని విడువవలెను. అట్లు విడువనిచో దోహదముచే లతాదులు అకాలముననే వృద్ధినొందురీతి రోగములు మిక్కిలి వృద్ధినొందును. [ఇచ్చట దోహదమనగా వృక్షములు తీగెలు మొదలగువానిని అకాలమున వృద్ధినొందించి పుష్పింపజేయు క్రియావిశేషమని యెరుంగునది.]

—॥ పథ్యమున కావశ్యకత. ॥—

శ్లో॥ వినాపి భేషజైర్వ్యాధిః పథ్యాదేవ నివర్తతే।
న తు పథ్యవిహీనస్య భేషజానాం శతైరపి॥ ౬॥

తా॥ సకలరోగములును ఔషధములులేకున్నను పథ్యములవలననే శాన్తినొందును. పథ్యములను క్రమముగ నాచరించనివారికి అనేకౌషధముల సేవించినను రోగములు శాన్తినొందవని యెరుంగునది.

—॥ తొలుత దోషాదులను బరీక్షించి చికిత్స జేయవలెననుట. ॥—

శ్లో॥ దోషాన్ దూష్యాన్ దేశకాలౌ సాత్మ్యంసత్త్వంబలంవయః।
ప్రకృతిం భేషజం వహ్నిమాహారం చ ప్రయత్నతః॥ ౭॥

నిరీక్ష్య మతిమాన్ వైద్యశ్చికిత్సాం కర్తుముద్యతః।
పథ్యాన్ని యోజయేన్నిత్యం యథాస్వం సర్వరోగిషు॥౮॥

తా॥ వాతాదిదోషములు, రసరక్తాది దూష్యములు, దేశము, కాలము, రోగియొక్క అభ్యాసము, సత్వము, బలము, వయస్సు, ప్రకృతి, ఔషధము, జఠరాగ్ని బలము, ఆహారము, వీనినన్నిటిని ప్రయత్నపూర్వకముగ బరీక్షించి బుద్ధిమంతుండగు వైద్యుండు చికిత్సజేయ నారంభించి ఆయారోగులకు దగినట్టులు పథ్యమును నియమించవలెనని భావము.

—॥ తరుణజ్వరమునందు పథ్యములు. ॥—

శ్లో॥ వమనం లఙ్ఘనం కాలే యవాగూస్స్వేదనాని చ।
కటుతిక్తరసౌ చైవ పాచనం తరుణజ్వరే॥౯॥

తా॥ వాన్తిజేయించుట, లంకణముండుట, యవాగువును (పలచనైయుండుగంజిని) త్రాగుట, శరీరమునచెమటబుట్టించుట, కటు ( కారము ) తిక్త (చేదు) రసములుగల పదార్థముల సేవించుట, జీర్ణమునొందించు పదార్థముల సేవించుట, ఇవియన్నియు తరుణజ్వరమునందు పథ్యములైయుండును.

—॥ సన్నిపాత జ్వరములయందు పథ్యములు. ॥—

శ్లో॥ సన్నిపాతేత్విదం కుర్యాత్సర్వమామకఫాపహమ్।
అవలేహాఞ్జనం నస్యం గణ్డూషం చాయసక్రియాః॥
పాదయోర్హస్తయోర్మూలే కర్ణకూపే చ గణ్డయోః।
స్వేదో భ్రష్టకులుత్థానాంచూర్ణంఘర్షణమాచరేత్॥౧౧॥

తా॥ దోషత్రయముచే జనించిన జ్వరమునందు పైజెప్పబడిన వమనాది క్రియలును, ఆమమును కఫమును హరించుక్రియలును పథ్యములైయుండును మఱియు అవలేహము, కన్నులయందు కలికము వేయుట, నస్యమునుబీల్చుట, గండూషముజేయుట (పుక్కిలించుటకు వీలులేనటుల నోటియందు కషాయాదుల నుంచుకొని ఉమియుట), చెక్కిళ్లయందును చంకలయందును కర్ణకూపము

(నాముగుంట)నందును చెక్కిళ్లయందును లోహశలాకలచే రక్తవేయుట, చెమటబుట్టించుట, వేయించిన ఉలవలపిండిని శరీరమునందంతట బూసిగుద్దుట, ఇవియన్నియుగూడ సన్నిపాతజ్వరములయందు పథ్యములై యుండునని యెఱుంగునది.

—) తరుణజ్వరమునందపథ్యములు. (—

శ్లో॥ స్నానం విరేకం సురతం కషాయం
వ్యాయామమభ్యఞ్జనమహ్ని నిద్రామ్।
దుగ్ధం ఘృతం వైదలమాంసమిక్షు
తక్రం సురాం స్వాదు గురు ద్రవఞ్చ॥౧౨॥
అన్నం ప్రవాతం భ్రమణఞ్చ క్రోధం
త్యజేత్ప్రియత్నాత్తరుణజ్వరార్తః।

తా॥ స్నానముజేయుట, విరేచనము జేయించుకొనుట, సంభోగము జేయుట, వగరుగలవస్తువుల భుజించుట, దేహపరిశ్రమ జేయుట, అభ్యంగనము జేసికొనుట, పవటియందునిదురించుట, పాలు, నెయ్యి, పప్పు, మాంసము, మజ్జిగ, మద్యము, మధురరసము గల్గినదియు అజీర్ణకరంబును ద్రవముగల్గినదియునైన యన్నము, వీనినన్నిటిని సేవించుట, మిక్కుటమైనగాలిలోనుండుట, విశేషముగసంచరించుట, కోపబడుట, ఇవియన్నియు తరుణజ్వరముగలవానికి నపథ్యములుగాన వీనిని వదలవలెను.

—) మధ్యమజ్వరమునందు పథ్యములు. (—

శ్లో॥ పురాతనాష్షష్టికశాలయశ్చ
వార్తాకశోభాఞ్జనకారవేల్లమ్॥౧౩॥
వేత్రాగ్రమాషాఢఫలం పటోలం
కర్కోటకం మూలకపోతికాశ్చ।
ముద్గైర్మసూరైశ్చణకైః కులుత్థై

ర్వకుష్ఠకైర్వాతహరైశ్చ యూషః ॥౧౪॥
పాఠామృతావాస్తుకతణ్డులీయ
జీవన్తిశాకాని చ కాకమాచీ ।
ద్రాక్షాకపిత్థాని చ దాడిమాని
వైకఙ్కతాన్యేవ పచేళిమాని॥౧౫॥
లఘూని సాత్మ్యాని చ భేషజాని
పథ్యాని మధ్యజ్వరిణామమూని॥

తా॥ ప్రాతవియగు అరువదినాళ్లసంబావులు, రాజనములు, వంకాయలు, మునగకాయలు, కాకరకాయలు, పేముచిగురు, ఆషాఢఫలము (ఆషాఢమాసమున జనించుఫలము), పొట్లకాయ, దోసకాయ, లేతముల్లంగి, ఇవియన్నియు; పెసలు, చిఱుసెనగలు, సెనగలు, ఉలవలు, అడవిపెసలు, అను నీధాన్యములజేర్చి వాతహరౌషధములతో జేయబడినకట్టు, చిరుబొద్దికూర, తిప్పతీగె, చక్రవర్తికూర, చిట్టికూర, పాలకూర, కాచికూర, ద్రాక్షపండ్లు, వెలగపండ్లు, దానిమ్మపండ్లు, పండిన పుల్లవెలగపండ్లు, శీఘ్రముగ జీర్ణములగునవియుసాత్మ్యములునైన యౌషధములు, ఇవియన్నియును మధ్యమజ్వరముగలవారికి పథ్యములైయుండును.

—॥ జ్వరమునందు పథ్యములైన యాకుకూరలు. ॥—

శ్లో॥ బాలమూలకవాస్తూకతణ్డులీయకపర్పటాః ।
తిక్తశాకం పటోలఞ్చ గుడూచీపల్లవాన్యపి॥౧౬॥
మారిషం నిమ్బపుష్పఞ్చ కాలశాకం చ దార్వకమ్।
చాఙ్గేరీ చాపి జీవన్తీ మాచికా స్యాన్నిషణ్ణకైః॥౧౭॥
పత్రశాకప్రియాణాఞ్చ జ్వరితానాం ప్రదాపయేత్ ।

తా॥ లేతముల్లంగి, చక్రవర్తికూర, చిట్టికూర, పర్పాటకము, ఉలిమిరి, పొట్లకాయ, తిప్పతీగచిగుళ్లు, తోటకూర, వేపపువ్వు, కరేపాకు, దేవ

దారుకూర, పులిచింతాకు, పాలకూర, కాచికూర, పుల్లబచ్చలికూర, ఈయూకు కూరలన్నియు ఆకుకూరలయం దిష్టముగల జ్వరపీడితునకు మిక్కిలి హితకరములై యుండును.

—॥ జ్వరమునందు పథ్యములగు కట్టులు. ॥—

శ్లో॥ మసూరాః చణకాః ముద్గాః కులుత్థాంశ్చ మకుష్ఠకాః॥
యూషార్థం యూషసాత్మ్యానాం జ్వరితానాం ప్రదాపయేత్।

తా॥ చిరుసెనగలు, సెనగలు, పెసలు, ఉలవలు, అడవిపెసలు, ఈ ధాన్యములను కట్టుచేసి కట్టులద్రాగుటయం దలవాటుగల జ్వరితునకు నుపయోగించినచో హితకరములై యుండునని భావము.

—॥ జ్వరమునందు పథ్యములగుమాంసములు. ॥—

శ్లో॥ లావాః కపిఞ్జలా నేణాః పృషతాః శరభాః శశాః॥
కాలపుచ్ఛాః కురఙ్గాంశ్చ తథైవ మృగమాతృకాః।
మాంసార్థం మాంససాత్మ్యానాం జ్వరితానాం ప్రదాపయేత్॥

తా॥ లకుముకిపిట్ట, కాటుకపిట్ట, నల్లనియిఱ్ఱి, పొడలయిఱ్ఱి, శరభము (కాశ్మీరదేశమునందుండు సింహవిరోధియగు మృగము), కుందేలు, కాలపుచ్ఛము (నల్లనితోకకల్గి నదీతీరములబుట్టినజింక), చిన్నవియైయుండు జింకలు, కస్తూరీమృగములు ఈమృగముల మాంసములు మాంసమునుదినుటయం దలవాటుగల జ్వరితులకు హితకరములై యుండును.

—॥ జ్వరమునందు పథ్యములు గాని మాంసములు. ॥—

శ్లో॥ సారసక్రౌఞ్చశిఖిన స్తథా కుక్కుటతిత్తిరాః।
జ్వరితానాం న శస్యన్తే ఇతి కేచిద్వ్యవస్థితాః॥ ౨౦॥

తా॥ బెగ్గురుపక్షులు, కొంగలు, నెమిళ్లు, కోళ్లు, తీతువుపిట్టలు, ఈ పక్షులమాంసములు జ్వరపీడితులకు హితములు గావు అని కొందరు వచించెదరు.

—॥ జ్వరమునందు పథ్యములగు ఫలములు. ॥—

శ్లో॥ వృన్తాకం పీలు కర్కోటపటోలకకటిల్లకాః।
ఫలశాకకృతే దేయం సర్వం నిస్స్నేహమేవచ॥ ౨౨॥

తా॥ వంగపండు, వరగోగుపండు, దోసపండు, పొట్లపండు, కాకరపండు, ఈపండ్లను నూనె మొదలగు స్నేహద్రవ్యములచేర్చక కూరజేసి జ్వరపీడితులు సేవించదగును.

—॥ జ్వరమునం దాహారమున నుపయోగింపదగిన ధాన్యములు. ॥—

శ్లో॥ వత్సరోషితధాన్యస్య తణ్డులాద్యం జ్వరే హితమ్।
రోటికార్థం ప్రయోక్తవ్యం ద్వివర్షోషితమల్పశః॥ ౨౩॥
గోధూమాది యథాసాత్మ్యమన్యదప్యల్పమర్పయేత్।

తా॥ జ్వరముచే పీడింపబడినవానికి సంవత్సరకాలము ప్రాతబడిన ధాన్యముయొక్క బియ్యమును అన్నముజేసి ఉపయోగింపదగును. మఱియు రెండు సంవత్సరములకాలము ప్రాతబడిన ధాన్యముయొక్క బియ్యమును రొట్టెజేసి కొంచెము నుపయోగింపదగును. గోధుమలు మున్నగు నితరధాన్యములను వారివారి యలవాటునుబట్టి యథోచితముగ నుపయోగింపదగును.

—॥ జీర్ణజ్వరమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేచనం ఛర్దనమఞ్జనం చ
నస్యఞ్చ ధూమోఽప్యనువాసనఞ్చ।
సంశోధనం సంశమనం వ్యవాయోఽ
భ్యఙ్గోఽవగాహశ్శిరోపచారః॥ ౨౪॥
ఏణః కులిఙ్గో హారిణో మయూరో
లావశ్చశస్తిత్తిరికుక్కుటా చ।
క్రౌఞ్చః కురఙ్గః పృషతశ్చకోరః
కపిఞ్జలో వార్తికకాలపుచ్ఛౌ॥ ౨౫॥

గవామజాయాశ్చ పయోఘృతఞ్చ
హారీతకీ పర్వతనిర్ఝరామ్బుః।
ఏరణ్డతైలం సితచన్దనఞ్చ
ద్రవ్యాణి సర్వాణి పురేరితాని।
జ్యోత్స్నా ప్రియాలిఙ్గనమప్యథ స్యాత్
వర్గః పురాణజ్వరిణాం సుఖాయ॥ ౨౬॥

తా॥ విరేచనము, వమనము, కన్నులలో కలికము వేయుట, నస్యమును పీల్చుట, ధూమపానము, అనువాసనవస్తి, సంశోధనక్రియ, సంశమనక్రియ, సంభోగము, అభ్యంగనస్నానము, సరస్సులున్నగు వానియందు స్నానము జేయుట, శీతోపచారముల జేసికొనుట, ఈక్రియలన్నియు పురాతనజ్వరముగలవారికి మిక్కిలి హితకరములైయుండును. మఱియు నల్లనిజింక, పిచ్చుక, ఎఱ్ఱనిజింక, నెమలి, లావుకపిట్ట, కుందేలు, తీతువుపిట్ట, కోడి, క్రౌంచపక్షి, పొడలయిఱ్ఱి, చకోరపక్షి, కాటుకపిట్ట, వార్తికమనుపక్షి, నల్లనితోకగల జింక, ఈజంతువులమాంసంబులును, ఆవులయొక్కయు మేకలయొక్కయు పాలును, నెయ్యియు, కరక్కాయలు, కొండసెలయేటినీళ్లు, ఆముదము, తెల్లనిచందనము, ఈద్రవ్యంబులును, వెన్నెలలోసంచరించుటయు, ప్రియురాలి నాలింగనముజేసికొనుటయు, ఇవియన్నియుగూడ పురాణజ్వరమునందు మిక్కిలి పథ్యములైయుండును.

—ఆగంతుజ్వరమునందు పథ్యములు.—

శ్లో॥ ఆగన్తుజే జ్వరే నైవ నరః కుర్వీత లఙ్ఘనమ్।
అభిఘాతసముత్థానే పానాభ్యఙ్గే చ సర్పిషః॥ ౨౭॥
రక్తావసేకైర్మద్యైశ్చ తథా మాంసరసోదనైః॥
క్షతజే వ్రణజే వాపి క్షతవ్రణచికిత్సితమ్॥ ౨౮॥
ఇత్యాగన్తుజ్వరే పూర్వం భిషగ్భిః పథ్యమీరితమ్।

తా॥ ఆగన్తుక జ్వరమునందు మనుజుండు లంకణము జేయఁదగదు. మఱియు నాగంతు జ్వరములలోనభిఘాతము (దెబ్బతగులుట) చే గల్గిన జ్వర మునందు నెయ్యిద్రాగుటయు, నేతితో తలనంటుకొనుటయు ప్రశస్తము. సిరామోక్షణము, మద్యపానము, మాంసరసముతోగూడిన యన్నమును దినుట, ఇవిగూడ హితకరములైయుండును. క్షతము (గాయము)చే గల్గిన జ్వరమునందు క్షతమునకుజెప్పిన చికిత్సయు, వ్రణమువలనబుట్టిన జ్వరమునందు వ్రణముయొక్క చికిత్సయు జేయదగును. ఇత్తెరంగున నాగంతుక జ్వరము లకు దగిన పథ్యములను వైద్యులు వక్కాణించిరి.

—॥ ఓషధిగన్ధాదిజనిత జ్వరములయందు పథ్యములు. ॥—

శ్లో॥ ఓషధీగన్ధజే కుర్యాత్కార్యం చిత్తప్రసాదనమ్॥ ౨౯॥
అభిచారాభిశాపోత్థే జపహోమాది భేషజమ్।
ఉత్పాతగ్రహపీడోత్థే దానంస్వస్త్యయనాదయః॥ ౩౦॥
క్రోధోత్థితే పిత్తహరం కామజే క్రోధమేవ చ।
(క్రోధజే పిత్తజిత్కార్యా క్రియా సద్వాక్యమేవ చ)
కామశోకభయోద్భూతే సర్వా వాతహరక్రియా ॥౩౧॥
ఆశ్వాసనం చేష్టలాభో హర్షదాయీని యాని చ।
హర్షేణ చ సమాయాన్తి కామశోకభయజ్వరాః॥ ౩౨॥
విశేషతః పునశ్చాత్ర కామక్రోధసముత్థితే ।
భయశోకసముద్భూతే కామక్రోధోక్తమౌషధమ్॥ ౩౩॥
భూతాభిషఙ్గజే భూతబన్ధావేశనతాడనమ్।
అధ్వశ్రాన్తేషు చాభ్యఙ్గం దివానిద్రాఞ్చ కారయేత్॥
మనఃక్షోభసముత్పన్నే మనసస్సాన్త్వనాని చ।
ఇత్యాగన్తుజ్వరే పూర్వైర్భిషగ్భిః పథ్యమిష్యతే ॥ ౩౪॥

తా॥ ఓషధులయొక్క వాసనను మూర్కొనుటచే గల్గిన జ్వరమునందు మనస్సును నిర్మలముగ జేయు చికిత్సలచేయవలెను. అభిచార (మన్త్రతన్త్రము లచే శరీరము మనస్సు మున్నగువానికి బాధగల్గించుట) అభిశాపము (గురువులు ఋషులుమున్నగు పెద్దలచే నివ్వబడినశాపము) లచే గల్గిన జ్వరమునందు గాయత్రిమున్నగు మన్త్రముల జపముజేయుట, హోమము మొదలగు చికిత్సలజేయుట మిక్కిలి హితకరమైయుండును.

భౌమము (భూమియందుకల్గు భూకంపాదులు), దివ్యము (దేవతా ప్రభావముచేగల్గినది), అన్తరిక్షము ( ఆకసముజనించు ధూమకేతువు మున్నగునవి ) అని మూడువిధములైన ఉత్పాతములచేతను, సూర్యాదులమున్నగు గ్రహములయొక్క క్రూరత్వముచేతను జనించిన యాగంతుకజ్వరమునందు సువర్ణాదిదానము స్వస్తివాచనము మున్నగునవి పథ్యములైయుండును. క్రోధముచే గల్గినజ్వరమునందు పిత్తమునుహరించు చికిత్స జేయవలెను. కామమువలన జనించిన జ్వరమునందు క్రోధజ్వరమునకుజేయు (పిత్తహర) చికిత్స జేయనగును. కామము శోకము భయము ఈమూడిటిచే గల్గిన జ్వరములయందు వాతమును హరించు చికిత్సలన్నియు పథ్యములైయుండును.

మఱియు కామశోకభయములచే గల్గిన జ్వరములయందు రోగిని యూరడించుటయు, రోగియొక్క కోరికల దీర్చుటయు, వానిమనస్సునకు సంతోషమును గల్గించుపనుల జేయుటయు మిక్కిలి హితకరములైయుండును. అందును రోగికి మనస్సన్తోషమునుగల్గించుటవలన పైజెప్పిన మూడుకారణములచే జనించిన జ్వరము నివర్తించునుగాన ఎన్నివిధములనైన సంతోషమును గల్గించుట ముఖ్యమైనది. మఱియు కామక్రోధములచే జనించిన జ్వరములయందు విశేషముగ నొకదాని చికిత్స రెండవదానికి జేయవలెను. (అనగా కామజ్వరమునందు క్రోధజ్వరచికిత్సయు, క్రోధజ్వరమునందు కామజ్వరచికిత్సయు జేయవలెననిభావము) భయశోకములచే గల్గిన జ్వరములయందు కామక్రోధములచే జనించు జ్వరములకు జెప్పిన చికిత్స జేయవలెను, భూతప్రేతరాక్షసాదుల

వలన బుట్టిన జ్వరమునందు భూతాదులను మంత్రములచే బంధించుటయు, ఆవేశమునకు దెచ్చుటయు, కొట్టుటయు పథ్యములైయుండును. త్రోవనడచుటచే గల్గిన జ్వరమునందు అభ్యంగస్నానముజేయుటయు పవటియందు నిదురించుటయు పథ్యములైయుండును, మనస్సు కలతనొందుటచే గల్గిన జ్వరమునందు మనస్సునూరడించుట పథ్యమైయుండును. పైజెప్పినరీతిగ పురాతనవైద్యులచే నాగంతుక జ్వరములకు పథ్యక్రమము జెప్పంబడియె.

—॥ విషమజ్వరమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విషమే వమనం చైవ రేచనం కారయేద్భిషక్॥

తా॥ సన్తత - సతతక - అన్యేద్యుష్క - తృతీయక - చతుర్థకముల నెడు విషమజ్వరములయందు వమన విరేచనముల జేయించుట పథ్యములైయుండును.

—॥ సర్వజ్వరములయందును పథ్యములు. ॥—

శ్లో॥ విష్ణోర్నామసహస్రస్య పఠనం శ్రవణం శ్రుతేః ॥౩౬॥
దేవానాం బ్రాహ్మణానాం చ గురూణామపి పూజనమ్।
బ్రహ్మచర్యం తపోహోమః ప్రదానం నియమో జపః॥౩౭॥
సాధూనాం దర్శనం నిత్యం రత్నౌషధివిధారణమ్।
మఙ్గళాచరణంచైవ వర్గస్సర్వజ్వరాపహః ॥౩౮॥

తా॥ విష్ణుసహస్రనామముల పారాయణముజేయుట, వేదములవినుట, దేవతలను బ్రాహ్మణులను గురువులనుబూజించుట, సంభోగాదులనువదలి బ్రహ్మచర్యమునొందియుండుట, తపస్సుజేయుట, హోమముజేయుట, దానముజేయుట, ఆయామతములకుదగిన యాచారములతోనుండుట, మన్త్రములజపముజేయుట, సత్పురుషుల దర్శనముజేయుట, ఎల్లప్పుడును రత్నములను దివ్యౌషధులను ధరించుట, శుభముల గల్గించుకర్మలజేయుట, ఇవియన్నియు సకల జ్వరములను పోగొట్టును గాన జ్వర సామాన్యముగ నీకర్మల నవశ్యము జేయందగు,

—॥ సర్వజ్వరములయందు నపథ్యములు. ॥—

శ్లో॥ అధివాసనకర్మాణి రక్తస్రగ్వస్త్రధారణమ్।
వమివేగం దన్తకాష్ఠమసాత్మ్యమపి భోజనమ్ ॥౩౯॥
విరుద్ధాన్యన్నపానాని విదాహీని గురూణి చ।
దుష్టామ్బు క్షారమమ్లాని పత్రశాకం విరూఢకమ్॥
నలదామ్బుచ తామ్బూలం కలిఙ్గం లశునంఫలమ్।
తోడీమత్స్యఞ్చ పిణ్యాకం ఛత్రకం పిష్టవైకృతమ్ ॥
అభిష్యన్దీని చైతాని జ్వరితః పరివర్జయేత్।

తా॥ అధివాసన (అత్తరు-పునుగు-కస్తూరి మొదలగు వాసనద్రవ్యముల బూయుటచేతను, అగరు మొదలగువానిని ధూపము వేయుటచేతను శరీరమునకు బరిమళము బుట్టించు) క్రియలు, ఎఱ్ఱనిరంగుకల పుష్పమాలికలను ఎఱ్ఱనివస్త్రములను ధరించుట, వాంతిని బైటవెడలనీయక అడ్డగించుట, దన్తధావనము జేయుట, అభ్యాసములేని పదార్థముల భుజించుట, పరస్పర విరుద్ధములగు క్షీరమత్స్యాదులనొకటిగజేర్చి భుజించుట, పరస్పర విరుద్ధములగు ద్రవపదార్థముల ద్రాగుట, విదాహిపదార్థములను గురుపదార్థములను భుజించుట, దుష్టమగుజలమును ద్రాగుట, కారమును పులుపునుగల పదార్థముల భుజించుట, ఆకుగూరలదినుట, మొలకలెత్తినధాన్యములదినుట, వట్టివేళ్ళతో గలిసి పరిమళించు నీళ్ళను ద్రాగుట, తాంబూలమునుపయోగించుట, పుచ్చకాయలు, కమ్మరేగుపండ్లు, తోడియనుమత్స్యము, గానుగపిండి, కొత్తమల్లి, పిండితోజేయబడిన భక్ష్యాదులు, అభిష్యన్ది(నాసాదిరంధ్రముల స్రవింపజేయు) పదార్థములు, వీనినన్నిటిని సేవించుట, ఇవియన్నియు జ్వరమునందు పథ్యములుగావు గాన విడువవలెను.

—॥ జ్వరాన్తమున జేయదగిన పథ్యములు. ॥—

శ్లో॥ వ్యాయామఞ్చ వ్యవాయఞ్చ స్నానంచ చఙ్క్రమణానిచ॥
జ్వరముక్తో న సేవేత యావన్నో బలవాన్ భవేత్।

తా॥ దేహపరిశ్రమ జేయుట, సంభోగము జేయుట, స్నానము జేయుట, అధికముగదిరుగుట, వీనినన్నిటిని జ్వరముచే విడువబడిన మనుజుడు మరల శరీరమునకు బలముగల్గునంతవరకు సేవింపంజనదు.

—॥ అతిసారరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ వమనం లఙ్ఘనం నిద్రా పురాణాశ్శాలిషష్టికాః॥ ౪౩॥
విలేపీ లాజమణ్డశ్చ మసూరతువరీరసః।
శశోవై లావహరిణకపిఞ్జలభవా రసాః॥ ౪౪॥
సర్వే క్షుద్రఝషాః శృఙ్గీ డిణ్డిశోమధురాలికా।
తైలం ఛాగం ఘృతం క్షీరం దధి తక్రం గవామపి ॥
దధిజం వా పయోజంవా నవనీతం గవాం జయేత్।
నవం రమ్భాఫలం పుష్పం క్షౌద్రం జమ్బూఫలాని చ॥
భవ్యం సహార్ద్రకం విశ్వం శాలూకం చ వికఙ్కతమ్ ।
కపిత్థం వకుళం బిల్వం తిన్దుకం దాడిమద్వయమ్॥ ౪౭॥
తాలం వటఫలఞ్చాపి చాఙ్గేరీ విజయా కణా।
జాతీఫలం సఫేనం చ జీరకం గిరిమల్లికా॥ ౪౮॥
కుస్తుంబరు మహానిమ్బకషాయస్సకలోరసః।
అన్నపానాని సర్వాణి దీపనాని లఘూని చ॥ ౪౯॥
నాభేర్ద్వ్యఙ్గులతోఽధస్తాచ్చ స్త్రీణాం ర్ధేనువద్దహేత్।
తథానంశాస్త్రమూ లేఽపిపథ్యవర్గోఽతిసారిణామ్ ॥౫౦॥

తా॥ వమనము, లంకణము, నిదురించుట, ప్రాతవియగు రాజనముల యొక్కయు అరువదినాళ్లసంబావులయొక్కయు బియ్యము, విలేపి (బియ్యమునకన్న నాల్గింతనీళ్లుచేర్చి పక్వముచేయబడినగంజి), లాజమండము (ఒక

భాగము పేలాలును పదునాల్గుభాగములు నీళ్ళునుజేర్చి కాచబడినగంజి), చిరు సెనగలయొక్కయు కందులయొక్కయుకట్టు, కుందేలు, తీతువుపిట్ట, జింక, కౌజుకపిట్ట, ఈజంతువులమాంసరసము, చిన్నచేపలు, శృంగియనుమత్స్యము, డిండిశమనుమత్స్యము, మధురాలిక, (ఇయ్యది సూక్ష్మాకారముగల మత్స్య విశేషము) నూనె, మేకలయొక్కయు ఆవులయొక్కయు నెయ్యి, పాలు, పెరుగు, మజ్జిగ, ఆవులయొక్క పెరుగుచేనైనను పాలచేనైనను గల్గినవెన్న, లేత అరటికాయ, అరటిపువ్వు, తేనె, నేరేడుపండ్లు, భవ్యఫలము (ఇయ్యది స్వనామప్రసిద్ధవృక్షము), అల్లము, శుంఠి, దామరదుంప, పుల్లవెలగపండ్లు, వెలగపండు, పోగడపండ్లు, మారేడుపండ్లు, తుమ్మిపండ్లు, తియ్యదానిమ్మపండ్లు, పుల్లదానిమ్మపండ్లు, తాటిపండ్లు, మర్రిపండ్లు, పులిచింతాకు, గంజాయి, పిప్పళ్ళు, జాజికాయ, అభిని, జీలకఱ్ఱ, కొడిసెపాల, దనియాలు, పెద్దవేము, కషాయ రసముగల సకల పదార్థములు, ఇవియన్నియు నతిసార రోగమునందు పథ్యములైయుండును.

మఱియు నగ్ని నిదీపింపజేసి యాకలిగల్గించునవియు, శీఘ్రముగ జీర్ణము లగునవియునైన యన్నపానములును హితకరములైయుండును. బొడ్డుకు రెండం గుళములక్రింది ప్రదేశముననను వెన్నెముకకు క్రిందిభాగముననను శస్త్రముచేత నర్ధచంద్రునియాకారమువలె లోహశలాకలచేత రక్తు వేయుటయుహితకరము.

—॥ అతిసారమునందు జలపాననియమము. ॥—

శ్లో॥ దశాంశం షోడశాంశం వా శతాంశం వా శృతంజలమ్।
సుశీతం పాచనం గ్రాహి దీపనం దోషనాశనమ్ ॥౫౧॥
యథాయథాశృతం తోయం జ్వరాతీసారిణోభవేత్।
దీపనం పాచనం గ్రాహి ఆరోగ్యం చ తథాతథా ॥౫౨॥

తా॥ నీళ్ళను పదిభాగములైనను పదునారుభాగములైనను నూరుభాగ ములైనను మిగులునట్టులు చుండకాచి చల్లనగునట్టులు ఆర్చి అతిసారవ్యాధి

గలవారికి త్రాగించినచో విరేచనములబంధించి యగ్నిని దీపింపజేసి యాకలి బుట్టించి దోషములహరించును. మఱియు జ్వరాతిసారములుగలవారికి ఎంత అతిశయముగకాచి యుపయోగించినను మిక్కిలి హితకరమై యగ్నినిదీపింప జేసి భుజించబడిన యాహారపదార్థముల జీర్ణింపజేసి విరేచనములబంధించి శరీరమునకు మిక్కిలి సౌఖ్యమునుగల్గించును.

—॥ అతిసారమునందపథ్యములు. ॥—

శ్లో॥ స్వేదోఽఞ్జనం రుధిరమోక్షణమమ్బుపానం
స్నానం వ్యవాయమపి జాగరధూమనస్యమ్।
అభ్యఞ్జనం పలల వేగవిధారణఞ్చ
రూక్షాణ్యసాత్మ్యమశితఞ్చ విరుద్ధమన్నమ్ ॥౫౩॥
గోధూమమాషభవవాస్తుకకాకమాచీ
నిష్పావకఞ్చ మధుశిగ్రు రసాలపూగమ్।
కూశ్మాణ్డ తుమ్బి బదరం గురు చాన్నపానం
తామ్బూలమిక్షుగుడమద్యముపోదికాఞ్చ ॥౫౪॥
ద్రాక్షామ్లవేతసఫలం లశునఞ్చ ధాత్రీ
దుష్టామ్బు మస్తు గృహవారి చ నారికేళమ్।
సంస్నేహనం మృగమదాఖిల పత్రశాకాః
క్షారం రసా హి సకలాశ్చ పునర్నవా చ ॥౫౫॥
ఉద్గారకం లవణమమ్లమపి ప్రకోపం
వర్జ్యోఽతిసారగదపీడితమానవేషు।

తా॥ శరీరమున చమటబుట్టించుట, కండ్లలో కలికము వేయుట, రక్తము వెడలించుట, నీళ్ళుత్రాగుట, స్నానము జేయుట, సంభోగము జేయుట,

రాత్రులయందు నిదురమేల్కొంచియుండుట, పొగనుపీల్చుట, అభ్యంగ స్నానము జేయుట, మాంసమునుదినుట, మలమూత్రాది వేగముల నిరోధించుట, రూక్షములగు పదార్థముల సేవించుట,తనకు అభ్యాసము లేని పదార్థముల భుజిం చుట,పరస్పరవిరుద్ధములగు భోజనపదార్థముల భుజించుట,గోధుమలచేతను మినుములచేతను చేయబడిన పదార్థముల భుజించుట, చక్రవర్తికూర, కాచికూర, అనుములు,ఎఱ్ఱని మునగకాయలు, తియ్యమామిడిపండ్లు,వక్కలు,గుమ్మడికాయ, సొరకాయలు, రేగుపండ్లు, అజీర్ణకరములగు నన్నపానములు, తాంబూలము, చెఱకు, బెల్లము, మద్యము, బచ్చలికూర, ద్రాక్షపండు, చింతపండు, ఉల్లి గడ్డలు, ఉసిరికకాయలు, చెడిననీళ్ళు, పెరుగుమీది తేటనీరు, ఎండనుగాలిని సోకనీయక ఇంటిలోనుంచబడిననీళ్ళు, కొబ్బరికాయలు, ఈవస్తువులసేవిం చుట, స్నేహనకర్మ జేసికొనుట, కస్తూరి, అన్నివిధములగు ఆకుకూరలు, క్షార ముగల వస్తువులు, పలుదెరంగులగు మాంసరసములు, గలిజేరుకూర, దోసకా యలు, ఉప్పు, పులుసుగల వస్తువులు, అధికకోపము ఇవియన్నియు నతిసార రోగమునందు అపథ్యములు.

## సంగ్రహణీ రోగమునందు పథ్యములు.

శ్లో॥ నిద్రా చ్ఛర్దనలఙ్ఘనం చిరభవా యే శాలయష్షష్టికాః
మణ్డో లాజకృతో మసూరతువరీముద్గప్రసూతారసాః।
నిశ్శేషోద్ధృతసారమేవదధి యత్సక్షీరజాతం గవామ్
ఛాగ్యా వా నవనీతమేవ విమలం తద్వత్పయస్సమ్భవం॥
ఛాగిన్యాజపయోదధీని తిలజం తైలం సురా మాక్షికం
శాలూకం వకుళశ్చ దాడిమయుగం నవ్యాని భవ్యాని చ।
రమ్భాయాః కుసుమం ఫలం చ తరుణంబిల్వాశ్చశృఙ్గాటకం
చాఙ్గేరీ విజయా కపిత్థ కుటజాఽజాజీ కసేరూణి చ॥౫౭॥
తక్రం కంచటపల్లవం చ తిలకం జాతీఫలం జామ్బవం

ధాన్యాకానిచతిన్దుకానిచమహానిమ్బోఽరుణాఫేనవత్ ।
క్రవ్యాల్లావశశైణతిత్తిరరసాః క్షుద్రా ఝషాస్సర్వశః
ఖుడ్డీశో మధురాలికా చ ఖలిశః సర్వం కషాయోరసః ॥
నాభేర్ద్వ్యఙ్గుళకాదధోఽర్ధశశివద్వాం శాస్థిమూలే తథా
దాహాః ప్రజ్వలితాయసా చ కథితంపథ్యంగ్రహణ్యాతురే॥

తా॥ నిద్ర, వమనము జేయించుట, లంకణము, ప్రాతవియగు రాజనములయొక్కయు అరువదినాళ్లసంబావులయొక్కయు బియ్యము, లాజమండము (పేలాలు ఒకభాగమును నీళ్ళుపదునాల్గు భాగములను జేర్చి పక్వము జేయబడినగంజి), చిరుసెనగలు, కందులు, పెసలు, ఈనూడిచే చేయబడినకట్టులు, పాలంతయుచుండి నెయ్యిమాత్రము మిగులునట్టులు కాచబడిన పాలచే సిద్ధమైన పెరుగు, ఆవులయొక్కయు మేకలయొక్కయు పాలవలన జనించిన వెన్న, మేకలయొక్కయు గొఱియలయొక్కయు పాలు, వాని పెరుగు, నువ్వులనూనె, మద్యము, తేనె, తామరదుంపలు, పొగడకాయలు, నూతనమైనవియు మనోహరములునైన పుల్లదానిమ్మపండ్లు, తియ్యదానిమ్మపండ్లు, లేతయరటిపువ్వు, లేతయరటికాయలు, మారేడుపిందెలు, దుప్పగడ్డ, పులిచింతాకు, గంజాయి, వెలగపండ్లు, కొడిసెపాల, జీలకఱ్ఱ, నమ్మదుంప, మజ్జిగ, నీటిలో బుట్టిన చిట్టిగూర, లొద్దుగు, జాజికాయ, నేరేడుపండ్లు, దనియాలు, తుమ్మికాయలు, పెద్దవేము, మంజిష్టి, అభిని, మాంసమునుతినునట్టి బోరువయనుపక్షియొక్కయు, లాఘుకపిట్టయొక్కయు కుందేటియొక్కయు జింకయొక్కయు తీతువుపిట్టయొక్కయు మాంసరసములు, నానావిధములగు చిన్నచేపలు, ఖుడ్డీశ మధురాలిక ఖలిశ అనుమత్స్యములు, కషాయ (వగరు) రసముగల యన్నిపదార్థములు, ఇవియన్నియు గ్రహణీరోగముగలవారికి పథ్యములైయుండును.

మఱియు బొడ్డుకు రెండంగుళములు క్రిందిభాగమునను వెన్నెముకకు క్రిందిప్రదేశమునను అర్ధచంద్రుని యాకారమువలె కాలిన యినపఖడ్డిచే దాహకర్మ జేయుట మిగుల హితకరమైయుండును.

—॥ గ్రహణీరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ రక్తస్రుతిం జాగరమమ్బుపానం
స్నానం స్త్రియం వేగవినిగ్రహాంశ్చ।
నస్యాఞ్జనం స్వేదనధూమపానం
శ్రమం విరుద్ధాశనమాతపం చ ॥౬౦॥
గోధూమనిష్పావకలాయమాష
యవార్ద్రకచ్ఛత్రకరాజమాషాన్ ।
ఉపోదికావాస్తుకకాకమాచీ
కూశ్మాణ్డతుమ్బామధుశిగ్రుకన్దాన్ ॥౬౧॥
తామ్బూలమిక్షుం బదరం రసాలం
ఐర్వారుకం పూగఫలం రసోనమ్।
ధాన్యామ్లసౌవీరతుషోదకాని
దుగ్ధం గుడం మస్తు చ నారికేళమ్ ॥౬౨॥
పునర్నవాం బార్హతవైణవాని
సర్వాణి శాకాని చ పత్రవన్తి।
దుష్టామ్బు గోవారి కురఙ్గనాభి
క్షారం సమస్తాని సరాణి చాపి ॥౬౩॥
ద్రాక్షాం తథామ్లం లవణం రసం చ
గుర్వన్నపానం సకలాంశ్చ పూపమ్।
వైద్యశ్చికిత్సన్ గ్రహణీవికారం
వివర్జయేత్సన్తతమప్రమత్తః ॥౬౪॥

తా॥ రక్తమోచనము జేయుట, నిదుర మేల్కొనియుండుట, నీళ్ళు ద్రాగుట, స్నానము జేయుట, సంభోగము జేయుట, మలమూత్రాది వేగముల నిరోధించుట, నస్యమును పీల్చుట, కన్నులలో కలికము వేసికొనుట, చెమట వెడలించుట, పొగ ద్రాగుట, దేహమునకు శ్రమను కల్గించుట, పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యములు, క్షీర అమ్లములు మున్నగువాని నొకటిగ జేర్చిన పదార్థముల భుజించుట, ఎండలోనుండుట, ఇవియన్నియు; గోధుమలు, అనుములు, పటూణిలు, మినుములు, యవలు, అల్లము, కొత్తిమల్లి, అలచందులు, బచ్చలికూర, చక్రవర్తికూర, కాచికూర, ఈయాకుకూరలు, గుమ్మడికాయ, తుమ్మికాయ, ఎఱ్ఱనిమునగకాయ, కందగడ్డ, ఈకూరలు; తాంబూలము, చెఱుకు, రేగుపండ్లు, తీయమామిడిపండ్లు, దోసకాయలు, పోకలు, వెల్లుల్లి, ధాన్యామ్లము (కలినీళ్ళు), సౌవీరకము (అనగా యవల పైపొట్టుదీసి యుడికించి అందుదకమును బోసి పైనమూసి చీరమన్నిచ్చి ఒకటి రెండు దినము లుంచినకాంజికము), తుషోదకము (కడుగునీళ్ళు), పాలు, బెల్లము, పెరుగు మీది తేటనీరు, టెంకాయలు, గలిజేరు, ములకకాయలు, వెదురుబియ్యము, నానావిధములగు ఆకుకూరలు, దుష్టమైనజలము, గోమూత్రము, కస్తూరి, క్షారము, విరేచనమగు అన్ని పదార్థములు, ద్రాక్షపండ్లు, అమ్ల (పులుపు) లవణ (ఉప్పు) రసములు, అజీర్ణకరములగు నన్నపానములు, నానావిధములగు భక్ష్యములు, ఇవియన్నియు గ్రహణీరోగమునందు పథ్యములుగావు కాన అట్టి రోగికి చికిత్స జేయు వైద్యుండు మిక్కిలి మెలకువతో పైజెప్పబడిన వాటి నన్నిటిని సేవించకుండునట్లు చేయవలెను.

—॥ అర్శోరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేచనం లేపనరక్తమోక్షం
క్షారాగ్నిశస్త్రాదిచరితం చ కర్మ ।
పురాతనా లోహితశాలయశ్చ
సషష్టికాశ్చాపి యవాః కులుత్థాః ॥౬౫॥

పటోలధత్తూరరసోనవహ్ని
పునర్నవాసూరణహస్తికాని ।
జీవన్తికా దన్తశఠా సురా చ
శుణ్ఠీవయస్యా నవనీతతక్రమ్ ॥౬౬॥
కర్కోలధాత్రీరుచకం కపిత్థం
ఔష్ట్రాణి మూత్రాజ్యపయాంసి చాపి।
భల్లాతకం సర్షపజఞ్చ తైలం
గోమూత్రసౌవీరతుషోదకాని ॥౬౭॥
గోధాఖులోమాని ఖరోష్ట్రలోమ
శ్వావిత్కలిఙ్గానకధాతకీశాః ।
తరక్షువాసాశ్చ మృగాలికాకా
యేఽత్యల్పమాంసాః ప్రసహాశ్చ తేఽపి ॥౬౮॥
వాతాపహం యచ్చ యదగ్నికారి
తదన్నపానం హితమర్శసేభ్యః॥

తా॥ విరేచనము, గుదస్థానమునపట్టువేయుట, రక్తమోక్షణము, క్షారము చేతను అగ్నిచేతను శస్త్రములచేతను గుదాంకురముల నశింపజేయుట, ప్రాతవియగు ఎఱ్ఱవరివడ్లు, అరువదినాళ్ళసంబావులు, యవలు, ఉలవలు, పొట్లకాయ, ఉస్మెత్త, వెల్లుల్లి, చిత్రమూలము, గలిజేరు, కంద, చక్రవర్తికూర, పాలకూర, నిమ్మకాయలు, మద్యము, శొంఠి, కరకకాయలు, వెన్న, మజ్జిగ, తక్కోలములు, ఉసిరికకాయలు, మాదీఫలములు, వెలగకాయలు, ఒంటెలయొక్క మూత్రము నెయ్యి పాలు, జీడిగింజలు, ఆవనూనె, గోమూత్రము, సౌవీరకమను కాంజికము, కడుగునీళ్ళు, ఉడుము, ఎలుక, గాడిదె, ఒంటె ఈజంతువుల రోమములచే పొగవేయుట, ముండ్లపంది, ఊరపిచ్చుకలు, ధాత, కోతి, శివంగి, వాస, మృగాలి, కాకి, ఈజంతువులయొక్కయు, మిగుల

స్వల్పముగ శరీరమునందు మాంసము గల్గిన మృగాదులయొక్కయు, కంచరగాడిదె మున్నగు ప్రసహ (బలాత్కారముగ భుజించు స్వభావముగల) మృగపక్ష్యాదులయొక్కయు, మాంసములు, ఇవియన్నియును; వాతహరంబులును జఠరాగ్నిని దీపింపజేయునవియునైన నానావిధాన్నపానంబులును అర్శోరోగము (మూలవ్యాధి) గలవారికి మిగుల పథ్యములు.

—॥ అర్శోరోగమునందు అపథ్యములు ॥—

శ్లో॥ ఆనూపమామిషం మత్స్యం పిణ్యాకందధి పిష్టకమ్।
మాషాన్ కరీరం నిష్పావం తణ్డులాన్ తుమ్బ్యపోదికాః॥
పక్వామ్రం శాలుకం సర్వం విష్టమ్భీని గురూణి చ।
ఆతపం జలపానాని వమనం వస్తికర్మ చ ॥౨౧॥
విరుద్ధాని చ సర్వాణి మారుతం పూర్వదిగ్భవమ్।
వేగావరోధః స్త్రీపృష్ఠయానముత్కటకాసనమ్ ॥౨౨॥
యథాస్వం దోషలం చాన్నమర్శసాం పరివర్జయేత్।
యత్పథ్యం యదపథ్యం చ వక్ష్యతే రక్తపిత్తినామ్ ॥౨౩॥
రక్తార్శోరోగిణాం తత్తదపి విద్యాద్విశేషతః।
యానం పానం దివాస్వప్నం గుర్వన్నమతిభోజనమ్ ॥౨౪॥
వ్యవాయం కలహం చాపి క్షుతక్షారవిధిం త్యజేత్।
యదుక్తమర్శసామాదౌ భైషజ్యం పథ్యమేవ చ ॥౨౫॥
తదేవచర్మకీలానాం కార్యం దోషాదిభేదతః।

తా॥ జలసమీపమునందుండు జంతువులమాంసము, మత్స్యములు, గానుగపిండి, పెరుగు, పిండిచేజేయబడిన భక్ష్యములు, మినుములు, వెదురుమోపు, అనుములు, బియ్యము, సొరకాయ, బచ్చలికూర, మామిడిపండ్లు, తామరకలువ మున్నగువానిదుంపలు, మలమును వెడలనీయక బంధించునవియు అజీర్ణకరంబులునైన సకల పదార్థములు, ఎండలోనుండుట, నీళ్ళను విశేషముగ

ద్రాగుట, వాంతిజేయించుట, వస్తికర్మ, పరస్పర విరుద్ధములగు నాహార పదార్థములు, తూర్పుదిక్కునుండి వీచునట్టి గాలిని సేవించుట, మలమూత్రాది వేగముల నిరోధించుట, స్త్రీసంభోగముజేయుట, గుఱ్ఱములు ఏనుగులు మున్నగు వాహనములపై నెక్కి సవారిజేయుట, ఉన్నతమైన యాసనముపై గూర్చుండుట, అర్శోరోగము వాతాదిదోషములలో నేదోషముచే జనించియుండునో అట్టిదోషమును ప్రకోపింపజేయు పదార్థముల సేవించుట, ఇవియన్నియు నర్శోరోగమునందపథ్యములుగాన వీనిని విడువవలెను.

మఱియు రక్తపిత్తవ్యాధికలవానికి క్రిందజెప్పంబడు పథ్యాపథ్యములన్నియు రక్తముచే జనించిన యర్శోరోగముగలవారికిని పథ్యాపథ్యములై యుండునని యెరుంగునది. మఱియు నట్టి రక్తార్శోరోగముగల మనుజుడు గుఱ్ఱమున్నగు వాహనములపై నెక్కి సవారిజేయుట, అధికముగ నీళ్ళద్రాగుట, పగటియందునిదురించుట, అజీర్ణకర పదార్థముల సేవించుట, అధికముగ భుజించుట, స్త్రీసంభోగము జేయుట, కలహమాడుట, గుదస్థానమున గల్గు గాయములయందు క్షౌరమునుంచుట, వీనినన్నిటిని విడువవలెను.

ఇత్తెరంగున నర్శోరోగమునకు జెప్పిన పథ్యములును చికిత్సలును చర్మకీలమను వ్యాధియందును ఆయాదోషముల ననుసరించి పథ్యములై యుండునని యెఱుంగునది.

—॥ అగ్నిమాంద్యాజీర్ణరోగములయందు పథ్యములు. ॥—

శ్లో॥ శ్లైష్మికే వమనం పూర్వం పైత్తికే మృదు రేచనమ్॥ ౭౬॥
వాతికే స్వేదనం బాష్పం పథ్యాపథ్యం హితం హి యత్।
నానాప్రకారో వ్యాయామో దీపనాని లఘూని చ॥ ౭౭॥
బహుకాలసముత్పన్నా ముద్గలోహితశాలయః।
విలేపీ లాజమణ్డశ్చ మణ్డో ముద్గరస స్తథా॥ ౭౮॥
ఏణో బర్హీ శశో లావః క్షుద్రమత్స్యశ్చ సర్వశః।

శాలించ శాకం వేత్రాగ్రం వాస్తుకం బాలమూలకమ్॥ ౭౯॥
లశునం వృద్ధకూశ్మాండం నవీనం కదలీఫలమ్ ।
శోభాఞ్జనం పటోలఞ్చ వార్తాకం నలదామ్బు చ॥౮౦॥
కర్కోటకం కారవేల్లం బార్హ్మతంచ మహార్ద్రికమ్।
ప్రసారిణీ కాకమాచీ చాంగేరీ సునిషణ్ణకమ్॥౮౧॥
ధాత్రీఫలం నాగరఙ్గం దాడిమం యవపర్పటాః।
అమ్లవేతసజమ్బీరం మాతులుఙ్గానిమౌక్తికమ్ ॥౮౨॥
నవనీతం ఘృతం తక్రం సౌవీరకతుషోదకమ్।
ధాన్యామ్లం కటుతైలఞ్చ రామఠం లవణార్ద్రకమ్ ॥౮౩॥
యవానీ మరిచం మేథీ ధాన్యాకం జీరకం దధి।
తామ్బూలం తప్తసలిలం కటుతిక్తౌరసౌతథా ॥౮౪॥
మన్దానలేఽప్యజీర్ణే చ పథ్యమేతన్నృణాం భవేత్ ।

తా॥ అగ్నిమాంద్యాజీర్ణములు శ్లేష్మమువలనబుట్టినచో తోలుతవమనంబును, పిత్తమువలనబుట్టినయెడ మృదుకోష్ఠముగలవానికి జెప్పబడిన విరేచనంబును, వాతముచేగల్గినచో బాష్పస్వేదంబును (ఆవిరినిపట్టి శరీరమున చెమటను వెడలించుట) మిక్కిలి హితకరంబులైయుండును.

మఱియు నానావిధములగు దేహపరిశ్రమములు, జఠరాగ్నిని దీపింపజేయునవియు శీఘ్రముగ జీర్ణంబులగునవియునైన పదార్థములు, మిక్కిలి ప్రాతవియగు పెసలు, ఎఱ్ఱవరివడ్లబియ్యము, విలేపి (విశేషముగ మెతుకులుండునట్లులు కాచబడినగంజి), లాజమణ్డము (పేలాలనుజేర్చి గంజికాచి బాగుగా పిసికి వడగట్టబడిననీరు), మణ్డము (గంజికాచి అందుగల మెతుకులను వడగట్టియెత్తబడిననీరు), పెసలకట్టు, జింక, నెమలి, కుందేలు, లావుకపిట్ట, ఈజంతువులమాంసము, చిన్నచేపలు, శాలిశాకము, వేముచిగురు, చక్రవర్తి

కూర, లేతముల్లంగి, ఉల్లిగడ్డలు, గుమ్మడిపండు, లేతఅరటికాయలు, మునగకాయలు, పొట్లకాయలు, వంకాయలు, వట్టివేళ్ళచే పరిమళించుజలము, దోసకాయలు, కాకరకాయలు, ములకకాయలు, అల్లము, గొంతెమగోరు, కాచికూర, పులిచింతాకు, నీరుచెంచలి, ఉసిరికకాయలు, నారింజపండ్లు, దానిమ్మపండ్లు, యవలు, పర్పాటకము, పుల్లప్రబ్బలి, నిమ్మకాయలు, మాదీఫలములు, తేనె, వెన్న, నెయ్యి, మజ్జిగ, సౌవీరకమను కాంజికము, కడుగునీళ్ళు, పులిసినగంజి, ఆవనూనె, ఇంగువ, ఉప్పు, శుంఠి, ఓమము, మిరియాలు, మెంతులు, దనియాలు, జీలకఱ్ఱ, పెరుగు, తాంబూలము, వేడినీళ్లు, కటు (కారము) తిక్త (చేదు) రసములుగల పదార్థములు, ఇవియన్నియును అగ్నిమాంద్యమునందును అజీర్ణమునందును పథ్యములైయుండును.

—॥ అగ్నిమాంద్యాజీర్ణాది రోగములయం దపథ్యములు. ॥—

శ్లో॥ విరేచనాని విణ్మూత్రవాతవేగవిధారణమ్॥౨౫॥
అతివేలఞ్చాధ్యశనం జాగరం విషమాశనమ్ ।
రక్తస్రుతింశిమ్బిధాన్యంమత్స్యంమాంసముపోదికామ్॥
జలపానం చ విష్టమ్భం జామ్బవం సర్వశాలుకమ్।
కూర్చికాం మోరటం క్షీరం కిలాటం చ ప్రపానకమ్॥
తాలాస్థి సస్యం తద్వాలం స్నేహానం దుష్టవారి చ।
విరుద్ధాసాత్మ్యపానాన్నం విష్టమ్భీని గురూణి చ॥౨౭॥
అగ్నిమాన్ద్యేఽప్యజీర్ణే చ సర్వాణి పరివర్జయేత్ ।
ఫలవర్తిం వమిం స్వేదం లఙ్ఘనం చాపతర్పణమ్॥౨౯॥
విశేషాదలసే కుర్యాత్ విసూచ్యామతిసారవత్।
పాదదాహోఽతివృద్ధాయాస్సమ్యగ్దీపనపాచనమ్ ॥౩౦॥

తా॥ విరేచనము జేసికొనుట, మల మూత్ర వాత వేగముల నిరోధించుట, మితిమీరిభుజించుట, భుజించబడిన యాహారము జీర్ణముగాకుండ

నపుడు మరల భుజించుట, రాత్రులయందు నిదురమేల్కాంచియుండుట, న్యూనాధికముగభుజించుట, రక్తమోక్షణము జేసికొనుట, కందులు పటాణులున్నగు శింబిధాన్యములు, మత్స్యములు, మాంసము, బచ్చలికూర, అధికముగ జలమును పానము జేయుట, మలమును బంధించు పదార్థములు, సేరేడు పండ్లు, దామరకలువలు మున్నగువాని దుంపలు, కూర్చిక (పాలలోసమ భాగముగ పెరుగునైనను మజ్జిగనైనను కలిపి కాచినయ్యది కూర్చికయన బడును), మోరటము (ఆవు యీనినదినము మొదలు జేసి యేడురాత్రులకు లోపల పితకబడినపాలు), కిలాటము (ముద్దయగు నంతవరకు కాచబడినపాలు, లేక పైజెప్పబడిన కూర్చికలో ముద్దయైయుండు జున్ను), పానకము, తాటికాయలోని విత్తనము, దనియాలు, వట్టివేరు, స్నేహనకర్మ, చెడిననీళ్ళు, పరస్పర విరుద్ధంబులును శరీరతత్వమున కిమడకుండునవియునైన యన్నపానములు, మలమును బంధించునవియు అజీర్ణకరంబులునైన పదార్థములు, వీని నన్నిటిని అగ్నిమాంద్యమునందును అజీర్ణరోగమునందును విడువవలెను.

మఱియు ఫలవర్త్తి, (మంగకాయ మొదలగువాని చూర్ణమును మెత్తగ నూరి కణిక జేసి గుదద్వారమున నుంచుట), వమనకర్మ, స్వేదనము, లంకణము, తృప్తిగాకుండునట్టులు భుజించుట, ఇవి యన్నియును అలసకమను వ్యాధియందు జేయందగును, విసూచి (వాంతిభేది) యను రోగమునందు అతిసారమునజెప్పిన పథ్యాపథ్య క్రమము నెరుంగునది. అట్టి విసూచి మిక్కిలి వృద్ధినొందినచో పాదములయందు రక్షులవేయుట మిగుల ప్రశస్తము. అగ్నిని దీపింపజేసి భుజించబడిన యాహారపదార్థమును జీర్ణింపజేయు పదార్థముల భుజించుటయు పథ్యముగనుండును.

—॥ క్రిమిరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఆస్థాపనం కాయశిరోవిరేచనం
ధూమః కఫఘ్నాని శరీరశోధనమ్ ।
చిరంతనా శ్శైణవరక్తశాలయః

పటోలవేత్రాగ్రరసోనవాస్తుకమ్ ॥౬౧॥
హుతాశమన్దారదళాని సర్షపాః
నవీనమోచం బృహతీఫలాన్యపి।
తిక్తాని తాలీసదళాని మూషికం
మాంసం విడఙ్గం పిచుమన్దపల్లవమ్ ॥౬౨॥
తైలం తిలానామథ సర్షపోద్భవం
సౌవీరశుక్తం చ తుషోదకం మధు।
పచేళిమం తార మరుష్కరం గవాం
మూత్రశ్చ తాముఃబలసురామృగం రజః ॥౬౩॥
ఔష్ట్రాణి మూత్రాజ్యపయాంసి రామఠం
ఖరోఽజమోదా ఖదిరశ్చ వత్సకమ్।
జమ్బీరనీరం సుషవీయవానికా
స్నారాస్నురాహ్వగురుశింశపోద్భవః ॥౬౪॥
తిక్తః కషాయః కటుకో రసోఽయం
వర్గో నరాణాం క్రిమిరోగహారీ।

తా॥ ఆస్థాపనవస్తికర్మ జేయుట, విరేచనము జేసికొనుట, శిరోవిరేచనము జేసికొనుట, పొగనుపీల్చుట, కఫహరములగు నౌషధాదుల సేవించుట, శరీరశోధన జేయుట, ప్రాతవియగు వెదురుబియ్యము, ఎఱ్ఱవరివడ్లబియ్యము, పొట్లకాయలు, పేముచిగురు, వెల్లుల్లి, చక్రవర్తికూర, చిత్రమూలపుఆకు, వేపాకు, ఆవాలు, లేతయరటికాయ, ములకకాయలు, చేదుగల పదార్థములు, తాళిసపత్రి, ఎలుకమాంసము, వాయువిడంగములు, వేపచిగుళ్లు, నువ్వులనూనె, ఆవనూనె, సౌవీరకమను కాంజికము, (పొట్టులేనియవలనైనను గోధుమలనైనను జేర్చి పక్వము జేయబడిన కాంజికము) శుక్తము (పులిసినగంజి),

కుడితినీళ్లు, తేనె, వెండిభస్మము, జీడిగింజలు, గోమూత్రము, తాంబూలము, కల్లు, కస్తూరి, ఒంటెయొక్కమూత్రము, దానినెయ్యి, దానిపాలు, ఇంగువ, క్షారముగలపదార్థములు, ఓమము, చంద్ర, కొడిసెపాల, నిమ్మకాయలరసము, నల్లజీలకఱ్ఱ, బొంత ఓమము, దేవదారు, అగరు, శింశపావృక్షమునబుట్టిన ఫలాదులు, తిక్త (చేదు) కషాయ (వగరు) కటు (కారము) రసములుగల పదార్థములు, ఇవియన్నియు క్రిమిరోగమును హరించును గాన మిగుల పథ్యములైయుండును.

—॥ క్రిమిరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ ఛర్దిఇచ్ఛా తద్వేగవిధారణం చ
విరుద్ధపానాశనమహ్ని నిద్రామ్॥౯౫॥
ద్రవం చ పిష్టాన్నమజీర్ణభోజనం
ఘృతాని మాషాన్ దధి పత్రశాకమ్।
మాంసం పయోఽమ్లం మధురం రసం చ
క్రిమీన్ జిఘాంసుః పరివర్జయేదిమాన్ ॥౯౬॥

తా॥ వమనము జేసికొనుట, తనంతటగల్గినవమనమును వెడలనీయక నిరోధించుట, పరస్పరవిరుద్ధములగు నన్నపానముల సేవించుట, పవటియందు నిదురించుట, ద్రవపదార్థములను, పిండిచే జేయబడిన పదార్థములను, జీర్ణముకాని పదార్థములను భుజించుట, నెయ్యి, మినుములు, పెరుగు, ఆకుకూరలు, మాంసము, పాలు, అమ్ల (పులుపు) మధుర (తీపు) రసములుగల పదార్థములు, ఈపదార్థముల సేవించుట, వీనినన్నిటిని క్రిమిరోగముల పోగొట్ట దలచినవాడు విడువవలెను. ఇవియపథ్యములుగాన విడువందగునని భావము.

—॥ పాండురోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఛర్దిర్విరేచనం జీర్ణా యవగోధూమశాలయః।
ముద్గాఢకీమసూరాణాం యూషా జాఙ్గలజా రసాః ॥౯౭॥

పటోలం వృద్ధకూష్మాండం తరుణం కదళీఫలమ్।
జీవన్తీక్షురమత్స్యాక్షీగుడూచీతణ్డులీయకమ్ ॥౯౮॥
పునర్నవా ద్రోణపుష్పీ వార్తాకం లశునద్వయమ్।
పక్వామ్రమభయా బిమ్బా శృఙ్గీ మూత్రాస్య గవాం జలమ్॥
ధాత్రీ తక్రం ఘృతం తైలం సౌవీరకతుషోదకమ్।
నవనీతం గన్ధసారో హరిద్రా నాగకేసరమ్ ॥౧౦౦॥
యవక్షారో లోహభస్మ కషాయాణి చ కుఙ్కుమమ్।
దాహశ్చరణయోస్సన్ధౌ నాభేర్ద్వ్యఙ్గులకాదధః ॥౧౦౧॥
మస్తకే హస్తయోర్మూలే మధ్యే చ స్తనకక్షయోః।
యథాదోషమిదం పథ్యం పాణ్డురోగవతాన్నృణామ్॥

తా॥ వమనవిరేచనకర్మలజేసికొనుట, ప్రాతవియగు యవలు, గోధుమలు, రాజనములు, పెసలయొక్కయు కందులయొక్కయు చిరుసెనగలయొక్కయు కట్టులు, అరణ్యమునందు జంతువులమాంసరసము, పొట్లకాయలు, గుమ్మడిపండు, లేతయరటికాయలు, పాలకూర, పల్లేరు, పొన్నగంటికూర, తిప్పతీగె, చిర్రికూర, గలిజేరు, ఏనుగతుమ్మి, వంకాయలు, తెల్లగడ్డలు, ఎఱ్ఱగడ్డలు, మామిడిపండ్లు, కరకకాయలు, దొండపండ్లు, శృంగియనుమత్స్యము, గోమూత్రము, ఉసిరికకాయలు, మజ్జిగ, నెయ్యి, నూనె, సౌవీరకమను కాంజికము, కొడిటినీళ్లు, వెన్న, చందనము, పసుపు, నాగకేసరములు, యవక్షారము, లోహభస్మము, కషాయ (వగరు) రసముగలపదార్థములు, కుంకుమపువ్వు, ఇవియన్నియు పాండురోగమునందు పథ్యములు.

మఱియు కాళ్లయొక్క కీళ్ళయందును, బొడ్డుకు రెండంగుళములక్రింది ప్రదేశమునను శిరస్సునందును మణికట్టులయందును స్తనములకును చంకలకును నడుమనుండు స్థలమునందును లోహశలాకలచేత రక్షవేయుటకూడ పథ్యముగనుండును. ఇత్తెరంగున పాండురోగముగలవారికి నాయాదోషములబట్టి పథ్యములనెరుంగునది.

## —॥ పాండురోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ రక్తస్రుతిర్ధూమపానం వమివేగవిధారణమ్।
స్వేదనం మైథునం శిమ్బీ పత్రశాకాని రామఠమ్ ॥౧౦౩॥
మాషాఽమ్బుపానం పిణ్యాకం తామ్బూలం సర్షపం సురా।
సర్వాణ్యమ్లాని దుష్టాని విరుద్ధాధ్యశనాని చ॥౧౦౪॥
మృద్భక్షణం దివాస్వప్నం తీక్ష్ణాని లవణాని చ।
సహ్యావింధ్యాద్రిజాతానాం నదీనాం సలిలాని చ॥౧౦౫॥
గుర్వన్నం చ విదాహీని పాణ్డురోగవతాం విషమ్॥

తా॥ రక్తమును స్రవింపజేయుట, పొగద్రాగుట, వాంతిని వెడల నియ్యకనిరోధించుట, శరీరమున చెమటబుట్టించుట, స్త్రీసంభోగము జేయుట, పటాణులు మున్నగు శింబీధాన్యములు; ఆకుగూరను, ఇంగువ, మినుములు; ఈద్రవ్యములదినుట; నీళ్ళనువిశేషముగద్రాగుట, గానుగపిండి, తాంబూలము, ఆవాలు, మద్యము, చింతపండు మామిడి మున్నగు పులుపుగలపదార్థములు, చెడినవియు విరుద్ధంబులునైన యన్నములు, భుజించబడిన యాహారము జీర్ణము గాకుండునపుడు మరల భుజించుట, మట్టినితినుట; పగటియందు నిదురించుట, తీక్ష్ణములగు (కారముగల) పదార్థములను ఉప్పుగల పదార్థములనుదినుట, సహ్యాపర్వతముననుండియు విన్ధ్యపర్వతముననుండియు ప్రవహించు నదులజలము ద్రాగుట, అజీర్ణకరమగు నన్నమును భుజించుట, విదాహి (మంట బుట్టించు) పదార్థములభుజించుట, ఇవియన్నియు పాండురోగముగలవారికి విషమునుబోలియుండునుగాన వారిచే సేవింపదగవు.

## —॥ రక్తపిత్తమునందు పథ్యములు. ॥—

శ్లో॥ అధోగతే ఛర్దనమూర్ధ్వనిర్గమే
విరేచనం స్యాదుభయత్ర లంఘనమ్।

పురాతనాష్షష్టికశాలికోద్రవాః
ప్రియఙ్గునీవారయవప్రసాధికాః ॥౧౦౬॥
ముద్గా మసూరాశ్చణకాస్తువర్యో
మకుష్ఠకశ్చాగరువర్మిమత్స్యాః ।
శశః కపోతో హరిణైణలావాః
శరారిపారావతవర్తికాశ్చ॥౧౦౭॥
బకా ఉరభ్రాశ్చ సకాలపుచ్ఛాః
కపిఞ్జలాశ్చాపి కషాయవర్గః ।
గవామజాయాశ్చ పయోఘృతఞ్చ
ఘృతం మహిష్యాః పనసం ప్రియాలమ్॥౧౦౮॥
రమ్భాఫలం కఞ్చటతణ్డులీయం
పటోలవేత్రాగ్రమహార్ద్రికాని ।
పురాణకూశ్మాణ్డఫలం చ పథ్యం
తాలాని తద్బీజజలాని వాసా॥౧౦౯॥
స్వాదూని చామ్లాని చ దాడిమాని
ఖర్జూరధాత్రీమిసినారికేరమ్ ।
కసేరుశృఙ్గాటకపౌష్కరాణి
కపిత్థశాలూకపరూషకాణి॥౧౧౦॥
భూనిమ్బశాకం పిచుమన్దపత్రం
తుమ్బీకలిఙ్గాని చ లాజసక్తు ।
ద్రాక్షా సితా మాక్షికమిక్షువర్గా

శీతోదకం చోద్భిదవారి చాపి॥౧౧౧॥
సేకోఽవగాహశ్శతధౌతసర్పిః
అభ్యఙ్గయోగశ్శిశిరః ప్రదేశః।
హిమానిలశ్చన్దనమిన్దుపాదాః
కథా విచిత్రాశ్చ మనోఽనుకూలాః॥౧౧౨॥
ధారాగృహం భూమిగృహం సుశీతం
వైఢూర్యముక్తామణిధారణఞ్చ।
రక్తోత్పలామ్భోరుహపత్రశయ్యా
క్షౌమామ్బరఞ్చోపవనం సుశీతమ్॥౧౧౩॥
ప్రియఙ్గుకా చన్దనరూషితానా
మాలిఙ్గనం చాపి వరాఙ్గనానామ్।
పద్మాకరాణాం సరిదుద్గతానాం
చన్ద్రోదయానాం హిమశీకరాణామ్॥౧౧౪॥
సుశీతలానాం గిరినిర్ఝరాణాం
అతిప్రశస్తాని చ కీర్తనాని।
ప్రతీరనీరం హిమవాలుకాచ
మిత్రం నృణాం శోణితపిత్తరోగే॥౧౧౫॥

తా॥ రక్తపిత్తము అధోమార్గమునుండి వెడలుచున్నయెడ వమనమును జేయించుటయు, ఊర్ధ్వమార్గమున వెడలుచున్నచో విరేచనమును జేయించుటయు, ఊర్ధ్వాధోమార్గముల రెంటినుండి వెడలుచున్నయెడ లంకణముంచుటయు పథ్యములైయుండును. మఱియు ప్రాతవియగు అఱువదినాళ్లసంబావులు, రాజనములు, ఆఱుకలు, కొఱ్ఱలు, నీవారగములు, యవలు, ప్రసాధికము

లనుధాన్యములు, పెసలు, చిరుసెనగలు, సెనగలు, కందులు, అడవిపెసలు, కృష్ణాగరు, వర్మియను మత్స్యములు, కుందేలు, పావురము, లేడి, జింక, లావుకపిట్ట, శరారియను తీతువుపిట్ట, పారావతము (ఇండ్లలోనుండు పెంపుడు పావురము), వర్తికయను తీతువుపిట్ట, (ఇచ్చట 'వర్తిక' 'శరారి' అనునవి తీతువుపిట్టలలోని భేదములని యెఱుంగునది) కొంగలు, గౌజులు, కాలపుచ్ఛములు (నల్లనితోకకలజింకలు), కాటుకపిట్టలు, ఈజంతువుల మాంసములు; కషాయ (వగరు) రసముగల నానావిధవస్తువులు, ఆవుల యొక్కయు మేకలయొక్కయు పాలు పెరుగులు, ఎనుములనెయ్యి, పనసకాయలు, చారపప్పు, అరటిపండ్లు, నీటబుట్టినచిత్రికూర, చిత్రికూర, పొట్లకాయ, పేముచిగురు, శుంఠి, బహుదినముల క్రిందపండిన గుమ్మిడిపండు, తాటిపండ్లు, తాటినుంగులు, తాటికల్లు, ఆడ్డసరము, తియ్యదానిమ్మపండ్లు, పుల్లదానిమ్మపండ్లు, ఖర్జూరపుపండ్లు, ఉసిరికకాయలు, అడవిసదాప, టెంకాయలు, నమ్మదుంపలు, దుప్పగడ్డలు, దామరదుంప, వెలగపండ్లు, కలువలు మున్నగువానిదుంపలు, చిట్టీతపండ్లు, నేలవేముకూర, వేపాకు, సొరకాయలు, పుచ్చకాయ, పేలాలపిండి, ద్రాక్షపండ్లు, చక్కెర, తేనె, చెఱకు, చల్లనినీళ్ళు, ఊటనీళ్ళు, వీనినన్నిటిని సేవించుటయు రక్తపిత్త సామాన్యముగ పథ్యమైయుండును.

మఱియు నీళ్లచేఁదడుపుట, సరస్సులలోమునుగుట, శతధౌతఘృతము (కషాయాదులచే నూరుమార్లు కడగబడిననెయ్యి), అభ్యంగస్నానము జేయుట, చల్లనైయుండు ప్రదేశములసంచరించుట, చల్లనిగాలిలోనుండుట, చందనముబూసికొనుట, వెన్నెలలోనుండుట, చిత్రంబులును మనస్సునకనుకూలంబులునైన కథలవినుట, నీటిధారలుగల యిండ్లలోనుండుట, భూమిగృహమున (భూమికిలోభాగముననుండు యింటి) నుండుట, చల్లనియింటనుండుట, వైడూర్యములు, ముత్యములు మున్నగు మణులధరించుట, ఎఱ్ఱకలువలయొక్కయు, తామరపువ్వులయొక్కయు రేకులచే.జేయబడిన శయ్యపై శయనించుట, పట్టుగుడ్డలధరించుట, చల్లనైయుండు ఉద్యానవనములలో నుండుట,

ప్రేంకణపుచెట్లలో విహరించుట, చందనమును బూసికొని మిక్కిలి మనో హరులగు యౌవనవతుల గౌగిలించుట, కమలములతోఁగూడిన సరస్సులను, ఏరులను, చంద్రోదయమును, చల్లనినీళ్ళుకల సెలయేళ్ళను మిగుల ప్రశస్తముగ గానియాడుట, నదులు సరస్సులు మున్నగువాని గట్టునను సమీపమునుండు జలమునుపయోగించుట, పచ్చకప్పురమును బూసికొనుట, ఇవియన్నియును గూడ రక్తపిత్తమున పథ్యములై యుండును.

—॥ రక్తపిత్తవ్యాధియందపథ్యములు. ॥—

శ్లో॥ వ్యాయామాధ్వనిషేవణం రవికరాస్తీక్ష్ణాని కర్మాణి చ
క్షోభో వేగవిధారణం చపలతా హస్త్యశ్వయానాని చ।
స్వేదాస్రస్రుతిధూమపానసురతక్రోధాః కులుత్థో గుడో
వార్తాకీ తిలమాషసర్షపదధిక్షారాణి కోపం పయః॥౧౧౬॥
తామ్బూలం నలదంచ మద్యలశునం బిమ్బా విరుద్ధాశనం
కట్వమ్లంలవణంవిదాహిచగణఃత్యాజ్యోఽస్రపిత్తేనృణామ్॥

తా॥ దేహపరిశ్రమజేయుట, త్రోవనడచుట, ఎండ దిరుగుట, క్రూర ములగు పనులజేయుట, శరీరము నలయించుట, వాతమూత్రపురీషముల నిరో ధించుట, చంచలతనొందుట, ఏనుగులు గుఱ్ఱములు మున్నగు వాహనములపై నెక్కి సవారిచేయుట, స్వేదనమును (శరీరమున జెమటబుట్టించుట), రక్త మోచనమును జేయించుట, పొగను పీల్చుట, సంభోగము జేయుట, కోపపడుట, ఉలవలు, బెల్లము, వంకాయలు, నువ్వులు, మినుములు, ఆవాలు, పెరుగు, క్షారములు, బావినీళ్ళు, తాంబూలము, వట్టివేళ్లు, మద్యము, ఉల్లిగడ్డలు, దొండపండు, పరస్పర విరుద్ధములగు క్షీరమత్స్యాద్యాహారపదార్థ ములు, కటు (కారము) అమ్ల (పులుపు) లవణ (ఉప్పు) రసములుగల పదార్థ ములు, విదాహి (తాపమును గల్గించు) మిరపకాయలు మొదలగు పదార్థ ములు, ఇవియన్నియు రక్తపిత్తముగల మనుజులకు హితకరములుగావు కాన సేవింపందగవు.

## క్షయరోగమునందు పథ్యములు.

శ్లో॥ దోషాధికస్య బలినో మృదుశుద్ధిరగ్రే
గోధూమముద్గచణకా వనశాలయశ్చ।
ఛాగాని మాంసనవనీతపయోఘృతాని
క్రవ్యాదమాంసమపి జాఙ్గలజా రసాశ్చ ॥౧౧౭॥
మార్తణ్డచన్ద్రకిరణైః ప్రతిశోషితాని
లేహ్యాని పక్వపలలాని సుచూర్ణితాని।
రాగాస్సకామ్బలికఖాణ్డవవేసవారా
భక్ష్యాశ్చ శాఙ్కకిరణైర్మధురో రసశ్చ॥౧౧౮॥
పక్వాని మోచపనసామ్రఫలాని ధాత్రీ
ఖర్జూరపౌష్కర పరూషకనారికేళమ్।
శోభాఞ్జనం వకులకం నవతాలసస్య
ద్రాక్షాఫలాని భిషజాపి ఇమాని దద్యాత్ ॥౧౧౯॥
సిహ్మాస్యపత్రమపి గోమహిషీఘృతఞ్చ
ఛాగాశ్రయశ్చ హి తదన్తికమూత్రలేపః।
మత్స్యణ్డికా శిఖరిణీమదిరారసాలాః।
కర్పూరకం మృగమదః సితచన్దనఞ్చ ॥౧౨౦॥
అభ్యఞ్జనాని సురభీణ్యనులేపనాని
స్థానాని వేశ్మరచనాన్యవగాహనాని।
హర్మ్యస్థలం స్రజః స్మరకథా మృదుగన్ధవాహాః
శీతాని లాస్యమపి చన్ద్రరుహో విపఞ్చీ ॥౧౨౧॥

సన్దర్శనం మృగదృశామపి హేమపూర్ణం
ముక్తామణి ప్రచురభూషణధారణఞ్చ।
హేమాన్నప్రదానమమరద్విజపూజనాని
దివ్యానుపానమపి పథ్యగణః క్షయార్తే ॥౧౨౨॥

తా॥ క్షయరోగముగలవానికి శరీరమున పుష్టిగల్గి వాతాదిదోషములు ప్రబలములైయున్నచో దొలుత సౌమ్యమగు నౌషధముచే వమనవిరేచనముల జేయించి శరీరమును శుద్ధిచేయవలెను. మఱియు, గోధుమలు, పెసలు, సెనగలు, నీవారధాన్యములు, మేకలయొక్కమాంసము వెన్న పాలు నెయ్యి, మాంసమునుదినుపులులు బోరువులు మున్నగు మృగపక్షులమాంసములు, జాంగలప్రదేశముననుండు మృగాదిజంతువులమాంసరసములు, సూర్యకిరణములచే ఎండిం చి చంద్రకిరణములచే చల్లనైన లేహ్య (పచ్చళ్లుమున్నగు)పదార్థములు, మిగుల సూక్ష్మాకారముగ చూర్ణముజేసి వండబడినమాంసములు, రాగములు, (అనగా సౌవర్చలలవణము, చక్కెర, సైంధవలవణము, చింతపండు, ఈతపండ్లు, రేగుపండ్లరసము, ఆవాలు, ఈవస్తువులజేర్చి పక్వముజేయబడిన కూరలు మున్నగు పదార్థములు), కాంబలికములు (పెరుగు, ఉప్పు, నెయ్యి, నువ్వులపిండి, మినపపిండి, ఈద్రవ్యములజేర్చి పక్వముజేయబడిన పెసలకట్టులు), గాండవములు (తీపు, పులుపు, ఉప్పు, ఈమూడురసములజేర్చి సుగంధద్రవ్యముల గలిపి పక్వముజేయబడిన ఊరగాయలు), వేసవారములు (మాంసమున ముకలు లేకుండ నేర్పరచి కొంచెముగ నుడికించి రాతిమీద మెత్తనగు ట్లులు నూరి శుంఠి, దనియాలు, జీలకఱ్ఱ, ఇంగువ, నెయ్యి, ఈవస్తువుల జేర్చి రల నుడికించబడినది వేసవారమనబడును.) పచ్చకప్పురముచే బరిమళించు క్ష్యములు, మధురరసముగల మాంసరసము, పండిన అరటిపండ్లు, పనసపండ్లు, మామిడిపండ్లు, ఉసిరికపండ్లు, ఖర్జూరపుపండ్లు, పుష్కరమూలము, ట్రీతపండ్లు, టెంకాయ, మునగకాయలు, పొగడకాయలు, లేతతాటికాయలు, దనియాలు, ద్రాక్షపండ్లు, అడ్డసరపుఆకు, ఆవులయొక్కయు ఎనుముల

యొక్కయు నెయ్యి, ఎల్లప్పుడును మేకలు నివసించియుండు స్థలమునను ండుట, మేకలమూత్రమును శరీరమునబూసికొనుట, పాకముజేయబడిన చక్కెర, శిఖరిణి (తేనె నెయ్యి ఈరెంటిని నాలుగేసి పలములుజేర్చి యొకకుండలో నునిచి పచ్చకప్పురమును అందుజేర్చినచో నయ్యది శిఖరిణియనదగు), మద్యము, రసాల(పెరుగుతోజేర్చినసత్తుపిండి),పచ్చకప్పురము, కస్తూరి, తెల్లనిచందనము, ఈవస్తువులను సేవించుట, అభ్యంగము, పరిమళించుచుండు గంధము మున్నగు మైపూతలు, పరిమళముతోగూడిన స్థలములు, పరిమళయుక్తములగు గృహములు, సరస్సులుమున్నగువానియందు మునుగుట, మేడలు, పుష్పమాలికలు, మన్మథసంబంధములగు కథలు, మెల్లగా వీచుమందుగాలి, శీతోపచారములు, నాట్యము, వెన్నెల, వీణాగానము, చక్కనిజవరాండ్రజూచుట, బంగరు చేతను ముత్యములచేతను కట్టబడిన భూషణములధరించుట,హోమముజేయుట, నవగ్రహాదుల నుద్దేశించి దానముల జేయుట, దేవతలను బ్రాహ్మణులను పూజించుట, హంసోదకము మున్నగు ననుపానములు, యివియన్నియు క్షయరోగముచే పీడించబడినవారికి పథ్యములై యుండును. ✓

## —క్షయరోగమునం దపథ్యములు.—

శ్లో॥ విరేచనం వేగవిధారణం చ
శ్రమం స్త్రియం స్వేదనమఞ్జనం చ।
ప్రజాగరం సాహసకర్మ సేవనం
రూక్షాన్నపానం విషమాశనఞ్చ ॥౧౨౩॥
తామ్బూలకాలిఙ్గకులుత్థమాషా
రసోనవంశాఙ్కురరామఠాని ।
అమ్లాని తిక్తాని కషాయకాని
కటూని సర్వాణి చ పత్రశాకమ్ ॥౧౨౪॥
క్షారాన్విరుద్ధాధ్యశనాని బిమ్బా

కర్కోటకం చాపి విదాహి సర్వమ్।
కటిల్లకం కృష్ణమపి క్షయేషు
వివర్జయేత్సన్తతమప్రమత్తః॥౧౨౭॥

తా॥ విరేచనములఁజేయించికొనుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, దేహపరిశ్రమజేయుట, స్త్రీలతో రమించుట, శరీరమున జెమటవెడలింపజేసికొనుట, కన్నులలో కాటుకబెట్టుట, రాత్రులయందు నిదురమేల్కొంచియుండుట, తనబలమునకసాధ్యములగు పనులజేయుట, మిక్కిలి రూక్షములగు నన్నపానముల సేవించుట, తానుసాధారణముగ భుజించుపరిమాణమునకు హెచ్చుగాధికముగ భుజించుట, తాంబూలమువేసికొనుట, పుచ్చకాయలు, ఉలవలు, మినుములు, వెల్లుల్లి, వెదురుమోవ్రులు, ఇంగువ, అమ్ల (పులుపు) తిక్త (చేదు) కషాయ(వగరు) కటు(కారము) రసములుగల సకలపదార్థములు, ఆకుకూరలు, క్షారములు, ఈవస్తువులను భుజించుట; పరస్పర విరుద్ధములగు క్షీరమత్స్యాదులభుజించుట, భుజించిన యాహారపదార్థము జీర్ణముగాకుండునప్పుడు మరలభుజించుట, దొండపండ్లు, దోసకాయలు, విదాహకరములగు నరపకాయలు మున్నగు నన్నిపదార్థములు, కాకరకాయలు, కృష్ణాగరు, వీనినన్నిటిని క్షయరోగముకల మనుజు లెప్పుడును సేవింపదగదు.

—కాసరోగమునందు పథ్యములు—

శ్లో॥ స్వేదో విరేచనం ఛర్దిర్ధూమపానం సమోషితాః।
శాలిషష్టికగోధూమశ్యామాకయవకోద్రవాః॥౧౨౮॥
ఆత్మగుప్తా మాషముద్గకులుత్థానాం రసాః పృథక్।
గ్రామ్యోదకానూపధన్వమాంసాని వివిధాన్యపి॥౧౨౯॥
సురా పురాతనం సర్పిః ఛాగం చాపి పయో ఘృతమ్।
వాస్తుకం వాయసీశాకం వార్తాకం బాలమూలకమ్॥౧౩౦॥

కణ్టకారీ కాసమర్దో జీవన్తీ సునిషణ్ణకమ్।
ద్రాక్షా బిమ్బా మాతులుఙ్గం పౌష్కరం వాసకం త్రుటిః॥
గోమూత్రం లశునం పథ్యా వ్యోషముష్ణోదకం మధు।
లాజాః దివసనిద్రా చ లఘూన్యన్యాని యాని చ ॥౧౩౦॥
పథ్యమేతద్యథాదోషముక్తం కాసగదాతురే।

తా॥ శరీరమున చెమటబుట్టించుట, విరేచనము జేయించుట, వమనము జేయించుట, పొగద్రాగుట, సంవత్సరకాలము ప్రాతవియగు రాజనములు, ఆరువదినాళ్ళసంబావులు, గోధుమలు, సామలు, యవలు, ఆరుకలు; దూల గొండిగింజలు, మినుములు, పెసలు, ఉలవలు, వీనిచే వేర్వేరుగ పక్వముజేయబడినకట్టులు, గ్రామములలో బుట్టిన మేకలుమున్నగు జంతువులయొక్కయు, ఉదకమున జనించిన మత్స్యాదులయొక్కయు, జలప్రాంతమునబుట్టిన జంతువులయొక్కయు, అరణ్యమునబుట్టిన జింకలుమున్నగు మృగములయొక్కయు మాంసములు; మద్యము, ప్రాతనెయ్యి, మేకపాలు, మేకనెయ్యి, చక్రవర్తికూర, కాచికూర, వంకాయలు, లేతముల్లంగి, ములకకాయలు, కసివింద, పాలకూర, చెంచలికూర, ద్రాక్షపండ్లు, దొండపండ్లు, మాదీఫలములు, పుష్కరమూలము, అడ్డసరము, ఏలకులు, గోమూత్రము, ఉల్లిగడ్డలు, కరకకాయలు, త్రికటుకములు (శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు), వేడినీళ్ళు, తేనె, పేలాలు, పగటియందు నిదురించుట, శీఘ్రముగ జీర్ణములగు పదార్థములు, ఇవి యన్నియు కాస (దగ్గు) రోగముగలవానికి నాయాదోషముల ననుసరించి పథ్యములైయుండును.

—— కాసరోగమునం దపథ్యములు. ——

శ్లో॥ వస్తిం నస్యమసృఙ్మోక్షం వ్యాయామం దన్తఘర్షణమ్॥
ఆతపం దుష్టపవనం రజోమార్గనిషేవణమ్।
విష్టమ్భీని విదాహీని రూక్షాణి వివిధాని చ ॥౧౩౨॥

శకృన్మూత్రోద్గారకాసవమివేగస్య ధారణమ్।
మత్స్యంకన్దంసర్షపం చ తుమ్బీఫలముపోదికామ్॥౧౩౩॥
దుష్టాన్నపానం దుష్టామ్బు విరుద్ధాధ్యశనాని చ।
గురు శీతం చాన్నపానం కాసరోగీ పరిత్యజేత్ ॥౧౩౪॥

తా॥ వస్తికర్మ, నస్యము, రక్తమోచనము, దేహపరిశ్రమజేయుట, పుల్లనూన్నగువానిచే దంతములతోముట, ఎండలో సంచరించుట, దుర్గన్ధముతోగూడిన గాలిని సేవించుట, నాసాది రంధ్రములలో ధూళిప్రవేశించుట, త్రోవనడచుట, మలమును బంధించునవియు తాపకరంబులును రూక్షంబులునగు నానావిధ పదార్థములసేవించుట, మలము, మూత్రము, త్రేనుపులు, దగ్గు, వాంతి, వీనిని వెడలనీయక నిరోధించుట, మత్స్యములు, కందగడ్డలు, ఆవాలు, సొరకాయ, బచ్చలికూర, దుష్టములగు నన్నపానముల సేవించుట, చెడిననీళ్ళను త్రాగుట, పరస్పర విరుద్ధములగు క్షీరమత్స్యాదులకలిపి భుజించుట, భుజించబడిన యాహారము జీర్ణము కాకుండునపుడు మరలభుజించుట, అజీర్ణకరంబులును శీతలంబులునగు నన్నపానముల సేవించుట, ఇవియన్నియు కాసరోగమునందు పథ్యములుకావుగాన కాసరోగముకల మనుజునిచే సేవింపదగవు.

—( హిక్కారోగమునందు పథ్యములు. )—

శ్లో॥ స్వేదనం వమనం నస్యం ధూమపానం విరేచనమ్ ।
నిద్రాస్నిగ్ధానిచాన్నాని మృదూని లవణాని చ ॥ ౧౩౫॥
జీర్ణాః కులుత్థా గోధూమాశ్శాలయష్షష్టికా యవాః।
ఏణాతిత్తిరలావాద్యా జాఙ్గలా మృగపక్షిణః ॥౧౩౬॥
ఉష్ణోదకం మాతులుఙ్గం మాక్షీకం సురభీజలమ్ ।
పక్వం కపిత్థం లశునంపటోలం బాలమూలకమ్ ॥౧౩౭॥

పౌష్కరం కృష్ణతులసీ మదిరా నలదామ్బుచ।
అన్నపానాని సర్వాణి వాతశ్లేష్మహరాణి చ ॥౧౩౯॥
శీతామ్బుసేకస్సహసా త్రాసో విస్మాపనం భయమ్।
క్రోధో హర్షః ప్రియోద్వేగః ప్రాణాయామనిషేవణమ్॥
దగ్ధసిక్తమృదాఘ్రాణం కూర్చధారాజలార్పణమ్।
నాభ్యూర్ధ్వపీడనం దాహో దీపదగ్ధహరిద్రయా॥౧౪౦॥
పాదయోర్ద్వ్యఙ్గులాన్నాభేరూర్ధ్వశ్చేష్టా ఽతిహిక్కినామ్।

తా॥ శరీరమున చెమటబుట్టించుట, వమనము జేయించుట, నస్యమును పీల్చుట, పొగద్రాగుట, విరేచనము జేయించుట, నిదురించుట, స్నిగ్ధంబులును మృదువులైనవియు ఉప్పనైనవియునగు నన్నముల భుజించుట, ప్రాతవియగు ఉలవలను, గోధుమలను, రాజనంపు బియ్యమును, అరువదినాళ్ళ సంబావుల బియ్యమును, యవలను భుజించుట; అరణ్యమున జనించిన జింక, తీతువపిట్ట, లావుకపిట్ట మున్నగు పక్షిమృగాదిజంతువుల మాంసములదినుట, వేడినీళ్ళు, మాదీఫలములు, తేనె, ఆవుపంచితము, వెలగపండ్లు, ఉల్లిగడ్డలు, పొట్లకాయ, లేతముల్లంగి, పుష్కరమూలము, నల్లనితులసి, మద్యము, వట్టివేళ్ళచే బరిమళించు జలము, వాతకఫముల హరించు నానావిధములగు నన్నపానములు (వీనినన్నిటిని సేవించుట) చల్లని నీళ్ళచే దడుపుట, శీఘ్రముగ ఉలికిపాటు నొందించుట, ఆశ్చర్యమును కల్గించుట, భయమును పుట్టించుట, కోపముగల్గించుట, సంతసము బుట్టించుట, ప్రియంబులును మనసునకు చంచలత్వమును బుట్టించునవియునైన పనుల జేయుట, ఊపిరిని బిగబట్టుట, మట్టిపెళ్ళనుకాల్చి నీళ్ళచేత తడిపి మూర్కొనుట, కనుబొమల నడుమ ధారగా నుదకమును విడచుట, బొడ్డునకు పైభాగమున పిసుకుట, పసపుకొమ్మును దీపమునకాల్చి దానిచే పాదములకు రెండంగుళములకు పైభాగమునందును బొడ్డునకు పైభాగమునను రక్షలవేయుట, ఇవియన్నియును హిక్క (వెక్కిళ్లు) కల మనుజునకు మిక్కిలి హితకరములై యుండును.

—॥ హిక్కారోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ వాతమూత్రోద్గారకాసశకృద్వేగవిధారణమ్॥౧౫౧॥
రజోఽనిలాతపాయాసాన్విరుద్ధాన్యశనాని చ।
విష్టమ్భీని విదాహీని రూక్షాణి కఫదాని చ ॥౧౫౨॥
నిష్పావమాషపిణ్యాకవారిజానూపమామిషమ్।
అవిదుగ్ధం దన్తకాష్ఠం వస్తిం మత్స్యాంశ్చ సర్షపాన్॥
అమ్లం తుమ్బీఫలం కన్దం తైలభృష్టముపోదికామ్।
గురుశీతఞ్చాన్నపానం హిక్కారోగీ వివర్జయేత్॥ ౧౫౩॥

తా॥ అపానవాతమును మూత్రమును త్రేనుపులను దగ్గును పురీషమును బైటవెడలనీయకనిరోధించుట, దుమ్ముతోగూడిన గాలిని సేవించుట, ఎండలో నుండుట, దేహమునకు శ్రమగల్గించుట, పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదుల సేవించుట, భుజించినయాహారము జీర్ణముగాకమునుపు మరలభుజించుట, మలమును బంధించునవియు సంతాపకరంబులును రూక్షంబులును కఫమును వృద్ధిసొందించునవియునగు పదార్థముల సేవించుట, అనుములు, మినుములు, గానుగపిండి, ఉదకమున జనించిన జంతువులయొక్కయు జలప్రాంత ప్రదేశముల జనించిన జంతువులయొక్కయు మాంసము, గొర్రెమెలపాలు, ఈపదార్థముల సేవించుట, దంతధావనము జేయుట, వస్తికర్మ జేయించుకొనుట, మత్స్యములు, ఆవాలు, పులుపుకలపదార్థములు, సొరకాయలు, కందగడ్డలు, నూనెలో వేయించబడిన పదార్థములు, బచ్చలికూర, అజీర్ణకరంబులును శీతలములునగు నన్నపానములు, వీనినన్నిటిని హిక్కా (వెక్కిళ్ళు) రోగముకల మనుజుడు విడువవలెను.

—॥ శ్వాసరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేచనం స్వేదనధూమపాన
ప్రచ్ఛర్దనాని స్వపనం దివా చ।

పురాతనాష్టిషష్టికరక్తశాలి
కులుత్థగోధూమయవాః ప్రశస్తాః ॥౧४౫॥
శశాహిభుక్ తిత్తిరిలావదక్ష
శుకాదయో ధన్వమృగా ద్విజాశ్చ।
పురాతనం సర్పిరజాప్రభూతం
పయోఘృతం వాపి సురా మధూని ॥౧४౬॥
పటోలవార్తాకరసోనబిమ్బీ
జమ్బీరతణ్డూలియవాస్తుకం చ।
ద్రాక్షా త్రుటిః పౌష్కరముష్ణవారి
కటుత్రయం గోజనితం చ మూత్రమ్ ॥౧४౭॥
అన్నాని పానాని చ భేషజాని
శ్లేష్మానిలఘ్నాని చ పథ్యవర్గః।
వక్షఃప్రదేశాదపిపార్శ్వయుగ్మే
కరస్థయోర్మధ్యమయోర్ద్వయోశ్చ ॥౧४౮॥
ప్రదీప్తలోహేన చ కణ్ఠకూప
దాహోఽపి చ శ్వాసిని యాని కాని।

తా॥ విరేచనము, శరీరమున చెమటబుట్టించుట, పొగనుపీల్చుట, వమనముజేయించుట, పగటియందు నిదురించుట, ప్రాతవియగు నరువదినాళ్ళ సంబావులు, ఎఱ్ఱవరివడ్లు, ఉలవలు, గోధుమలు, యవలు, కుందేటియొక్కయు, నెమలి, తీతువుపిట్ట, లావుకపిట్ట, కోడి, చిలుక మున్నగు పక్షులయొక్కయు, అరణ్యమున జనించిన మృగములు పక్షులు మున్నగువానియొక్కయు మాంసములు, ప్రాతదియగునెయ్యి, మేకపాలు, మేకనెయ్యి, కల్లు, మద్యములు, పొట్లకాయ, వంకాయలు, వెల్లుల్లి, దొండపండ్లు, నిమ్మపండ్లు, చిఱ్ఱికూర, చక్రవర్తికూర, ద్రాక్షపండ్లు, చిన్నయేలకులు, పుష్కరమూలము, వేడినీళ్ళు,

త్రికటుకములు, (శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు,) గోమూత్రము, కఫవాతముల హరించు నన్నపానౌషధములు, ఇవియన్నియు శ్వాసరోగమునందు పథ్యకరములైయుండును.

మఱియు వక్షస్థలము, ఇరుప్రక్కలు, చేతులయందు నడిమివ్రేళ్లకు పైభాగములు, కంఠకూపము (నామగుంట), ఈస్థలములయందు కాలియుండు లోహశలాకలచేత రక్షవేయుట మిక్కిలి ప్రశస్తమైయుండును.

—॥ శ్వాసరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ మూత్రోద్గారచ్ఛర్దితృట్కామరోధో
నస్యం వస్తిర్దన్తకాష్ఠం శ్రమశ్చ ।
అధ్వా భారో రేణవస్సూర్యపాదాః
విష్టమ్భాని గ్రామ్యధర్మో విదాహి ॥౧౮౯॥
ఆనూపానామామిషం తైలభృష్టం
నిష్పావాశ్చ శ్లేష్మకారీణి మాషాః ।
రక్తస్రావః పూర్వవాతోఽమ్బుపానం
మేషీసర్పిః దుగ్ధమమ్భోఽపి దుష్టమ్ ॥౧౯౦॥
మత్స్యాః కన్దాః సర్షపానన్నపానం
రూక్షం శీతం గుర్వపి శ్వాసివర్జ్యమ్।

తా॥ మూత్రము, త్రేనుపులు, వాంతి, దప్పి, కామము (స్త్రీసంభోగమునందలి యభిలాష), ఈవైదిటియొక్క వేగమునునిరోధించుట, నస్యము, వస్తికర్మ, దన్తధావనము జేయుట, ఒడలుకు శ్రమ గల్గించుట, త్రోవనడచుట, భారమును మోయుట, నాసాదిరంధ్రములయందు దుమ్ముచొరబడుట, ఎండలో నుండుట, మలమునుబంధించు పదార్థములసేవించుట, అధికముగ సంభోగము జేయుట, సంతాపమును కల్గించు పదార్థములదినుట, జలప్రాంతదేశముననుండు జంతువుల మాంసము, నూనెలో పక్వము చేయబడిన

భక్ష్యాదులు, అనుములు, కఫమును వృద్ధినొందించు పదార్థములు, మినుములు, రక్తమును స్రవింపజేయుట, తూరుపుననుండివచ్చు గాలిలోనుండుట, అధికముగ నీళ్ళుత్రాగుట, గొఱ్ఱెనెయ్యి, గొఱ్ఱెపాలు, గొఱ్ఱెలమూత్రము, పిండితో చేయబడిన పదార్థములు, మత్స్యములు, దుంపలు, ఆవాలు, రూక్షంబులును శీతలంబులును అజీర్ణకరంబులునైన యన్నపానములు, ఇవియన్నియు శ్వాసరోగముకలవారికి పథ్యములుకావు గాన విడువందగును.

—॥ స్వరభేదరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ స్వేదో వస్తిర్ధూమపానం విరేకః కబలగ్రహాః।
నస్యం ఫాలసిరావేధో యవా లోహితశాలయః ॥
హంసాటవీతామ్రచూడకేకీమాంసరసాస్సురా।
గోకణ్టకః కాకమాచీ జీవన్తీ బాలమూలకమ్॥ ౧౫౨॥
ద్రాక్షా పథ్యా మాతులుఙ్గం లశునం లవణార్ద్రకమ్।
తామ్బూలం మరిచం సర్పిః పథ్యాని స్వరభేదినామ్॥

తా॥ స్వేదనము, వస్తికర్మ, పొగద్రాగుట, విరేచనము, కబలగ్రహము (పుక్కిలించుట కవకాశముండునట్లు కషాయాదుల నోటనుంచుకొనియుమియుట), నస్యము, నుదుటనున్న సిరలనుగ్రుచ్చుట, యవలు, ఎఱ్ఱవరివడ్లు, హంసలు, అడవికోడి, నెమలి, ఈజంతువుల మాంసరసములు, మద్యము, పల్లేరు, కాచికూర, పాలకూర, లేతముల్లంగి, ద్రాక్షపండ్లు, కరకకాయలు, మాదీఫలములు, ఉల్లిగడ్డలు, ఉప్పు, అల్లము, తాంబూలము, మిరియాలు, నెయ్యి, ఇవియన్నియు స్వరభేదముకలవారికి పథ్యములైయుండును.

—॥ స్వరభేదరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ ఆమ్రం కపిత్థం వకుళం శాలూకం జామ్బవాని చ।
తిన్దుకాని కషాయాణి వమిం స్వప్నం ప్రజల్పనమ్॥౧౫౪॥
అన్నపానం విరుద్ధం చ స్వరభేదీ వివర్జయేత్ ।

తా॥ మామిడిపండ్లు, వెలగపండ్లు, పోగడపండ్లు, తామరదుంపలు, నేరేడుపండ్లు, తుమికిపండ్లు, కషాయ (వగరు) రసముకల సకలపదార్థములు, వాంతిజేసికొనుట, నిదురించుట, విశేషముగ మాటలాడుట, పరస్పరవిరుద్ధములగు నన్నపానముల సేవించుట, వీనినన్నిటిని స్వరభేదముకల మనుజాలు విడువవలెను.

—॥ అరుచిరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ వస్తిర్విరేకో వమనం యథాబలం
ధూమోపసేవా కబలగ్రహా స్తథా।
తిక్తాని కాష్ఠాని చ దన్తఘర్షణే
చిత్రాన్నపానాని హితైః కృతాన్యపి ॥౧౫౫॥
గోధూమముద్గాఢకిశాలిషష్టికా
మాంసం వరాహాజశశైణసమ్భవమ్।
చేకుర్ఝషాణ్డాం మధురాలి కేల్లిశః
ప్రోష్ఠీ ఖలేశః కవయీ చ రోహితః ॥౧౫౬॥
కర్కారువేత్రాగ్రనవీనమూలకం
వార్తాక శోభాఞ్జనమోచదాడిమమ్।
భవ్యం పటోలం రుచకం పయోఘృతం
బాలాని తాలాని రసోనసూరణమ్ ॥౧౫౭॥
ద్రాక్షా రసాలం నలదామ్బు కాఞ్జికం
మద్యం రసాలాం దధి తక్రమార్ద్రికమ్।
కఞ్కోలఖర్జూరప్రియాలతిన్దుకం
పక్వం కపిత్థం బదరం వికఙ్కతమ్ ॥౧౫౮॥
తాలాస్థిమజ్జా హిమవాలుకా సితా
పథ్యా యమానీ మరిచాని చామరమ్।

స్వాద్వమ్లతిక్తాని చ దేహమార్జనం
వర్గోఽయముక్తోఽరుచిరోగిణాం హితః ॥౧౫౯॥

తా॥ వస్తికర్మ, విరేచనము, వమనము, ఈకర్మలను రోగియొక్క బలాబలముల ననుసరించిచేయుట, ధూమపానము, కబలగ్రహము (పుక్కిలించుట కవకాశముండునట్లు కషాయాదుల నోటనుంచుకొని ఉమియుట), చేదుల వేపపుల్లమున్నగువానిచే దన్తధావనము జేయుట, శరీరమునకు హితకరములగు నానావిధాన్నపానములు, గోధుమలు, పెసలు, కందులు, రాజనములు, అరువదినాళ్ళ సంబావులు, పందియొక్కయు మేకయొక్కయు పందేటియొక్కయు జింకయొక్కయు మాంసము, చేప, ఝుషాండ (చిన్నచేప), మధురాలిక, ఇల్లిశ, ప్రోష్ఠి, ఖలేశ, కవయి, రోహిత, అను నీమత్స్యములు; తక్కాల, వేముచిగురు, లేతముల్లంగి, వంకాయలు, మునగకాయలు, అరటికాయలు, దానిమ్మకాయలు, పొట్లకాయలు, సౌవర్చలవణము, పాలు, నెయ్యి, లేత తాటికాయలు, వెల్లుల్లి, కందగడ్డ, ద్రాక్షపండ్లు, తియ్యమామిడిపండ్లు, వట్టివేళ్ళచే పరిమళించునీళ్ళు, కాంజికము, మద్యము, రసాల (పెరుగుతో కలిసిన సత్తుపిండి), పెరుగు, మజ్జిగ, అల్లము, తక్కోలములు, ఖర్జూరపుపండ్లు, చారపప్పు, కుమికిపండ్లు, వెలగపండ్లు, రేగుపండ్లు, పుల్లవెలగపండ్లు, తాటిపండువిత్తులోని గిజరు, పచ్చకప్పురము, చక్కెర, కరకకాయలు, ఓమము, మిరియాలు, ఇంగువ, స్వాదు (మధురము) అమ్ల (పులుపు) తిక్త (చేదు)రసములుకల పదార్థములు, ఇవియన్నియును, శరీరమును స్నానాదులచే శుభ్రపరచుటయు అరోచకము కలవారికి మిక్కిలి హితకరములై యుండును.

—॥ అరుచిరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ తృష్ణోద్గారక్షుధానేత్రవారివేగవిధారణమ్।
అహృద్యాన్నమసృఙ్మోక్షం క్రోధం లోభం భయం శుచమ్॥
దుర్గన్ధారూపసేవాశ్చ న కుర్యాదరుచౌ నరః।

తా॥ దప్పి, త్రేనుపులు, ఆకలి, కన్నీళ్లు, వీనియొక్క వేగమును నిరోధించుట, మనస్సునకింపుగాని యన్నమును భుజించుట, రక్తమోచనము జేసికొనుట, కోపము, లోభము, భయము, దుఃఖము, దుర్గన్ధయుక్తమగు పదార్థముల మూర్కొనుట, చూచుట కింపుగాని పదార్థముల సేవించుట, వీనినన్నిటిని యరోచకముకలవారు విడువవలెను.

—॥ ఛర్దిరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేచనచ్ఛర్దనలఙ్ఘనాని
స్నానం జపో లాజకృతశ్చ మణ్డః ।
పురాతనాశ్శాలికషష్టిముద్గాః
కలాయగోధూమయవా మధూని॥౧౬౧॥
శశాహిభుక్తిత్తిరిలావకాద్యా
మృగద్విజాజాఙ్గలసంజ్ఞితాశ్చ ।
మనోజ్ఞనానారసగన్ధరూపా
రసాశ్చ యూషా అపి ఖాణ్డవాశ్చ॥౧౬౨॥
గవాం జలం కామ్బలికాస్సురా చ
వేత్రాగ్రకుస్తుమ్బురునారికేళమ్ ।
జమ్బీరధాత్రీసహకారకోల
ద్రాక్షాకపిత్థాని పచేళిమాని॥౧౬౩॥
హరీతకీదాడిమబీజపూరం
జాతీఫలం బాలకనిమ్బవాసా ।
సితా శతాహ్వా కరికేసరాణి
భక్ష్యా మనఃప్రీతికరా హితాశ్చ॥౧౬౪॥
భుక్తస్య వక్త్రే శిశిరామ్బుసేకః
కస్తూరికా చన్దనమిన్దుపాదాః।

మనోజ్ఞగన్ధాన్యనులేపనాని
పానాని పుష్పాణి ఫలాని చాపి॥౧౬౫॥
రూపాణి శబ్దాశ్చ రసాశ్చ గన్ధః
స్పర్శాశ్చ యోజ్యాస్స్వమనోఽనుకూలాః।
దాహాశ్చ నాభేస్త్రికపార్శ్వపృష్ఠే
శస్తంహి పథ్యం వమనాతురస్య॥౧౬౬॥

తా॥ విరేచనము, వమనము, లంకణము, స్నానము, జపము, లాజమం
ము (పేలాలలో పదునాల్గింత నీళ్ళుచేర్చి కాచబడిన గంజి), ప్రాతబియ్యము,
నవదినాళ్ళ సంబావుబియ్యము, పెసలు, పటాణులు, గోధుమలు, యవలు,
నె, అడవిలోబుట్టిన కుందేలు, నెమలి, తీతువుపిట్ట, లావుకపిట్ట మున్నగా
ల మృగములయొక్కయు, పక్షులయొక్కయు మాంసములు, మనసున
ప్రైనవియు మధురాది నానావిధ రసములు కల్గినవియు పరిమళయుక్తంబు
నను చూచుట కింపైనరూపము కల్గినవియునగు మాంసరసములు, కట్టులు,
ండవములు(మధుర అమ్ల లవణ రసములుగల్గినానావిధములగు పరిమళద్రవ్య
ంలజేర్చి సిద్ధముచేయబడిన ఊరుగాయలు), గోమూత్రము, కాంబలికములు
పెరుగు, ఉప్పు, నెయ్యి, నువ్వులు, మినుములు, వీనినిచేర్చి పక్వముచేయ
శిన పెసలకట్టులు), మద్యము, పేముచిగురు, దనియాలు, టెంకాయ, నిమ్మ
ాయలు, ఉసిరికకాయలు, మామిడిపండ్లు, రేగుపండ్లు, ద్రాక్షపండ్లు, వెలగ
ండ్లు, కరకకాయలు, దానిమ్మకాయలు, మాదీఫలములు, జాజికాయలు, వట్టి
రు, వేప, అడ్డసరము, చక్కెర, పిల్లిపీచర, నాగకేసరములు, మనస్సునకు
క్కలి యింపైనవియు, శరీరమునకనుకూలములునైన భక్ష్యములు, భుజిం
చపిదప ముఖమున చల్లనినీళ్ళనుచల్లుట, కస్తూరి, చన్దనము, వెన్నెలలో
ండుట, రమ్యమైన పరిమళముతోగూడిన చందనము మున్నగు మైపూ
ు, పానములు, పుష్పములు, ఫలములు, తనమనస్సున కింపైన రూపముగల
స్తువులజూచుట, చెవులకింపగు శబ్దములవినుట, తనకుప్రియమగుగాలి మొద

లగు వానిని స్పృశించుట, యివియన్నియును, నాభియందును వెన్నెముకకు క్రిందిభాగమునందును పార్శ్వములయందును వీపునందును లోహశలాకచే రతు వేయుటయు వమనవ్యాధియందు పథ్యములైయుండును.

—॥ వమనరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ నస్యం వస్తిస్స్వేదనం స్నేహపానం
రక్తస్రావం దన్తకాష్ఠం ద్రవాన్నమ్ ।
బీభత్సేక్ష్యాం భీతిముద్వేగముష్ణం
స్నిగ్ధాసాత్మ్యాఽహృద్యవైరోచకాన్నమ్ ॥ ౧౬౭ ॥
రమ్భాబిమ్బీకోశవత్యో మధూక
చిత్రామేలాసర్షపా దేవదారుః ।
వ్యాయామం వాఽసాత్మ్యదుష్టాన్నపానం
ఛర్ద్యాం సద్యో వర్జయేదప్రమత్తః ॥౧౬౮॥

తా॥ నస్యము, వస్తికర్మ, స్వేదనము (శరీరమున చెమటవెడలించుట), స్నేహపానము(ఆముదము మున్నగు స్నేహద్రవ్యముల పానము జేయుట), రక్తమును వెడలించుట, దన్తధావనము జేయుట, ద్రవముగల యన్నమును తినుట, మనసునకు అసహ్యతనుగల్గించు శవములు మాంసరక్తములు మున్నగు వానినిజూచుట, భయము, చింత, ఉష్ణంబును స్నిగ్ధంబును అసాత్మ్యంబును మనసునకింపుకానిదియు అరుచినికల్గించునదియునైన యన్నమును భుజించుట, అరటికాయలు, దొండకాయలు, బీరకాయలు, విప్పకాయలు, మంజిష్ఠి, ఏలకులు, ఆవాలు, దేవదారు, వీనినన్నిటిని సేవించుట, దేహపరిశ్రమ జేయుట, శరీరమునకు హితములుకానివియు దుష్టంబులునైన యన్నపానములసేవించుట, ఇవి యన్నియు వమనరోగమునందు అపథ్యములు కావున విడువవలెను.

—॥ తృష్ణా (దప్పి) రోగమునందు పథ్యము. ॥—

శ్లో॥ శోధనం వమనం నిద్రా స్నానం కబలధారణమ్ ।
కోద్రవాశ్శాలయః పేయవిలేపీలాజసక్తవః ॥౧౬౯॥

అన్నమణ్డో ధన్వరసః శర్కరా రాగఖాణ్డవః।
భృష్టముద్గైర్మసూరైర్వా చణకైర్వా కృతో రసః ॥౧౭౦॥
రమ్భాపుష్పం తక్రకూర్చా ద్రాక్షా పర్పటవల్లకమ్।
కపిత్థం మాలికా కోలం కూశ్మాణ్డకముపోదికా॥౧౭౧॥
ఖర్జూరం దాడిమం ధాత్రీ కర్కారీ లలదమ్బు చ॥
జమ్బీరం కరమర్దశ్చ బీజపూరో గవాం పయః ॥౧౭౨॥
మధూకపుష్పం హ్రీబేరం తిక్తాని మధురాణి చ।
బాలతాలామ్బు శీతామ్బు పయః పేయం ప్రపానకమ్॥
మాక్షికం సరసీతోయం శతాహ్వా నాగకేసరమ్।
ఏలా జాతీఫలం పథ్యా కుస్తుమ్బురు కుచన్దనమ్ ॥౧౭౪॥
ఘనసారో గన్ధసారః కౌముదీ శిశిరోఽనిలః।
చన్దనార్ద్రప్రియాశ్లేషో ముక్తాభరణధారణమ్ ॥౧౭౫॥
గాహనం లేపనం చాస్య పథ్యమేతత్ప్రపాతురే।

తా॥ శోధనము, వమనము, నిద్ర, స్నానము, కబలధారణము (నోటి యందు పుక్కిలించుటకు వసతియుండునట్లులు కషాయాదుల నుంచుకొనుట), ఆయకలు, రాజనములు, పేయ (మెతుకులతోగూడిన గంజి), విలేపి (మెతుకు లధికముగ నుండునట్లులు కాచబడిన గంజి), పేలాలచే జేయబడిన సత్తుపిండి, అన్నమండము (అన్నమును జేర్చి కాచి మెతుకులు లేనట్లులు వడగట్టబడిన గంజి), అరణ్యముననుండు జంతువుల మాంసరసము, చక్కెర, వేయించబడిన పెసలనైనను చిరుసెనగలనైనను సెనగలనైననుచేర్చి అందు రాగఖాండవమును చేర్చి కాచబడినకట్టు, (రాగఖాండవమనగా మావిడికాయ పైదోలు తీసి రెండు మూడు తునియలుగా నరికి నేతిలోవేయించి యందు మిరియాలను ఏలకులనుకలిపి దానిని నేతితోమాగిన కుండయందూరబెట్టబడిన ఊరుగాయ) అరటిపువ్వు, తక్రకూర్చము (మజ్జిగతోసమభాగముగ పాలుకలిపి కాచబడిన

ద్రవపదార్థము), ద్రాక్షపండ్లు, పర్పాటకము, వాయువిడంగములు, వెలగపండ్లు, ద్రాక్షామద్యము, రేగుపండ్లు, గుమ్మడికాయలు, బచ్చలికూర, ఖర్జూరపుపండ్లు, దానిమ్మపండ్లు, ఉసిరికకాయలు, ములుదోసకాయలు, నిల్కడలేక ప్రవహించుచుండు ఏళ్లు కాలువలు మున్నగువానియందుగలజలము, నిమ్మపండ్లు కలివికాయలు, మాదీఫలములు, ఆవుపాలు, ఇప్పపువ్వులు, కురువేరు, చేదును తీపునుకల పదార్థములు, లేతతాటికాయలయందలినీరు, చల్లనినీళ్లు, పాలు, పానకము, తేనె, సరస్సులలోనుండు జలము, పిల్లిపీచర, నాగకేసరములు, ఏలకులు, జాజికాయ, కరకకాయ, దనియాలు, రక్తచందనము, పచ్చకప్పురము, శ్రీగంధము, ఇవియన్నియు తృష్ణారోగముకలవారికి పథ్యములైయుండును.

మఱియు వెన్నెలయందును చల్లనిగాలియందు నుండుటయు, చందనము బూసికొన్న స్త్రీయురాండ్ర గౌగలించుటయు, ముత్యములచే జేయబడిన యాభరణముల ధరించుటయు, చందనాదుల బూసికొనుటయు తృష్ణారోగమున మిగుల పథ్యములైయుండును.

—తృష్ణారోగమునం దపథ్యములు.—

శ్లో॥ స్నేహాఞ్జనం స్వేదనధూమపానం
వ్యాయామనస్యాతప దన్తకాష్ఠమ్ ।
గుర్వన్నమమ్లం లవణం కషాయం
కటుత్రికం దుష్టజలాని తీక్ష్ణమ్॥ ౧౭౬॥
ఏతాని సర్వాణి హితాభిలాషీ
తృష్ణాతురో నైవ భజేత్కదాచిత్ ।

తా॥ స్నేహనము, అంజనము, స్వేదనము, పొగను పీల్చుట, దేహపరిశ్రమజేయుట, నస్యమును పీల్చుట, ఎండలోనుండుట, దంతధావనము జేయుట, అజీర్ణకరమైన యన్నమును భుజించుట, అమ్ల(పులుపు) లవణ(ఉప్పు) కషాయ(వగరు) రసములుకలపదార్థముల భుజించుట, త్రికటుకములు, చెడిన నీళ్ళు ద్రాగుట, తీక్ష్ణగుణముకల పదార్థములు వీనన్నిటిని తృష్ణారోగముచే

)డితుడగు మనుజుండు తనకు హితమును కోరినచో నొకప్పుడైనను సేవింప
కగదు. (తృష్ణారోగమునందు పైజెప్పబడినవియన్నియు నపథ్యములనిభావము.)

—( మూర్ఛారోగమునందు పథ్యములు. )—

శ్లో॥ సేకావగాహౌ మణయస్సహారాః
శీతాః ప్రదేహాః వ్యజనానిలశ్చ॥౧౭౭॥
శీతాని పానాని చ గన్ధవన్తి
ధారాగృహం శీతమరీచిరోచిః।
ధూమోఽఞ్జనం నావనరక్తమోక్షౌ
దాహశ్చ సూచీపరితోదనాని॥౧౭౮॥
లోమ్నాం కచానామపి లుఞ్చనాని
నఖాన్తపీడా దశనోపదంశః।
నాసాముఖద్వారమరున్నిరోధో
విరేచనచ్ఛర్దనలఙ్ఘనాని॥౧౭౯॥
క్రోధో భయం దుఃఖకరీ చ శయ్యా
కథా విచిత్రాస్సుమనోహరాశ్చ।
ఛాయా నభోఽమ్బుశ్శృతశీతసర్పి
ర్మృదూని తీక్ష్ణాని చ లాజమణ్డః॥౧౮౦॥
జీర్ణా యవా లోహితశాలయశ్చ
కౌమ్భం హవిర్ముద్గసతీనయూషః।
ధన్వోద్భవా మాంసరసాశ్చ రాగాః
సఖాణ్డవా గవ్యపయస్సితా చ॥౧౮౧॥
పురాణకూశ్మాణ్డపటోలమోచ
హరీతకీదాడిమనారికేరమ్।

మధూకపుష్పాణి చ తణ్డులీయః
తుషోదకాన్నాని లఘూని వాపి॥౧౮౨॥
ప్రతీరనీరం సితచన్దనాని
కర్పూరనీరం హిమవాలుకా చ।
అత్యచ్ఛశబ్దోఽద్భుతదర్శనాని
గీతాని వాద్యాన్యపి చోత్కటాని॥ ౧౮౩॥
శ్రమస్స్మృతి శ్చిన్తనమాత్మబోధో
ధైర్యం చ మూర్చ్ఛావతి పథ్యవర్గః॥

తా॥ శరీరముపై నీళ్ళు చల్లుట, స్నానముచేయుట, మణులను హారములను ధరించుట, చల్లనిగంధము మున్నగువానిని బూసికొనుట, విసనకఱ్ఱలచే విసరుట, పరిమళముతోగూడి చల్లనైన జలము మున్నగువానిని పానము జేయుట, ఉదకధారలతో గూడినయింట వసించుట, వెన్నెలలో నుండుట, పొగనుపీల్చుట, అంజనములు, నస్యము, రక్తమును వెడలించుట, నిప్పున కాచబడిన లోహశలాకలచే రతు వేయుట, సూదులచేగ్రుచ్చుట, మూర్ఛకల్గినప్పుడు శరీరమునందలి రోమములను తల వెండ్రుకలను ఊడబెరుకుట, గోళ్ళచే గిచ్చుట, పండ్లచే కొరకుట, ముక్కులయొక్కయు ముఖముయొక్కయు రంధ్రముల నుండివెడలు శ్వాసమును బిగబట్టుట, వమనవిరేచనలంఘన (లంకణ) ములజేయుట, కోపమును భయమును కల్గించుట, శరీరమునకు కష్టమును కల్గించు శయ్యపై బరుండుట, మిగుల చిత్రంబులును మనోహరంబులునైన కథలవినుట, నీడలోనుండుట, వర్షధారాజలమును ద్రాగుట, శతధౌతఘృతము (నూరుమార్లు కషాయాదులజేర్చి చిలకబడిన నెయ్యి), మృదువులును తీక్ష్ణంబులునైన పదార్థములు, పేలాలజేర్చి చేయబడిన మండము, ప్రాతవియగు యవలయొక్కయు ఎఱ్ఱవరివడ్లయొక్కయు బియ్యము, కుండలోమాగిన నెయ్యి, పెసలనైనను లంకలనైనను జేర్చి పక్వముచేయబడిన కట్టులు, అరణ్యముననుండు జంతువుల మాంసరసములు, రాగములు (చక్కెర, సౌవర్చలలవణము, సైంధవ

లవణము, చింతపండు, చిట్రీతపండు, నేరేడుపండ్లరసము, ఈ ద్రవ్యముల జేర్చి పక్వము జేసి ఆవాలచే తిరగమూత బెట్టబడిన పదార్థములు), ఖాండవములు (మధురామ్ల లవణ రసముల జేర్చి పరిమళద్రవ్యములచే పరిమళింప జేయబడిన కూరగాయలు), అవుపాలు, చక్కెర, గుమ్మడిపండు, పొట్లకాయలు, అరటి కాయలు, కరకకాయలు, దానిమ్మపండ్లు, టెంకాయలు, ఇప్పపువ్వులు, చిత్రి కూర, కుడితినీళ్ళు, శీఘ్రముగ జీర్ణములగు నన్నములు, నదులలో ప్రవహించు జలము, తెల్లనిచందనము, పచ్చకప్పురముతోగూడిన నీళ్లు, పచ్చకప్పురము, బిగ్గరగ ధ్వనిజేయుట, మిక్కిలి యాశ్చర్యకరములగు వస్తువులజూచుట, రమ్యములైన గానమును వాద్యధ్వనులను వినుట, దేహపరిశ్రమ జేయుట, పూర్వము జరిగిన విషయములను జ్ఞప్తికిదెచ్చుకొనుట, పూర్వవిషయముల నాలోచనజేయుట, వేదాన్తమున పరిశ్రమజేయుట, ధైర్యము కల్గియుం డుట, ఇవియన్నియు మూర్ఛారోగము గలవారికి పథ్యములై యుండును.

—॥ మూర్ఛారోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ తామ్బూలం పత్రశాకాని దన్తఘర్షణమాతపమ్ ।
విరుద్ధాన్యన్నపానాని వ్యవాయం స్వేదనం కటు ।
విణ్మూత్రవేగరోధం చ తక్రం మూర్ఛామయీ త్యజేత్ ॥

తా॥ తాంబూలము, ఆకుగూరలు, దన్తధావనము, ఎండలోనుండుట, పరస్పర విరుద్ధములగు క్షీరమత్స్యాదుల నొకటిగ జేర్చబడిన యన్నపానములు, సంభోగము, స్వేదనకర్మ, కారముగల పదార్థములు, మలమూత్రముల వేగ మును నిరోధించుట, మజ్జిగ, వీనినన్నిటిని మూర్ఛావ్యాధికలవాడు విడువ వలెను.

—॥ మదాత్యయరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ సంశోధనం సంయమనం స్వపనం లఙ్ఘనం భ్రమమ్।
సంవత్సరసముత్పన్నాశ్శాలయష్షష్టికా యవాః॥౧౮౫॥
ముద్గాశ్చ మాషగోధూమాః లావతిత్తిరకాదయః।

వేసవారో విచిత్రాన్నం హృద్యం మద్యం పయస్సితా॥
తణ్డులీయం పటోలం చ మాతులుఙ్గం పరూషకమ్ ।
ఖర్జూరం దాడిమం ధాత్రీ నారికేళం చ గోస్తనీ ॥౧౮౭॥
సర్పిః పురాణం కర్పూరం ప్రతీరం శిశిరోఽనిలః ।
ధారాగృహం చన్ద్రపాదాః మణయో మిత్రసంగమః॥
క్షౌమామ్బరం ప్రియాశ్లేషో గీతం వాదిత్రముద్గతమ్ ।
శీతామ్బు చన్దనం స్నానం సేవ్యమేతన్మదాత్యయే॥౧౮౮॥

తా॥ సంశోధనము (వమన విరేచనకర్మలు), నియమము గల్గియుండుట, నిదురించుట, లంకణము, సంచరించుట, సంవత్సరకాలమునకు మున్ను జనించిన రాజనములు, అరువదినాళ్ళ సంబావులు, యవలు అనునీధాన్యములు, పెసలు, మినుములు, గోధుమలు, లావుకపిట్ట తీతువుపిట్ట మున్నగు పక్షుల మాంసములు, వేసవారములు (జీలకఱ్ఱ, మిరియాలు, శుంఠి, గ్రంథి తగరము, దనియాలు, వసపు, మానిపసపు, పిప్పళ్ళు, దానిమ్మపండ్లు, వీనినన్నిటిని చేర్చి తిరగమోత పెట్టబడిన మాంసములు), చిత్రాన్నములు, రమ్యమగు మద్యము, పాలు, చక్కెర, చిఱ్ఱికూర, పొట్లకాయలు, మాదీఫలములు, చిట్రీతపండ్లు, ఖర్జూరపుపండ్లు, దానిమ్మపండ్లు, ఉసిరికపండ్లు, టెంకాయలు, ద్రాక్షపండ్లు, ప్రాతనెయ్యి, పచ్చకప్పురము, నదీతీరమున నివసించుట, చల్లనిగాలిని సేవించుట, ఉదకధారలుకల యింటనుండుట, వెన్నెలలో నుండుట, మణులు, స్నేహితులతో గలిసియుండుట, పట్టుగుడ్డలగట్టుట, ప్రియురాలిని ఆలింగనము జేసికొనుట, గీతవాద్యముల వినుట, చల్లనినీళ్ళు, చందనము, స్నానము జేయుట,ఇవియన్నియు మదాత్యయమునందు పథ్యములుగాన సేవింపందగును.

—॥ మదాత్యయమునందపథ్యములు. ॥—

శ్లో॥ స్వేదోఽఞ్జనం ధూమపానం నావనం దన్తఘర్షణమ్ ।
తామ్బూలం చాప్యపథ్యం స్యాన్మదాత్యయ వికారిణామ్॥

తా॥ చెమట కొడలించుట, అంజనము, పొగద్రాగుట, నస్యమును పీల్చుట, దన్తధావనము జేసికొనుట, తాంబూలము, ఇవియన్నియు మదాత్యయమునందు అపథ్యములు.

—॥ దాహరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ శాలయష్షష్టికా ముద్గా మసూరాశ్చణకా యవాః।
ధన్వమాంసరసా లాజమణ్డో నై సక్తునాసితః ॥౧౯౧॥
శతధౌతం ఘృతం దుగ్ధం నవనీతం పయోద్భవమ్ ।
కూశ్మాణ్డం కర్కటీమోచాపనసస్స్వాదుదాడిమమ్॥౧౯౨॥
పటోలం పర్పటీ ద్రాక్షా ధాత్రీఫలపరూషకమ్ ।
బిమ్బా తుమ్బా పయఃపేటీ ఖర్జూరం ధాన్యకం మిసిః ॥
బాలతాలం ప్రియాలం చ శృఙ్గాటం చ కసేరుకమ్ ।
మధూకపుష్పం హ్రీబేరం పథ్యా తిక్తాని సర్వశః॥౧౯౪॥
శీతాః ప్రదేహా భూవేశ్మ సేకోఽభ్యంగోఽవగాహనమ్।
ఫుల్లోత్పలదళంక్షౌమం శయ్యా శీతలకాననమ్ ॥౧౯౫॥
కథా విచిత్రా గీతాని వాద్యం మఞ్జులభాషణమ్ ।
ఉశీరం చన్దనాలేపః శీతాంశుశిశిరోఽనిలః ॥౧౯౬॥
ధారాగృహం ప్రియాస్పర్శః ప్రతీరం హిమవాలుకమ్ ।
సుధాంశురశ్మయః స్నానం మణయోమధురోరసః॥౧౯౭॥
పుర్యోయాని విధేయాని పిత్తహారీణి తాని చ।
ఇతి దాహవతాం నృణాం పథ్యవర్గ ఉదాహృతః॥౧౯౮॥

తా॥ రాజనములు, అరువదినాళ్ల సంబావులు, పెసలు, చిరుసెనగలు, సెనగలు, యవలు, ఆరణ్యమునందు జంతువుల మాంసరసములు, సత్తుపిండి తోడను పరిమళద్రవ్యములతోడను గూడిన లాజమండము, శతధౌత (కషాయాదులజేర్చి నూరుమార్లు చిలకబడిన) ఘృతము, పాలు, పాలలోబుట్టిన వెన్న,

గుమ్మడికాయ, నక్క-దోసకాయ, అరటికాయలు, పనసకాయ, తీయదానిమ్మ కాయ,పొట్లకాయ,పర్పాటకము,ద్రాక్షపండ్లు, ఉసిరికకాయలు,చిట్రీతపండ్లు, దొండపండు, సొరకాయ, టెంకాయ, ఖర్జూరపుపండు, ధనియాలు, సదాప, లేతతాటికాయ, చారపప్పు, దుంపగడ్డలు, నమ్మదుంపలు, ఇప్పపువ్వులు, కురువేరు, కరకకాయలు, తిక్త (చేదు) రసముకల నానావిధపదార్థములు, చల్లనైన చందనాదులబూయుట, భూమిగృహముల (భూమికిలోభాగముననుండు గృహముల) నివసించుట, చల్లనినీళ్ళచే తడుపుట, అభ్యంగస్నానముజేయుట, సరస్సులున్నగువానియందు మునుగుట, వికసించినకలువలు,పట్టుగుడ్డలు, శయ్యపైబరుండుట, చల్లనైనవనములోనుండుట, చిత్రములగు కథలవినుట, గీతవాద్యములవినుట,రమ్యములగుమాటల వినుట, వట్టివేళ్లు, చందనము బూసికొనుట, పచ్చకప్పురముచే చల్లనైవీచునట్టిగాలి, జలధారలతోగూడిన యింటనుండుట, ప్రియురాండ్రస్పృశించుట, నదీతీరముననుండుట, పచ్చకప్పురము, వెన్నెలలోనుండుట, స్నానముజేయుట మణులధరించుట, మధురరసముకల పదార్థములసేవించుట, ఇవియన్నియును; పిత్తహరములగు నానావిధ పదార్థములును దాహ (సంతాపము) రోగముకలవారికి పథ్యములైయుండును.

—॥ దాహరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ విరుద్ధాన్యన్నపానాని క్రోధో వేగవిధారణమ్।
గజాశ్వయానమధ్వా చ క్షారంపిత్తకరాణి చ ॥౧౯౯॥
వ్యాయామమాతపం తక్రం తామ్బూలం మధురామ్లకమ్।
వ్యవాయం కటుతీక్ష్ణోష్ణం దాహవాన్ పరివర్జయేత్ ॥

తా॥ పరస్పరవిరుద్ధములగు నన్నపానములు, కోపము, మలమూత్రాది వేగముల నిరోధించుట,ఏనుగు గుఱ్ఱము మున్నగు వాహనములపైనెక్కి సవారి చేయుట, త్రోవనడచుట, క్షారపదార్థములు, పిత్తమును వృద్ధినొందించు నానావిధ పదార్థములు, దేహపరిశ్రమజేయుట, ఎండలోనుండుట, మజ్జిగ,

తాంబూలము, తేనె, ఇంగువ, స్త్రీసంభోగము, కటు (కారము) తిక్త (చేదు) రసములుకలపదార్థములను ఉష్ణపదార్థములను సేవించుట, వీనినన్నిటిని దాహ రోగముకల మనుజుండు విడువవలెను.

—( ఉన్మాదరోగమునందు పథ్యములు. )—

శ్లో॥ స్నేహో విరేకో వమనం చ పూర్వం
క్రమాన్మరుత్పిత్తకఫోత్థరేషు।
తతః పరం వస్తివిధిశ్చ నస్యం
సన్తర్జనం తాడనమఞ్జనఞ్చ ॥౨౦౧॥
ఆశ్వాసనం త్రాసనబన్ధనాని
భయప్రదానాని చ హర్షణాని।
ధూపో దమో విస్మరణం ప్రదేహః
సిరావ్యధస్సంశమనం చ సేకః ॥౨౦౨॥
ఆశ్చర్యకర్మాణి చ ధూమపానం
ధీధైర్యసత్వాత్మనివేదనాని।
అభ్యఞ్జనం స్వాపనమాసనాని
నిద్రా సుశీతాన్యనులేపనాని ॥౨౦౩॥
గోధూమముద్గారుణశాలయశ్చ
ధారోష్ణదుగ్ధం శతధౌతసర్పిః।
ఘృతం నవీనఞ్చ పురాతనఞ్చ
కూర్మామిషం ధన్వరసా రసాలాః ॥౨౦౪॥
పురాణకూశ్మాణ్డఫలం పటోలం
బ్రాహ్మీదలం వాస్తుక తణ్డులీయమ్।
ఖరాశ్వమూత్రం గగనామ్బు పథ్యా
సువర్ణచూర్ణాని చ నారికేళమ్ ॥౨౦౫॥

ద్రాక్షా కపిత్థం పనసం చ నైదై
ర్వాధేయమున్మాదగదేషు పథ్యమ్ ।

తా॥ ఉన్మాదరోగము వాతముచే జనించినచో తొలుత ఘృతాదులచే స్నేహనకర్మ జేయుటయు, పిత్తముచే జనించినయెడ విరేచనము జేయించుటయు, కఫముచే జనించెనేని వమనము జేయించుటయు పథ్యములైయుండును. పిన్మటి వస్తికర్మ, నస్యము, బెదరించుట, కొట్టుట, కండ్లకు కలికము వేయుట, ఊరడించుట, భయముపెట్టుట, కట్టుట, వెఱపును గల్గించునవియు సంతోషమును కల్గించునవియునైన పనులజేయుట, ధూపము వేయుట, దమము (బాహ్యేంద్రియముల నిగ్రహించుట), మఱపు బుట్టించుట, చందనాదుల బూయుట, సిరావ్యధనము జేయుట, సంశమనక్రియ జేయుట, చల్లనినీళ్లు మున్నగువానిని పైజల్లుట, ఆశ్చర్యమును బుట్టించు పనుల జేయుట, పొగను ద్రాగుట, బుద్ధికి ధైర్యమును గల్గించుట, సత్వగుణమును ఆత్మజ్ఞానమును కల్గించుట, అభ్యంజనస్నానము జేయించుట, నిదురనొందించుట, పలువిధముల తిరుగనీయక యొక్కచోట గూర్చుండబెట్టుట, నిదురనొందించుట, మిక్కిలి చల్లనైన మైపూతల బూయుట, వీనినన్నిటిని ఉన్మాదరోగముకలవారికి భిషగ్వరులు చేయించినచో పథ్యములైయుండును.

మఱియు గోధుమలు, పెసలు, ఎఱ్ఱవరివడ్లు, ధారోష్ణములగు (పిండినతోడనే వేడిగ నురుగుతోగూడియుండు) పాలు, శతధౌతఘృతము, క్రొత్తనెయ్యి, ప్రాతనెయ్యి, తాబేటిమాంసము, అరణ్యమునసుండు జంతువుల మాంసరసములు, రసాల (పెరుగుతో కలపబడిన సత్తుపిండి), ప్రాతదియగు గుమ్మడిపండు, పొట్లకాయలు, వల్లారియాకు, చెంచలికూర, చిర్రికూర, గాడిదెయొక్కయు గుఱ్ఱముయొక్కయు మూత్రము, క్రిందపడనీయక వర్షధారల నుండి గ్రహించబడినజలము, కరకకాయలు, స్వర్ణచూర్ణము, టెంకాయ, ద్రాక్షపండ్లు, వెలగపండ్లు, పనసకాయలు, ఇవియన్నియు నున్మాదరోగమున పథ్యములైయుండును.

—॥ కామశోకాదులచే గల్గిన యాగంతుక ఉన్మాదమున పథ్యములు. ॥—

శ్లో॥ కామశోకభయక్రోధదుఃఖైర్వా మోహసమ్భవమ్।
పరస్పరప్రతిద్వన్ద్వైరేభిరేవ శమన్నయేత్ ॥౨౦౬॥

ఇష్టద్రవ్యవినాశాత్తు మనో యస్యోపహన్యతే।
తస్య తత్సదృశలాభేన శాన్తిర్వ్యాధేః ప్రజాయతే॥౨౦౭॥
దేవర్షిపితృగన్ధర్వైర్యస్య తస్యచ బుద్ధిమాన్।
త్యజేన్న స్యాఞ్జనాదీని తీక్ష్ణాని క్రూరకర్మ చ॥ ౨౦౮॥
పూజాబల్యుపహారశాన్తినివహహోమేష్టమన్త్రక్రియా
దానం స్వస్త్యయనం వ్రతాదినియమః సత్యం జపో మఙ్గలమ్ ।
ప్రాయశ్చిత్తవిధానమఞ్జనవిధీ రత్నౌషధీధారణమ్
భూతానామనురూప మిష్టచరణం గౌరీపతేరర్చనమ్ ॥
యేచన్యుర్భువిగుహ్యకాశ్చప్రమథాస్తేషాం సమారాధనమ్
దేవబ్రాహ్మణపూజనం చ శమయేదున్మాదమాగన్తుకమ్॥

తా॥ కామము (సంభోగాదులయందభిలాష), శోకము (బంధువియోగాదులచే గల్గిన మనోవేదన), భయము, క్రోధము (శత్రువులుమున్నగువారుజేయు నపకారాదులచేగల్గు మనోవికారము), దుఃఖము (మనస్సున సంతొస ము లేక చింతబడుట), మోహము (సాధారణమైన జ్ఞానముమారి విరుద్ధమైన జ్ఞానము జనించుట), అను నీకారణములచే గల్గిన ఆగంతుక ఉన్మాదములయందు అట్టికారణములలో నొకదానికి విరుద్ధమగు వేరొండు క్రియచే శమియింపందగు. (అనగా కామముచే గల్గిన యున్మాదమున క్రోధమును గల్గించుటయు, శోకముచే జనించిన యున్మాదమున హర్షమును బుట్టించుటయు, భయముచేబుట్టిన యున్మాదమున భయరాహిత్యమును గల్గించుటయు, క్రోధముచే గల్గిన యున్మాదమున కామమును బుట్టించుటయు, దుఃఖముచే గల్గిన యున్మాదమున సుఖమును గల్గించుటయు, మోహముచే బుట్టిన యున్మాదమున జ్ఞానమును గల్గించుటయు పథ్యములని భావము.) తనకిష్టమగు ద్రవ్యాదులు

నాశమునొందుటచేనైన యున్మాదమునందు అట్టిరోగికి ఇష్టముగ ద్రవ్యాదుల నొసగూర్చినచో నాయున్మాదముశమించును. దేవతలు ఋషులు పితృదేవతలు గంధర్వులు మున్నగువారిచే గల్గిన యున్మాదమున మిగుల తీక్ష్ణములగు నస్యములు అంజనములు మున్నగువాని నుపయోగించుటయు, క్రూరములగుకర్మలను జేయుటయు పథ్యములుగావు కావున విడువవలెను. మఱియు నట్టి దేవ ఋష్యాది కారణములచే గల్గిన యాగంతుక ఉన్మాదములయందు పూజలజేయుట, బలియిచ్చుట, శాంతికర్మలజేయుట, హోమముజేయుట, యుక్తమైన మంత్రమును జపముజేయుట, దానములజేయుట, స్వస్తివాచనముల జేయుట, వ్రతాదినియమముల నొందియుండుట, అబద్ధములాడక సత్యము బల్కుట, జపముజేయుట, మంగళకరములగు క్రియలజేయుట, ప్రాయశ్చిత్తములజేయుట, అంజనములనుపయోగించుట, రత్నములను దివ్యౌషధులను ధరించుట, తత్కాలమున నావహించిన భూతముల కిష్టములను నెరవేర్చుట, ఈశ్వరుని పూజించుట, ఈశ్వరుని గణములలోజేరిన గుహ్యాకులు ప్రముఖులు మున్నగు దేవతులను, దేవబ్రాహ్మణులను బూజించుట, ఇవియన్నియును అట్టి యాగంతుక ఉన్మాదములను శమింపజేయును గాన పథ్యములైయుండును.

—॥ ఉన్మాదరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ మద్యం విరుద్ధాశనముష్ణభోజనం
నిద్రా క్షుధాతృట్కృతవేగధారణమ్ ॥౨౧౦॥
వ్యాయామమాషాఢఫలం కటిల్లకం
శాకాని పత్రప్రభవాని సర్వశః।
తిక్తాని తీక్ష్ణాని భిషక్సమాదిశే
దున్మాదరోగేషు విగర్హితాని ॥౨౧౧॥

తా॥ మద్యము, పరస్పరవిరుద్ధములగు నన్నపానములు, ఉష్ణపదార్థముల భుజించుట, నిద్ర ఆకలి దప్పి వీని వేగమును నిరోధించుట, దేహపరిశ్రమ జేయుట, ఆషాఢమాసమున జనించిన ఫలములు, కాకరకాయలు, నానావిధ

ములగు ఆవగూరలు, చేదుకల్గినవియు తీక్ష్ణంబులునైన పదార్థములు, ఇవి యన్నియు నపస్మారరోగమునందు అపథ్యములుగాన సేవింపదగవని వైద్యుండు జెప్పవలెను.

—॥ అపస్మారరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ వస్తిర్వాతోద్భవే పూర్వం పైత్తికే చ విరేచనమ్।
వమనం శ్లైష్మికే చాపి పరం ధూపనమఞ్జనమ్॥ ౨౧౨॥
నస్యం సిరావ్యధో దానం త్రాసనం బన్ధనం భయమ్।
తర్జనం తాడనం హర్షో ధూమపానం చ విస్మయః॥౨౧3॥
ధీహ్రీధైర్యాదివిజ్ఞానం స్నానమభ్యఞ్జనం హవిః।
కూర్మామిషం ధన్వరసాః దుగ్ధం బ్రాహ్మీదలం వచా॥౨౧౪॥
పటోలం వృద్ధకూశ్మాణ్డం వాస్తుకం స్వాదుదాడిమమ్।
శోభాఞ్జనం పయః పేటీ ద్రాక్షా ధాత్రీ పరూషకమ్॥
అపస్మారగదే నౄణాం పథ్యమేతదుదీరితమ్।

తా॥ అపస్మారరోగము వాతముచే గల్గినచో వస్తికర్మయు, పిత్తమువలన బుట్టినయెడ విరేచనంబును, కఫముచేజనించెనేని వమనంబును తొలుత జేయందగును. పిమ్మట ధూపము వేయుట, అంజనము, నస్యము, సిరావ్యధనము, దానముచేయుట, భయపరచుట, కట్టుట, బెదరించుట, కొట్టుట, చక్కిలిగింతలబెట్టుట, పొగత్రాగుట, ఆశ్చర్యమునుగల్గించుట, అట్టిరోగముకలవారికి తెలివి లజ్జ ధైర్యము మున్నగుదానిని కల్గించుట, స్నానము జేయుట, అభ్యంజనము జేయుట, నెయ్యిత్రాగుట, తాబేలుమాంసము, అడవిప్రదేశముననున్న మృగాది జంతువుల మాంసరసము, పాలు, వల్లారియాకు, వస, పొట్లకాయ, గుమ్మడిపండు, చక్రవర్తికూర, తీయదానిమ్మకాయ, మునగకాయలు, టెంకాయలు, ద్రాక్షపండ్లు, ఉసిరికకాయలు, చిట్టీతపండ్లు, ఇవియన్నియును అపస్మారరోగమునందు పథ్యములు.

—॥ అపస్మారరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ చిన్తాశోకభయక్రోధమద్భుతం దర్శనాని చ ॥౨౧౬॥
మద్యం మత్స్యం విరుద్ధాన్నం తీక్ష్ణోష్ణగురుభోజనమ్।
అతివ్యవాయమాయాసం పూజ్యపూజావ్యతిక్రమమ్॥
పత్రశాకాని సర్వాణి బిమ్బామాషాఢకం ఫలమ్।
తృష్ణానిద్రాక్షుధావేగానపస్మారీ పరిత్యజేత్ ॥౨౧౭॥

తా॥ చింత, దుఃఖము, భయము, క్రోధము, ఆశ్చర్యకరములగు వస్తువులఁజూచుట, మద్యము, మత్స్యములు, పరస్పరవిరుద్ధములగు నన్నములు, తీక్ష్ణంబులును ఉష్ణంబులును అజీర్ణకరంబులునగు పదార్థములు, అధికముగ సంభోగముజేయుట, శరీరమున కాయాసముగల్గించుట, పూజింపందగిన గురువులు తలిదండ్రులు దేవతలు మున్నగువారిని బూజించక భూతప్రేతాదుల బూజించుట, వారివారికి దగినట్టులు పూజచేయక వ్యత్యస్తముగ జేయుట, నానావిధములగు ఆకుగూరలు, దొండపండ్లు, ఆషాఢమాసమున జనించు ఫలములు, వీనినిసేవించుట, దప్పి ఆకలి నిద్ర వీనివేగమును నిరోధించుట, ఇవి యన్నియు నపస్మారరోగముకల వారికి పథ్యములుగావుకాన విడువవలెను.

—॥ వాతవ్యాధియందు పథ్యములు. ॥—

శ్లో॥ అభ్యఙ్గో మర్దనం వస్తిస్స్నేహం స్వేదోఽవగాహనమ్।
సంవాహనం సంశమనం ప్రావృడ్వాతవివర్జనమ్॥ ౨౧౯॥
అగ్నికర్మోపనాహాశ్చ భూశయ్యా స్నానమాసనమ్।
తైలద్రోణీ శిరోవస్తి శ్శమనం నస్యమాతపః॥ ౨౨౦॥
సన్తర్పణం బృంహణఞ్చ కిలాటం దధికూర్చికా।
సర్పిస్తైలం వసా మజ్జా స్వాద్వమ్లలవణా రసాః ॥౨౨౧॥
నవీనాస్తిలగోధూమమాషాస్సంవత్సరోషితాః।
శాలయష్షష్టికాశ్చాపి కులుత్థానాం రసాస్సురా ॥౨౨౨॥

గ్రామ్యానూపఖరోష్ట్రాశ్చ రాసభచ్ఛాగలాదయః।
ఆనూపాః కోలమహిషన్యఙ్కుఖడ్గిగజాదయః॥ ౨౨౩॥
ఔదకా హంసకాదమ్బచక్రమర్దబకాదయః।
బిలేశయా భేకగోధానకులశ్చ ద్విజాదయః॥ ౨౨౪॥
చటకః కుక్కుటో బర్హీ తిత్తిరశ్చేతి జాఙ్గలః।
శిలీన్ధ్రఃపర్వతో నక్రో గర్గరః కవయీల్లిశః॥ ౨౨౫॥
ఏరణ్డశ్చులకీకర్మ శిశుమారస్తిమిఙ్గలః।
రోహితో మద్గురశ్శృఙ్గీ వర్మి చ ఖుడిశో ఝషః॥ ౨౨౬॥
పటోలం శిగ్రు వార్తాకం లశునం దాడిమద్వయమ్।
పక్వం తాలం రసాలఞ్చ లలదమ్బ పరూషకమ్॥ ౨౨౭॥
జమ్బీరం బదరం ద్రాక్షా నాగరఙ్గో మధూకజమ్।
ప్రసారిణీ గోక్షురకశ్శుక్లాక్షీ పారిభద్రకః॥ ౨౨౮॥
పయాంసి చ పయఃపేటీ రుబుతైలం గవాం జలమ్।
మత్స్యణ్డికా చ తామ్బూలం ధాన్యామ్లం తిన్త్రిడీఫలమ్ ॥
స్నిగ్ధోష్ణాని చ భోజ్యాని స్నిగ్ధోష్ణశ్చానులేపనమ్।
విశేషాద్వమనంకార్య మామాశయముపాగతే॥ ౨౩౦॥
పక్వాశయస్థే మాంసస్థే తథా స్నిగ్ధం విరేచనమ్।
ప్రత్యాధ్మానాధ్మానయోర్వాప్యవర్తిరగ్నిదీపనమ్॥ ౨౩౧॥
అష్ఠీలాస్థే గుల్మవిధిః శుక్రస్థే శుక్రజిత్క్రియా।
త్వక్స్థాం సాసృక్సిరాప్రాప్తే హితం శోణితమోక్షణమ్॥
యథాశ్రయం యథావస్థం యథాచరణమేన హి।
వాతవ్యాధౌ సముత్పన్నే పథ్యమేతన్నృణాం భవేత్॥

తా॥ వాతహరములగు తైలాదులచే నభ్యంగనము జేసికొనుట, అట్టి తైలాదులబూసి శరీరమున మర్దనజేయుట, వస్తికర్మ, స్నేహనకర్మ, శరీరమున చెమట బుట్టించుట, నీటిలో మునుగుట, ఒడలు పిసికించుకొనుట, సంశమనౌషధముల సేవించుట, తూర్పుగాలిని సేవించకయుండుట, అగ్నికర్మ (నిప్పునకాలిన లోహశలాకలచే రక్షవేయుట), వాతమును హరించు నౌషధముల జేర్చి కట్టుకట్టుట, భూమిపై బరుండుట, స్నానము జేయుట, కూర్చునియుండుట, తైలద్రోణి (కంఠమువరకు శరీరమంతయు మునుగునట్టులు తైలాదులచే నిండింపబడిన తొట్టి మొదలగు పాత్రలలో నుండుట), శిరోవస్తికర్మ, శమనసంజ్ఞక నస్యమును సేవించుట, ఎండలో నుండుట, సంతర్పణము (రసాదిధాతువులను వృద్ధినొందించి శరీరమును బుష్టినొందించు పదార్థముల సేవించుట), కిలాటము (పెరుగును పాలను సమభాగముగ జేర్చి కాచినచో నందు ముద్దగనుండు జున్ను), దధికూర్చిక (పెరుగును పాలను సమభాగముగ జేర్చి కాచబడినది), నెయ్యి, నూనె, వస(మాంసమునందలి చమురు), మజ్జ (ఎముకలలో నుండు క్రొవ్వు), మధుర (తీపు), అమ్ల (పులుపు), లవణ(ఉప్పు) రసములుగల పదార్థములు, క్రొత్తవియగు నువ్వులు, గోధుమలు, మినుములు, సంవత్సరకాలమునకు మున్ను పండిన రాజనముల బియ్యము, అరువదినాళ్ళ సంబావుల బియ్యము, ఉలవకట్టు, కల్లు, గ్రామములయందును జలప్రాంతమునందునుండు జంతువులయొక్కయు ఒంటెలయొక్కయు గాడిదెలయొక్కయు మాంసము, కంచరగాడిదె మేకపోతు మొదలగువాని మాంసములు, బిలములయందుండు కప్పలు ఉడుములు ముంగిసలు మున్నగువానియొక్కయు, అరణ్యమునందుండు పిచ్చుక, కోడి, నెమలి, తీతువుపిట్ట, ఇవి మున్నగు పక్షులయొక్కయు మాంసములు, శిలీంధ్రము, పర్వతము, నక్రము, గర్గరము, కవయి, ఇల్లిశము, ఏరండము, చులకి, శిశుమారము, తిమింగిలము, రోహితము, మద్గురము, శృంగి, వర్మి, ఖుడిశము, ఝషము, అనునీమత్స్యములు; పొట్లకాయలు, మునగకాయలు, వంకాయలు, ఉల్లిగడ్డలు, పుల్లదానిమ్మ, తియ్యదానిమ్మ, తాటిపండ్లు, తియ్యమామిడిపండ్లు,

నిల్కడలేక ప్రవహించునదులు మున్నగువాని జలము, చిట్రీతపండ్లు, నిమ్మ కాయలు, రేగుపండ్లు, ద్రాక్షపండ్లు, నారింజపండ్లు, ఇప్పపండ్లు, గొంతెమ గోరు, పల్లేరు, తెల్లతెగడ, వేప, పాలు, టెంకాయనీళ్ళు, ఆముదము, గోమూత్రము, ఖండశర్కర, తాంబూలము, పుల్లనిగంజి, చింతపండు, స్నిగ్ధం బులును ఉష్ణంబులునైన పదార్థములు, స్నిగ్ధంబులును ఉష్ణంబులునగు మైపూ తలు, ఇవియన్నియు వాతవ్యాధియందు సామాన్యముగ పథ్యములైయుం డును. మఱియు వాతము ఆమాశయమున జేరినపుడు వమనజేయించుట మిక్కిలి హితకరమైయుండును. పక్వాశయమున జేరినపుడును మాంసగత మైనపుడును తైలమున్నగు స్నేహద్రవ్యములచేత విరేచనము జేయించ వలెను. ప్రత్యాధ్మానము, ఆధ్మానము అను వాతవ్యాధులయందు వర్తి, లంకణము, అగ్నిని దీపింపజేయు సాపధాదులు, ఇవియన్నియు పథ్యములు. అష్ఠీలావాతమునందు గుల్మవ్యాధికి జెప్పినవియన్నియు పథ్యములు; శుక్రము నాశ్రయించిన వాతవ్యాధియందు శుక్రక్షయమునకు జెప్పిన చికిత్సలన్నియు పథ్యములు. చర్మము, మాంసము, రక్తము, సిరలు, వీనియందు జనించిన వాతరోగమునందు రక్తమోక్షము జేయుట పథ్యము. వాతవ్యాధి రస రక్తాదిధాతువులలో నెద్దాని నాశ్రయించి చయప్రకోపాద్యవస్థలలో నెట్టి యవస్థనొంది జనించునో అట్టి వాతవ్యాధికి పైజెప్పబడినరీతిగ పథ్యక్రమము నెరుంగవలెను.

—( వాతవ్యాధియం దపథ్యములు. )—

శ్లో॥ చిన్తాప్రజాగరణవేగవిధారణాని
ఛర్ద్దిశ్రమోఽనశనతా చణకా మకుష్ఠాః ।
నీవారకఙ్గుశరణైణవకోరదూష
శ్యామాకజూర్ణకురువిన్దముఖాని యాని॥ ౨౩౪॥
ధాన్యాని తాలతృణజాని చ రాజమాషాః
ముద్గా గుడాగరు నదీజలశీతలఞ్చ।

జమ్బ్వాః కసేరు కమలం క్రముకం మృణాలం
నిష్పావబీజమపి తాలఫలాస్థి మజ్జా ॥ ౨౩౫॥
శిమ్బా చ పత్రభవశాకముదుమ్బరశ్చ
శీతామ్బు రాసభపయోఽపి విరుద్ధమన్నమ్ ।
క్షారోఽపి శుష్కపలలం రుధిరస్రుతిశ్చ
క్షౌద్రం కషాయకటుతిక్తరసా వ్యవాయః।
హాస్త్యశ్వయానమపి చఙ్క్రమణఞ్చ ఖట్వా ॥ ౨౩౬॥
ఆధ్మానినోఽర్దితవతోపి పునర్విశేషాత్
స్నానం ప్రదుష్టసలిలం ద్విజఘర్షణఞ్చ।
నిశ్శేషతస్తు పరికీర్తిత ఏష వర్గో
నౄణాం సమీరణగదేషు ముదం నదత్తే ॥ ౨౩౭॥

తా॥ మనస్సున చింతించుట, నిదురమేల్కొంచియుండుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, వాంతిజేయుట, శరీరమునకు శ్రమగల్గించుట, ఆహారమును భుజించక ఉపవాసముండుట, సెనగలు, అడవిపెసలు, నీవారములు (ఒకరువిత్తకయే తనంతట పండెడు గనుక మున్నగు తృణధాన్యములు), కొఱ్ఱలు, శరములు, వెదురుబియ్యము, ఆరుకలు, సామలు, జొన్నలు పెద్దసంబావులు మున్నగు తృణధాన్యములు; అలచందులు, పెసలు, బెల్లము, అగరు, ఏటినీళ్లు, చల్లనినీళ్లు, సేరేడుపండ్లు, నమ్మదుంపలు, తామరపువ్వులు, పోకలు, తామరకాడలు, అనుములు, తాటివిత్తనములలోని గిజురు, శింబీధాన్యములు, ఆకుగూరలు, అత్తికాయలు, మంచునీళ్ళు, గాడిదపాలు, పరస్పర విరుద్ధములగు నన్నములు, క్షారములు, ఎండిన మాంసములు, రక్తమోచనముజేయుట, తేనె, కషాయ (వగరు) కటు (కారము) తిక్త (చేదు) రసములుకల పదార్థములు, స్త్రీసంభోగము, ఏనుగులు గుఱ్ఱములు మున్నగు వాహనములపైనెక్కి సవారిచేయుట, ఎడతెకతిరుగుట, ఎల్లప్పుడును శయ్యపై బరుండుట, ఇవియన్నియు వాతవ్యాధు లన్నింటియందును

నిషిద్ధములు. మఱియు నాధ్మానవాతంబును అర్దితవాతంబును కలవారు స్నానముచేయుట, చెడిననీళ్ళుద్రాగుట, దన్తధావనము జేయుట, ఇవియన్నియు మిక్కిలి కష్టములగల్గించును గావున వీనినన్నిటిని విడువవలెను.

— వాతరక్తరోగమునందు పథ్యములు. —

శ్లో॥ ఉత్తానేఽభ్యఞ్జనం సేకః సోపనాహః ప్రలేపనమ్।
గమ్భీరే స్నేహపానఞ్చ స్థాపనం చ విరేచనమ్ ॥ ౨౩౮॥
ద్వయోరప్రస్రుతిస్సూచీజలౌకాశృఙ్గ్యలాబుభిః।
శతధౌతఘృతాభ్యఙ్గః మేషీదుగ్ధావసేచనమ్ ॥ ౨౩౯॥
యవషష్టికనీవారకలమారుణశాలయః ।
గోధూమాశ్చణకా ముద్గాస్తువర్యోఽపి మకుష్ఠకాః॥
అజానాం మహిషీణాఞ్చ గవామపి పయాంసి చ।
లావతిత్తిరపర్వద్విట్ తామ్రచూడాదివిష్కిరాః ॥ ౨౪౧॥
ప్రతుదాశ్శుకదాత్యూహకపోతచటకాదయః।
ఉపోదికా కాకమాచీ వేత్రాగ్రం సునిషణ్ణకమ్ ॥ ౨౪౨॥
వాస్తుకం కారవేల్లం చ మృద్వీకా శ్వేతశర్కరా।
నవనీతం సోమవల్లీ కస్తూరీ సితచన్దనమ్ ॥ ౨౪౩॥
శింశపాగరుదేవాహ్వసరళస్నేహమర్దనమ్।
తిక్తం చ పథ్యముద్దిష్టం వాతరక్తగదే నృణామ్ ॥ ౨౪౪॥

తా॥ (వాతరక్తవ్యాధి ఉత్తానమనియు గంభీరమనియు రెండువిధములు, అందు చర్మమాంసముల నాశ్రయించి జనించినది యుత్తానమనియు, అస్థిమజ్జల నాశ్రయించి జనించినది గంభీరమనియు జెప్పంబడును) ఆరెంటిలో నుత్తానమను వాతరక్తవ్యాధియందు అభ్యంజనము, నీళ్లచే తడుపుట, కట్టుకట్టుట, పట్టువేయుట, ఇవి పథ్యములైయుండును. గంభీరమను వాతరక్తవ్యాధియందు తైలపానము, ఆస్థాపన వస్తికర్మ, విరేచనము, ఇవి పథ్యములైయుండును.

మఱియు నూదులు, జలగలు, చిమ్మనగ్రోవులు, సొరకాయబుఱ్ఱలు మున్నగువానిచే రక్తమును వెడలించుట, శతధౌతఘృతముచే నభ్యంజనము జేయుట, గొఱ్ఱెలపాలచే దడుపుట, యవలు, అరువదినాళ్ల సంబావుల బియ్యము, నీవారములు (అడవిలో జనించు తృణధాన్యములు), గాజనములు, ఎఱ్ఱవరివడ్లు, గోధుమలు, సెనగలు, కందులు, అడవిపెసలు, మేకలయొక్కయు ఆవుల యొక్కయు పాలు, లావుకపిట్ట, తీతువుపిట్ట, నెమలి, కోడి, మున్నగు విష్కిరము (గోళ్ళచేత భూమినిగీచి భూమింగల వస్తువులను దినునవి) లను పక్షుల యొక్కయు, చిలుకలు, భరతపిట్టలు, పావురములు, పిచ్చుకలు మున్నగు ప్రతుదము (ముక్కుతో మాంసాదుల బొడిచితినునవి) లను పక్షులయొక్కయు మాంసములు, బచ్చలికూర, కాచికూర, పేముచిగురు, పులిచింతాకుకూర, చక్రవర్తికూర, కాకరకాయలు, ద్రాక్షపండ్లు, తెల్లచక్కెర, వెన్న, తిప్పతీగె, కస్తూరి, తెల్లనిచందనము, ఇరుగుడుకాయలు, అగరు, దేవదారుకూర, నూనెబూసి మర్దనము జేయుట, చేదుగల పదార్థములు, ఇవియన్నియును పైజెప్పినరీతిగ రెండువిధములైన వాతరక్తవ్యాధి సామాన్యముగ పథ్యములై యుండును.

—॥ వాతరక్తరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ దివాస్వప్నాగ్నిసన్తాపవ్యాయామాతపమైథునమ్ ।
మాషాః కులుత్థా నిష్పావాః కలాయాః క్షారసేవనమ్ ॥
అమ్బుజానూపమాంసాని విరుద్ధాని దధీని చ ॥
ఇక్షవో మూలకం మద్యం పిణ్యాకోఽమ్లాని కాఞ్జికమ్ ॥
కట్వూష్ణం గుర్వభిష్యన్ది లవణాని చ సక్తవః ।
ఇత్యపథ్యం నిగదితం వాతరక్తగదే నృణామ్ ॥ ౨౪౭ ॥

తా॥ పగటియందునిదురించుట, నిప్పుసెగనుండుట, దేహపరిశ్రమజేయుట, ఎండలో సంచరించుట, స్త్రీసంభోగము జేయుట, మినుములు, ఉలవలు, అనుములు, బటాణులు, క్షారములు, నీటియందును జలప్రాన్తమునందును

జనించిన జంతువులమాంసములు, పరస్పర విరుద్ధములగు క్షీరమత్స్యాదులతోఁ జేరిన పదార్థములు, పెరుగు, చెఱకురసము, ముల్లంగి, మద్యము, గానుగపిండి, పులుపుగల నానావిధ పదార్థములు, కాంజికము, కటురసముకల్గిన పదార్థములు, ఉష్ణపదార్థములు, అజీర్ణకరంబులును స్రోతోరంధ్రముల స్రవింపజేయునవియునగు పదార్థములు, లవణములు, సత్తుపిండి, ఇవియన్నియు, వాతరక్తవ్యాధికలవారికి అపథ్యములు.

—॥ ఊరుస్తమ్భవాతరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ రూక్షస్సర్వవిధిస్స్వేదః కోద్రవా రక్తశాలయః।
యవాః కులుత్థా శ్శ్యామాకా ఉద్దాలాశ్చ పురాతనాః॥
శోభాఞ్జనం కారవేల్లం పటోలం లశునాని చ।
సునిషణ్ణః కాకమాచీ వేత్రాగ్రం నిమ్బపల్లవమ్ ॥ ౨౮౯ ॥
పత్తూరో వాస్తుకం పథ్యా వార్తాకం తప్తవారి చ।
శంపాకశాకం పిణ్యాకస్తక్రారిష్టమధూని చ॥ ౨౯౦॥
కటుతిక్తకషాయాణి క్షారసేవా గవాం జలమ్ ।
వ్యాయామశ్చ యథాశక్తి స్థూలస్యాక్రమణాని చ ॥
స్వచ్ఛే హ్రాదే సన్తరణం ప్రతిస్రోతో నదీషు చ।
శ్లేష్మాపహరణం యచ్చ నచ మారుతకోపనమ్॥ ౨౯౨॥
ఏతత్పథ్యం నరైస్సేవ్య మూరుస్తమ్భవికారిభిః।

తా॥ నానావిధములగు రూక్షణక్రియలు, చెమటబుట్టించుట, ప్రాతవియగు ఆరుకలు, ఎఱ్ఱవరివడ్లు, యవలు, ఉలవలు, చామలు, అడవియారుకలు, మునగకాయలు, కాకరకాయలు, పొట్లకాయలు, ఉల్లిగడ్డలు, నీరుచెంచలికూర, కాచికూర, పేముచిగురు, వేపచిగురు, పొన్నగంటికూర, చక్రవర్తికూర, కరకకాయలు, వంకాయలు, వేడినీళ్ళు, రేలాకుకూర, గానుగపిండి, మజ్జిగ, అరిష్టములు, తేనె, కటు (కారము) తిక్త (చేదు) కషాయ (వగరు) రసములుకల పదార్థములు, క్షారములు, గోమూత్రము, తనశక్తికి దగినట్టులు

దేహపరిశ్రమ జేయుట, శరీరస్థౌల్యమును బోగొట్టువస్తువులు, స్వచ్ఛమైనజలము కల మడుగులలో నీదుట, నదులయందు ప్రవాహమున కెదురుగ నీదుట, ఇవి యన్నియు నూరుస్తంభమను వాతవ్యాధియందు పథ్యములు. మఱియు వాతమును బ్రకోపింపజేయక కఫమును మాత్రము హరించు పదార్థముల సేవించుటయును పథ్యమైయుండును.

—॥ ఊరుస్తంభవ్యాధియం దపథ్యములు. ॥—

శ్లో॥ గురుశీతద్రవస్నిగ్ధవిరుద్ధాసాత్మ్యభోజనమ్ ॥౨౫౩॥
విరేచనం స్నేహనం చ వమనం రక్తమోక్షణమ్।
వస్తిం చ న హితం ప్రాహుః ఊరుస్తమ్భవికారిణామ్॥

తా॥ అజీర్ణకరంబులును శీతలంబులును ద్రవంబులును స్నిగ్ధంబులునగు పదార్థములను సేవించుట, పరస్పర విరుద్ధములగు పదార్థముల సేవించుట, తనశరీరమునకు అభ్యాసములేక ఇమడని యాహారముల భుజించుట, విరేచనము, స్నేహనకర్మ, వమనము, వస్తి ఈకర్మల జేసికొనుట, ఇవియన్నియు ఊరుస్తంభ వ్యాధియందు అపథ్యములుగాన సేవింపందగవు,

—॥ ఆమవాతరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ రూక్షస్స్వేదోలఙ్ఘనం స్నేహపానం
వస్తిర్లేపో రేచనం పాయువస్తిః।
అబ్దోత్పన్నాశ్శాలయో యే కులుత్థాః
జీర్ణం మద్యం జాఙ్గలానాం రసాశ్చ॥౨౫౫॥
వాతశ్లేష్మఘ్నాని సర్వాణి తక్రం
వర్షాభూశ్చైరణ్డతైలం రసోనమ్।
పటోలపత్త్రారకకారవేల్లమ్
వార్తాకశిగ్రూణి చ తప్తనీరమ్॥౨౫౬॥

మన్దారగోకణ్టకవృద్ధదారు
భల్లాతకం గోజలమార్ద్రికఞ్చ।
కటూని తిక్తాని చ దీపనాని
స్యూరామవాతామయినే హితాని॥ ౨౧౭॥

తా॥ రూక్ష స్వేద కర్మ, లంకణము, స్నేహపానము, వస్తికర్మ, పట్టువేయుట, విరేచనకర్మ, గుదద్వారమున వత్తివేయుట, సంవత్సరకాలమునకు మున్ను ఫలించిన రాజనముల బియ్యము, ఉలవలు, ప్రాతదియగు మద్యము, జాంగల జంతువుల మాంసరసములు, వాతకఫములను హరించు నానావిధపదార్థములు, మజ్జిగ, గలిజేరు, ఆముదము, ఉల్లిగడ్డలు, పొట్లికాయలు, పొన్నగంటికూర, కాకరకాయలు, వంకాయలు, మునగకాయలు, వేడినీళ్ళు, జిల్లేడు, పల్లేరు, దేవదారుకూర, జీడిగింజలు, గోమూత్రము, అల్లము, కటు (కారము) తిక్త (చేదు) రసములుకల పదార్థములు, జఠరాగ్నిని దీపింపజేయు సకలపదార్థములు, ఇవియన్నియు ఆమవాతరోగములు కలవారికి పథ్యములై యుండును.

—॥ ఆమవాతరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ దధిమత్స్యగుడక్షీరోపోదికా మాషపిష్టకమ్।
దుష్టనీరం పూర్వవాతో విరుద్ధాన్యశనాని చ॥ ౨౧౮॥
అసాత్మ్యం వేగరోధం చ జాగరం విషమాశనమ్।
వర్జయేదామవాతార్తో గుర్వభిష్యన్దకాని చ॥ ౨౧౯॥

తా॥ పెరుగు, మత్స్యములు, బెల్లము, పాలు, బచ్చలికూర, మినపపిండిచేజేయబడిన భక్ష్యాదులు, చీమలున్న గువానిచే జెడిననీళ్ళు, తూర్పునుండి వీచునట్టిగాలి, పరస్పరవిరుద్ధములగు నన్నాదుల భుజించుట, అసాత్మ్యములగు పదార్థములభుజించుట, మలమూత్రాది వేగములనిరోధించుట, రాత్రులయందు నిదురమేల్కొనియుండుట, తానుభుజించు పరిమాణమునకు న్యూనాధి

కములుగ భుజించుట, అజీర్ణకరంబులును స్రోతస్సుల స్రవింపజేయునవియు నగు పదార్థములు, ఇవియన్నియు ఆమవాతరోగమునం దపథ్యములు.

—॥ శూలవ్యాధియందు పథ్యములు. ॥—

శ్లో॥ ఛర్దిస్స్వేదో లఙ్ఘనం పాయువర్తి
ర్వస్తిర్నిద్రా రేచనం పాచనశ్చ।
అబ్దోత్పన్నా శ్శాలయో వాట్యమణ్డః
తప్తక్షీరం జాఙ్గలానాం రసాశ్చ ॥ ౨౬౦॥
పటోలశోభాఞ్జనకారవేల్ల
వార్తాకమాఙ్రాణి పచేళిమాని।
ద్రాక్షా కపిత్థం రుచకం ప్రియాలం
శాలిశ్చ పత్రాణి చ వాస్తుకాని ॥ ౨౬౧॥
సాముద్రసౌవర్చలహిఙ్గువిశ్వం
విడం శతాహ్వా లశునం లవఙ్గమ్।
ఏరణ్డతైలం సురభీజలఞ్చ
తప్తామ్బు జమ్బీరరసోపి కుష్ఠమ్ ॥ ౨౬౨॥
లఘూని చ క్షారరజాంసి చేతి
వర్గోహితః శూలగదార్దితేభ్యః॥

తా॥ వమనము, స్వేదనము, లంకణము, పాయువర్తి (గుదద్వారమున మంగకాయలు మొదలగువానిచే జేయబడిన వత్తి నెక్కించుట), వస్తికర్మ, పవలు నిదురించుట, విరేచనము, ఆహారమును జీర్ణింపజేయు పదార్థములు, సంవత్సరకాలమునకు మున్ను పండిన రాజనములు, వాట్యమణ్డము (యవలను వేయించి పదునాల్గింతనీళ్ళుబోసి పక్వముజేయబడిన గంజి), కాగినపాలు, అరణ్య మృగాది జంతువుల మాంసరసములు, పొట్లకాయలు, మునగకాయలు, కాకరకాయలు, వంకాయలు, మామిడిపండ్లు, ద్రాక్షపండ్లు, వెలగపండ్లు,

ఇందుప్పు, చారపప్పు, శాలిశాకను, ఆకుగూరలు, చక్రవర్తికూర, సముద్ర లవణము, సౌవర్చలలవణము, ఇంగువ, శుంఠి, వాయువిడంగములు, పిల్లపీచర గడ్డలు, ఉల్లిగడ్డలు, లవంగములు, ఆముదము, గోమూత్రము, వేడినీళ్ళు, నిమ్మ కాయరసము, చెంగల్వకోష్టు, శీఘ్రముగ జీర్ణంబులగు పదార్థములు, క్షార ములు, ఇవి యన్నియు శూలరోగముకలవారికి పథ్యములైయుండును.

—శూలరోగమునం దపథ్యములు.—

శ్లో॥ విరుద్ధాన్న్యన్నపానాని జాగరం విషమాశనమ్।
రూక్షతిక్తకషాయాణి శీతలాని గురూణి చ ॥౨౬౩॥
వ్యాయామం మైథునం మద్యం ద్విదలం లవణస్తిలాః॥
వేగరోధం శుచం క్రోధం వర్జయేచ్ఛూలవాన్నరః ॥౨౬౪॥

తా॥ పరస్పర విరుద్ధములగు నన్నపానములు, రాత్రులయందు నిదుర మేల్కొంచియుండుట, న్యూనాధికముగ భుజించుట, రూక్షపదార్థములను, తిక్తకషాయరసములుకల పదార్థములను, శీతలపదార్థములను, అజీర్ణకరపదార్థ ములను భుజించుట; దేహపరిశ్రమ జేయుట, సంభోగము జేయుట, మద్యపా నము జేయుట, కందులు సెనగలు మున్నగు పప్పులు, ఉప్పు, నువ్వులు, మల మూత్రాదివేగముల నిరోధించుట, దుఃఖపడుట, కోపపడుట, ఇవి యన్నియు శూలరోగమునం దపథ్యములు కావున విడువందగును.

—ఉదావర్త రోగమునందు పథ్యములు.—

శ్లో॥ స్నేహస్వేదవిరేకాశ్చ వస్తయః ఫలవర్తయః।
అభ్యఙ్గశ్చ యవాస్సర్వాం స్పృష్టవిణ్మూత్రమారుతమ్॥౨౬౫॥
గ్రామ్యోదకానూపరసాః రుబుతైలం చ వారుణీ।
బాలమూలకశమ్యాకత్రివృత్తిలసుధాదళమ్ ॥ ౨౬౬ ॥
శృఙ్గబేరం మాతులుఙ్గం యవక్షారో హరీతకీ।
లవఙ్గం రామఠం ద్రాక్షా గోమూత్రం లవణాని చ॥ ౨౬౭॥

తా॥ స్నేహపానము, స్వేదనకర్మ, విరేచనము, వస్తికర్మ, ఫలవర్తి, అభ్యంగము, యవలు, మలమూత్రవాతముల వెలుపలవెడలింపజేయు సకలపదార్థములు, గ్రామములయందును ఉదకమునందును ఉదకసమీపమునందును జనించిన జంతువుల మాంసరసములు, ఆముదము, మద్యము, లేతముల్లంగి, రేల, తెగడ, నువ్వులు, జెముడాకు, అల్లము, మాదీఫలములు, యవక్షారము, కరకకాయలు, లవంగములు, ఇంగువ, ద్రాక్షపండ్లు, గోమూత్రము, లవణములు, ఇవియన్నియు నుదావర్తసామాన్యముగ పథ్యములైయుండును.

❦ వాతపురీషాదుల నిరోధించుటచే గల్గిన ఉదావర్తములయందు పథ్యములు. ❦

శ్లో॥ అధోవాతసముత్థే తు స్నేహస్వేదాశ్చ వర్తయః।
వస్తయోఽన్నాని పానాని సమీరణహరాణి చ ॥౧౬౮॥
పురీషజే తథా వస్తిః స్వేదోఽభ్యఙ్గోఽవగాహనమ్।
ఫలవర్తిశ్చ పానాని విడ్భేదీన్యశనాని చ ॥౧౬౯॥
మూత్రవేగసముత్పన్నే త్రివిధం వస్తికర్మ చ।
స్వేదోఽభ్యఙ్గోఽవగాహశ్చ సర్పిషశ్చావపీడనమ్॥౧౭౦॥
ఉద్గారోత్థే తు హిక్కాఘ్నః కాసజే కాసజిద్విధిః।
క్షవజే స్వేదనం ధూమో ఘృతం చోత్తరవస్తికమ్॥
క్షవప్రవర్తనం నస్యమభ్యఙ్గశ్చోర్ధ్వజత్రుకః।
శీతాన్నపానం తృష్ణోత్థే జృమ్భోత్థే వాతజిత్క్రియా॥
నిద్రావేగోత్థితే క్షీరం స్వప్నసంవాహనాని చ॥
బుభుక్షోత్థే స్నిగ్ధమల్పముష్ణఞ్చ లఘుభోజనమ్॥౧౭౩॥
బాష్పజే బాష్పమోక్షస్స్వప్నో మద్యం ప్రియాః కథాః।
శ్రమశ్వాససముత్పన్నే విశ్రామో వాతహారి చ ॥౧౭౪॥
శుక్రోత్థే వస్తిరభ్యఙ్గోఽవగాహశ్చరణాయుధః।
శాలయో మదిరా క్షీరం ప్రియా యావనగర్వితాః॥

ఛర్ద్యర్థే లఙ్ఘనం ధూమో భుక్త్వా ప్రచ్ఛర్దనం శ్రమః।
రూక్షాణి చాన్నపానాని విరేకో రక్తమోక్షణమ్॥
ఇతి పథ్యముదావర్తే నృణాముక్తం మహర్షిభిః।

తా॥ అపానవాతమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు స్నేహపానము, స్వేదనము, వర్తులు, వస్తికర్మలు, వాతహరములగు నానావిధాన్నపానములు, ఇవియన్నియు పథ్యములైయుండును.

పురీషమును నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు వస్తికర్మ, స్వేదనము, అభ్యంగస్నానము, నీటమునిగి స్నానముజేయుట, ఫలవర్తి, మలమును భేదించు నన్నపానంబులు, ఇవియన్నియు పథ్యములు.

మూత్రవేగమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు అనువాసన నిరూహణ ఉత్తరవస్తులను మూడువిధములగు వస్తికర్మల జేయుట, స్వేదము, అభ్యంగము, అవగాహస్నానము, అవపీడనము (అనగా భోజనమునకు ముందును ముందుదినము భుజించిన యాహారము జీర్ణించిన పిమ్మటను జేయబడు ఘృతపానము) ఇవి పథ్యములు. త్రేపులను నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు హిక్కారోగమును శమింపజేయునవి యన్నియు పథ్యములైయుండును, కాసమును (దగ్గును) నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు, కాసమును హరించునవి యన్నియు పథ్యములైయుండును. తుమ్ములను నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు స్వేదనము, ధూమపానము, నెయ్యి, ఉత్తర వస్తికర్మ, తుమ్ముల వెడలింపజేయు నస్యములు, కంఠమునకు పైభాగమున అభ్యంగము జేయుట, ఇవి పథ్యములైయుండును. దప్పిని నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు శీతంబులగు నన్నపానముల సేవించుట పథ్యములు. ఆవలింతలను నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు వాతహరంబులగు నన్నపానౌషధములు పథ్యములు, నిద్రావేగమును నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు పాలు, నిదురించుట, ఒడల బిసికించుకొనుట, ఇవి పథ్యములైయుండును. ఆకలిని నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు స్నిగ్ధంబులును,అల్లం

ములును, ఉష్ణంబులును, శీఘ్రముగ జీర్ణంబులగునవియునైన యన్నాదుల భుజించుట పథ్యము. కన్నీళ్ళను నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు కన్నీళ్ళను విడచుట, నిదురించుట, మద్యము, తనకింపైన కథలవినుట, ఇవియన్నియు పథ్యములైయుండును. శ్రమవలనగల్గినశ్వాసమును నిరోధించుటచే పుట్టిన ఉదావర్తమునందు ఉపచారములచే శ్రమమును బోగొట్టుటయు, వాతహరౌషధాదులును పథ్యములైయుండును. శుక్రమును బైటవెడలనీయక నిరోధించుటచే గల్గిన ఉదావర్తమునందు ఉత్తర వస్తికర్మ, అభ్యంగనము, స్నానము, కోడిమాంసము, రాజనములు, మద్యము, పాలు, పరిపూర్ణమైన యౌవనముగల ప్రియురాండ్రగూడుట ఇవి పథ్యములు. వాంతిని నిరోధించుటచేగల్గిన ఉదావర్తమునందు లంకణము, ధూమపానము, భుజించినయాహార పదార్థమును వాంతిజేయుట, దేహపరిశ్రమజేయుట, రూక్షంబులగు నన్నపానముల సేవించుట, విరేచనము, రక్తమోచనము ఇవి పథ్యములైయుండును. ఇత్తెరంగున నుదావర్త రోగములయందు పథ్యక్రమము వైద్యవరులచే నుడువంబడియె.

—ఉదావర్త రోగమునందు అపథ్యములు.—

శ్లో॥ వమనం వేగరోధం చ శమీధాన్యాని కోద్రవాః ॥
నాలీశాకం చ శాలూకం జామ్బవం కర్కటీఫలమ్।
పిణ్యాకమాలుకం సర్వం కరీరం పిష్టవైకృతమ్॥ ౭౮॥
విష్టమ్భీని విరుద్ధాని కషాయాణి గురూణి చ।
ఉదావర్తే ప్రయత్నేన వర్జయేత్సతతం నరః ॥ ౭౯ ॥

తా॥ వమనము, మలమూత్రవాతాది వేగముల నిరోధించుట, శమీధాన్యములు (మినుములు పెసలు మున్నగు కాయధాన్యములు), ఆరుకలు, నాలీశాకము (హింగుపత్రి), తామరదుంపలు, నేరేడుపండ్లు, నక్కదోసకాయలు, గానుగపిండి, నానావిధములైన ఆలుక అనుకందములు, [ ఇచ్చట ఆలుకమనునది కాష్ఠాలు (వాడగనుసు), శంఖాలు (గనుసుగడ్డలు), హస్త్యాలు,

శక్తాలు (ఎఱ్ఱగనుసు), పిండాలు (పెండలము), మధ్వాలు, అని భేదములుకల దుంపదినుసులని యెఱుంగునది] వెదురుమోవులు, పిండిచే జేయబడిన భక్ష్యాదులు, మలమును బంధించు పదార్థములు, పరస్పర విరుద్ధములగు పదార్థములు, కషాయ రసముకల పదార్థములు, అజీర్ణకరపదార్థములు, వీనినన్నిటిని ఉదావర్తరోగముకల మనుజుండు మిగుల ప్రయత్నముచే విడువవలెను.

—॥ ఆనాహరోగమునందు పథ్యాపథ్యములు. ॥—

శ్లో॥ ఉదావర్తిహితం సర్వం పాచనం లఙ్ఘనం తథా ।
ఆనాహే తు యథాయోగ్యం యోజయేన్మతిమాన్నరః॥
అపథ్యాని ప్రదిష్టాని యాన్యుదావర్తినాం పురా।
ఆనాహార్తః పరిహరేత్ తాని సర్వాణి యత్నతః॥ ౭౯౧॥

తా॥ ఉదావర్త వ్యాధియందు హితములైనవి యన్నియును, భుజించబడిన పదార్థముల జీర్ణింపజేయు పదార్థంబులును, లంకణంబును, ఆనాహరోగమునందును ఆయాదోషముల ననుసరించి పథ్యములైయుండును; గాన సేవింపందగును. మఱియు ఉదావర్తవ్యాధియందు జెప్పబడిన అపథ్యములన్నియు ఆనాహవ్యాధియందును అపథ్యములైయుండును; కావున వానినన్నిటిని ఆనాహవ్యాధికల మనుజుండు మిక్కిలి ప్రయత్నముచే విసర్జించవలెను.

—॥ గుల్మరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ స్నేహస్స్వేదో విరేకశ్చ వస్తిర్బాహుసిరావ్యధః ।
లఙ్ఘనం వర్తిరభ్యఙ్గః స్నేహాః పక్వే తు పాటనమ్॥
సంవత్సరసముత్పన్నాః కలమా రక్తశాలయః।
ఖణ్డాః కులుత్థయూషశ్చ ధన్వమాంసరసస్సురా ॥ ౭౯౩॥
గవామజాయాశ్చపయో మృద్వీకా చ పరూషకమ్ ।
ఖర్జూరం దాడిమం ధాత్రీ నాగరఞ్చామ్లవేతసమ్ ॥ ౭౯౪॥
తక్రమేరణ్డతైలఞ్చ లశునం బాలమూలకమ్ ।

పుష్కరాగో వాస్తుకం శిగ్రు యవక్షారో హరీతకీ ॥౨౨౫॥
రామఠం మాతులుఙ్గం చ త్ర్యూషణం సురభీజలమ్।
యదన్నం స్నిగ్ధముష్ణం చ బృంహణం లఘుదీపనమ్॥౨౨౬॥
వాతానులోమనం చైవ పథ్యం గుల్మే నృణాం భవేత్।

తా॥ స్నేహన స్వేదన విరేచన వస్తికర్మలజేయుట, బాహువుల యందు సిరావ్యధనము జేయుట, లంకణము, వర్తి, తైలములచే నభ్యంగనము జేసికొనుట, గుల్మము రక్తమాంసాదుల నాశ్రయించి పరిపక్వమైనచో శస్త్రకర్మ జేయుట, ఇవి యన్నియు గుల్మరోగమునందు పథ్యములు.

సంవత్సరకాలమునకుమున్న పండిన రాజనములు, ఎఱ్ఱవరివడ్లు, ఖండశర్కర, ఉలవకట్టు, అరణ్యముననుండు జంతువుల మాంసరసము, మద్యము, ఆవుపాలు, మేకపాలు, ద్రాక్షపండ్లు, చిట్రీతపండ్లు, ఖర్జూరపుపండ్లు, దానిమ్మపండ్లు, ఉసిరికపండ్లు, నారింజపండ్లు, పుల్లబ్బలి, మజ్జిగ, ఆముదము, ఉల్లిగడ్డలు, లేతముల్లంగి, పొన్నగంటికూర, చక్రవర్తికూర, మునగకాయలు, యవక్షారము, కరకకాయలు, ఇంగువ, మాదీఫలములు, త్రికటుకములు (శుంఠి పిప్పళ్లు మిరియాలు), గోమూత్రము, స్నిగ్ధంబును ఉష్ణంబును శరీరమును పుష్టినొందించునదియునైన యన్నము, అగ్నిని దీపింపజేసి చులకనగా జీర్ణమగు నన్నము, వాతమును అనులోమముగ సంచరింపజేయు పదార్థములు, ఇవియన్నియు గుల్మవ్యాధియందు పథ్యములైయుండును.

—॥ గుల్మరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ మాషాదయశ్శమీధాన్యం శూకధాన్యం యవాదయః॥
వాతకారీణి సర్వాణి విరుద్ధాన్యశనాని చ।
వల్లూరం మూలకం మత్స్యం మధురాణి ఫలాని చ॥
శుష్కశాకం శమీధాన్యం విష్టమ్భీని గురూణి చ।
అధోవాయు శకృన్మూత్ర వేగమశ్రువిధారణమ్॥ ౨౨౭ ॥
వమనం లఙ్ఘనం పానం గుల్మరోగే వివర్జయేత్।

తా॥ మినుములు మున్నగు శమీధాన్యములు, యవలు మున్నగు శూక ధాన్యములు (కొసలయందు ముండ్లుకల్గిన ధాన్యములు), వాతమును వృద్ధిసెందించు సకల పదార్థములు, పరస్పరవిరుద్ధములగు నాహారపదార్థములు, ఎండిన మాంసము, ముల్లంగి, మత్స్యములు, మధురములగు పండ్లు, ఎండిన వంగవతుగు మున్నగుకూరలు, మలమునుబంధించునవియు అజీర్ణకరంబులునైన సెనగలు మున్నగు కాయ ధాన్యములు, అపానవాతము పురీషము మూత్రము కన్నీళ్లు వీనిని బైటవెడలనీయక వానివేగమును నిరోధించుట, వమనము, లంకణము, అధికముగ జలమును పానముజేయుట, ఇవి యన్నియు గుల్మరోగమునందు అపథ్యములు.

—॥ హృద్రోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ స్నేహో విరేకో వమనం చ లఙ్ఘనం
వస్తిర్విలేపీ చిరరక్తశాలయః।
మృగద్విజా జాఙ్గలసంజ్ఞయాన్వితాః
యూషా రసా ముద్గకులుత్థసమ్భవాః ॥౭౯౦॥
రాగాః ఖడాః తామ్బులికాశ్చ ఖాణ్డవాః
భవ్యం పటోలం కదళీఫలాన్యపి।
పురాణకూశ్మాణ్డరసాలదాడిమం
శమ్పాకశాకం నవమూలకాన్యపి॥ ౭౯౧॥
ఏరణ్డతైలం గగనామ్బు సైన్ధవం
ద్రాక్షా చ తక్రం చ పురాతనో గుడః।
శుణ్ఠీ యవానీ లశునం హరీతకీ
కుష్ఠశ్చ కుస్తుమ్బురు కృష్ణమార్ద్రికమ్ ॥౭౯౨॥
సౌవీరశుక్తం మధు వారుణీరసః
కస్తూరికా చన్దనకం ప్రపానకమ్।

తామ్బూలమప్యేష గణస్సుఖాయ భవేత్
మర్త్యస్య హృద్రోగనిపీడితాత్మనః ॥ ౨౯౩॥

తా॥ స్నేహము, విరేచనము, వమనము, లంకణము, వస్తికర్మ అను నీకర్మలజేయుట, విలేపి (మెతుకు లధికముగ నుండునట్లులు కాచబడినగంజి), ప్రాతవియగు ఎఱ్ఱవరివడ్ల బియ్యము, అరణ్య ప్రదేశముననుండు మృగముల యొక్కయు పక్షులయొక్కయు మాంసములు, పెసలను ఉలవలను జేర్చి కాచబడినకట్టులు, రాగములు (చక్కెర, సౌవర్చలలవణము, సైంధవలవణము, చింతపండు, చిట్టీతపండు, నేరేడుపండ్లరసము, వీనినన్నిటిని జేర్చి కాచి ఆవాల తిరుగబోత బెట్టబడిన గంజి), ఖడయూషము (మజ్జిగ, వెలగపండ్లు, పులిచింతాకు, మిరియాలు, జీలకఱ్ఱ, చిత్రమూలము, ఈద్రవ్యముల జేర్చి కాచబడిన కట్టు), కాంబలికములు (పెరుగు, చింతపండు, ఉప్పు, నెయ్యి, నువ్వులు, మినపపప్పు, వీనినన్నిటిని జేర్చి కాచబడినకట్టు), ఖాండవము (మామిడికాయలను రెండుమూడు తునియలుగ ఖండించి పైచెక్కుదీసి నేతిలో కొంచెము పులుపు ఉండునట్టులు వేయించి చక్కెరపాకములో పక్వముజేసి దించి అందు మిరియాలు, ఏలకులు, పచ్చకప్పురము, వీనిని జేర్చి నేతితోమాగిన కుండలో నుంచబడిన ఊరుగాయ), గజపిప్పలి, పొట్లకాయలు, అరటిపండ్లు, గుమ్మడిపండు, తియ్యమామిడిపండ్లు, దానిమ్మపండ్లు, రేలాకుకూర, లేతముల్లంగి, ఆముదము, వర్షధారాజలము, సైంధవలవణము, ద్రాక్షపండ్లు, మజ్జిగ, పాతబెల్లము, శుంఠి, ఓమము, ఉల్లిగడ్డలు, కరకకాయలు, చెంగల్వకోష్టు, దనియాలు, పిప్పళ్ళు, అల్లము, సౌవీరకమను కాంజికము, తేనె, మద్యము, కస్తూరి, చందనము, పానకము, తాంబూలము, ఇవియన్నియు హృద్రోగమునందు పథ్యములు.

—॥ హృద్రోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ తృట్ఛర్దిమూత్రానిలశుక్రకాసో
ద్గారక్షమశ్వాసవిడశ్రువేగాః।

సహ్యాద్రివిన్ధ్యాద్రినదీజలాని
మేషీపయో దుష్టజలం కషాయమ్ ॥౨-౪॥
విరుద్ధముష్ణం గురు తిక్తమమ్లం
పురాతనం వాపి చ పత్రశాకమ్।
క్షారం మధూకాని చ దన్తకాష్ఠం
రక్తస్రుతిం హృద్గదవాన్ త్యజేత్తు॥ ౨-౫॥

తా॥ దప్పి, వాంతి, మూత్రము, వాతము, శుక్రము, దగ్గ, త్రేనుపులు, శ్రమవలనబుట్టినశ్వాసము, పురీషము, కన్నీళ్ళు, వీనిని వెడలనీయక నిరోధించుట; సహ్యపర్వతమునందును వింధ్యపర్వతమునందును బుట్టిన నదుల యందలి జలము, గొఱ్ఱెపాలు, చెడిననీళ్ళు, కషాయ రసముకల పదార్థములు, పరస్పరవిరుద్ధములగు పదార్థములు, ఉష్ణపదార్థములు, అజీర్ణకరపదార్థములు, తిక్త అమ్ల రసములుకల పదార్థములు, ముందుదినమున పక్వము జేయబడిన యన్నాదులు, నానావిధములైన ఆకుగూరలు, క్షారములు, ఇప్పపువ్వులు, ఈపదార్థముల సేవించుటయు, దన్తధావనము జేయుటయు, రక్తస్రావమును జేసికొనుటయు హృద్రోగమునందు అపథ్యములు గావున సేవింపందగవు.

## —॥ మూత్రకృచ్ఛ్రమునందు పథ్యము. ॥—

శ్లో॥ వాతోద్భవేఽభ్యఞ్జనిరూహవస్తిః
స్నేహావగాహోత్తరవస్తిసేకః।
పైత్తేఽవగాహశ్శిశిరప్రదేహో
గ్రీష్మో విధిర్వస్తివిధిర్విరేకః ॥౨-౬॥
శ్లేష్మోద్భవే స్నేహవిరేకవస్తిః
క్షారా యవాన్నాని చ తీక్ష్ణముష్ణమ్॥
త్రిదోషజేఽభ్యఞ్జపురస్సరాణి
పథ్యాన్యమూని త్రిమలోదితాని ॥౨-౭॥

మూత్రాఘాతవికారోత్థే వాతకృచ్ఛ్రక్రియా మతా।
లేహశ్శుక్రవిబన్ధోత్థే శిలాజతు సమాక్షికమ్ ॥౨౯౮॥
స్వేదచూర్ణక్రియాభ్యఙ్గవస్తయస్స్యుః పురీషజే।
అథో యథాదోషమయం గణోఽపి
పురాతనా లోహితశాలయశ్చ।
తక్రం పయో దధ్యపి గోప్రభూతం
ధన్వామిషం ముద్గరసస్సితా చ ॥౨౯౯॥
పురాణకూశ్మాణ్డఫలం పటోలం
మహార్ద్రకం గోక్షురకః కుమారీ।
గువాకఖర్జూరకనారికేళ
తాళద్రుమాణాఞ్చ శిరాంసి పథ్యా ॥300॥
తాలాస్థిమజ్జా త్రపుసం త్రుటిశ్చ
శీతాని పానాన్యశనాని చైవ।
ప్రతీరనీరం హిమవాలుకా చ
మిత్రం నృణాం స్యాత్సతిమూత్రకృచ్ఛ్రే ॥301॥

తా॥ వాతముచే జనించిన మూత్రకృచ్ఛ్రరోగమునందు అభ్యంగము, నిరూహవస్తి, స్నేహద్రవ్యములచే నిండిన తొట్టిలో నవగాహనము జేయుట, ఉత్తరవస్తి, కషాయాదులచే దడుపుట, ఇవియన్నియు పథ్యములైయుండును. పిత్తముచేగల్గిన మూత్రకృచ్ఛ్రమున అవగాహనము, చల్లని వస్తువులచే పట్టు వేయుట, గ్రీష్మఋతువునకు జెప్పబడిన ఋతుచర్యలు, వస్తికర్మ, విరేచనము, ఇవి యన్నియు పథ్యములు. కఫముచే జనించిన మూత్రకృచ్ఛ్రమునందు స్వేదము, విరేచనము, వస్తికర్మలు, క్షారములు, యవాన్నము, తీక్ష్ణంబులును ఉష్ణంబులునైన పదార్థములు, ఇవి యన్నియు పథ్యములు, త్రిదోషములచే

(సన్నిపాతముచే) జనించిన మూత్రకృచ్ఛ్రమునందు వాతాదులను వేర్వేరుగ జెప్పంబడిన అభ్యంగము మున్నగునవియన్నియు పథ్యములైయుండును.

మఱియు మూత్రమును నిరోధించుటవలన బుట్టిన మూత్రకృచ్ఛ్రమునందు వాతజ మూత్రకృచ్ఛ్రమున జెప్పిన అభ్యంగాదులు పథ్యములు. శుక్రమును వెడలనియ్యక నిరోధించుటచే బుట్టిన మూత్రకృచ్ఛ్రమునందు శిలాజతువును తేనెతోకలిపి లేహనము జేయుట పథ్యము. పురీషమును నిరోధించుటచే గల్గిన మూత్రకృచ్ఛ్రమునందు స్వేదమును వెడలించుట, చూర్ణములచే జేయు ప్రతిసారణక్రియ, అభ్యంగనము, వస్తికర్మ, ఇవియన్నియు పథ్యములు.

ప్రాతవియగు యెఱ్ఱవరివడ్లు, ఆవుమజ్జిగ, ఆవుపాలు, ఆవుపెరుగు, అడవిలోని జంతువులమాంసము, పెసలకట్టు, చక్కెర, ప్రాతగుమ్మడిపండు, పొట్లకాయలు, అల్లము, పల్లేరు, కలబంద, పోకచెట్టుయొక్కయు, ఖర్జూరపుచెట్టుయొక్కయు టెంకాయచెట్టుయొక్కయు తాటిచెట్టుయొక్కయు కొసలయందుండు లేతమోవులు, కరకకాయలు, తాటికాయ విత్తనములోనుండు గిజరు, ములుదోస, పిన్నయేలకులు, శీతలంబులైన యన్నపానములు, నదీజలము, పచ్చకప్పురము, ఇవియన్నియు మూత్రకృచ్ఛ్రవ్యాధియందు ఆయా దోషానుసారముగ బథ్యములైయుండునని యెఱుంగునది.

—॥ మూత్రకృచ్ఛ్రమునందపథ్యములు. ॥—

శ్లో॥ మద్యం శ్రమం నిధువనం గజవాజియానం
సర్వం విరుద్ధమశనం విషమాశనఞ్చ।
తామ్బూలమత్స్యలవణార్ద్రిక తైలభృష్టం.
పిణ్యాకహిఙ్గుతిలసర్షపమూత్రవేగాన్ ॥౩౦౨॥
మాషాన్క్షీరమపి తీక్ష్ణవిదాహిరూక్షం
మమ్లం ప్రముఞ్చతు జనస్సతి మూత్రకృచ్ఛ్రే।

తా॥ మద్యపానము, దేహపరిశ్రమమును జేయుట, స్త్రీసంభోగము, ఏనుగులు గుఱ్ఱములుమున్నగు వాహనములపైనెక్కి సవారిచేయుట, పరస్పర

విరుద్ధముఁగు క్షీరమత్స్యాదుల నొకటిగఁ జేర్చి భుజించుట, తానుభుజించుపరిమాణమునకు న్యూనాధికములుగ భుజించుట, తాంబూలచర్వణము, మత్స్యములు, లవణములు, అల్లము, నూనెలో పక్వముచేయబడిన పదార్థములు,గానుగపిండి, ఇంగువ,నువ్వులు, అవాలు, ఈపదార్థముల సేవించుట, మూత్రవేగమును నిరోధించుట, మినుములు, వెదురుమోవులు, మిక్కిలి తీక్ష్ణంబులును విదాహకరంబులును రూక్షంబులును అమ్లరసంబులునైన పదార్థముల సేవించుట, ఇవియన్నియు మూత్రకృచ్ఛ్రవ్యాధియం దపథ్యములుగాన విడువందగును.

—॥ మూత్రాఘాతమునందు పథ్యములు. ॥—

శ్లో॥ అభ్యఞ్జనం స్నేహవిరేకవస్తిః
స్వేదోఽవగాహోత్తరవస్తయశ్చ॥ ౩౦౩॥
పురాతనా లోహితశాలయశ్చ
మాంసాని ధన్వప్రభవాని మద్యమ్।
తక్రం పయో దధ్యపి మాషయూషః
పురాణకూశ్మాణ్డఫలం పటోలమ్॥ ౩౦౪॥
మహార్ద్రకం తాలఫలాస్థిమజ్జా
హారీతకీ కోమలనారికేళమ్।
గువాకఖర్జూరకనారికేళ
తాలద్రుమాణామపి మస్తకాని॥ ౩౦౫॥
యథామలం సర్వమిదం చ మూత్రా
ఘాతాతురాణాం హితమాదిశన్తి।

తా॥ అభ్యంజనము, స్నేహము, విరేచనము, వస్తికర్మ, స్వేదము, జలమునం దవగాహనముజేయుట, ఉత్తర వస్తికర్మ, ప్రాతవియగు ఎఱ్ఱవరివడ్లు, అరణ్యముననుండు జంతువుల మాంసములు, మద్యము, మజ్జిగ, పాలు, పెరుగు, మినపకట్టు, ప్రాతదియగు గుమ్మడిపండు, పొట్లకాయలు,

అల్లము, తాటివిత్తనమునసుండు గిజరు, కరకకాయలు, ఎళనీరుకాయలు, పోక చెట్టు, ఖర్జూరపుచెట్టు, టెంకాయచెట్టు, తాటిచెట్టు, అను నీచెట్లకొసల నుండు లేతమోవులు; ఇవియన్నియు మూత్రాఘాతరోగమునందు ఆయా దోషముల ననుసరించి పథ్యములైయుండును.

—॥ మూత్రాఘాతమునం దపథ్యములు. ॥—

శ్లో॥ విరుద్ధాన్నాని సర్వాణి వ్యాయామం మార్గశీలనమ్।
రూక్షం విదాహి విష్టమ్భి వ్యవాయం వేగధారణమ్॥
కరీరం వమనఞ్చాపి మూత్రాఘాతీ వివర్జయేత్।

తా॥ పరస్పర విరుద్ధములగు నన్నములు, దేహపరిశ్రమము, త్రోవనడచుట, రూక్షంబులును విదాహకరంబులును, మలమును బంధించునవియునగు పదార్థములు, సంభోగముజేయుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, వెదురుమోవులు, వమనకర్మ, ఇవియన్నియు మూత్రాఘాతముకలవారికి అపథ్యములుకావున సేవింపం దగవు.

—॥ అశ్మరీరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ వస్తిర్విరేకో వమనం చ లఙ్ఘనం
స్వేదోఽవగాహోఽపి చ వారిసేవనమ్।
యవాః కులుత్థాః ప్రపురాణశాలయో
మద్యాని ధన్వాణ్డజసమ్భవా రసాః॥౩౦౭॥
పురాణకూశ్మాణ్డఫలం కసేరుకం
గోకణ్టకో వారుణశాకమార్ద్రికమ్।
పాషాణభేదో యవశూకరేణవః
ఛిన్నా సమాకర్షణమశ్మనామపి॥౩౦౮॥
ఏతాని సర్వాణి భవన్తి సర్వదా
ముదేఽశ్మరీరోగనిపీడితాత్మనామ్।

తా॥ వస్తికర్మ, విరేచనము, వమనము, లంకణము, అవగాహస్వేద కర్మ(వాతహరములగు కషాయాదులచే నిండించిన తొట్టియందు కూర్చునిశరీరమున చెమట వెడలించుట), అధికముగ నీళ్ళుద్రాగుట, యవలు, ఉలవలు, మిక్కిలి ప్రాతవియగు రాజనములు, మద్యములు, మరుభూమిలో జనించిన పక్షులమాంసరసములు, ప్రాతగుమ్మడిపండు, నమ్మదుంపలు, పల్లేరు, వారుణ శాకము, అల్లము, పాషాణభేది, యవక్షారము, తిప్పతీగె, మూత్రద్వారమునందు రాతిని విడదీయుట, ఇవియన్నియు అశ్మరీరోగమునందు పథ్యములు.

—॥ అశ్మరీరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ మూత్రస్య శుక్రస్య చ వేగనుమ్లం
విష్టమ్భి రూక్షం గురు చాన్నపానమ్॥ ౩౦౯॥
విరుద్ధపానాశనమశ్మరీవాన్
వివర్జయేత్సన్తతమప్రమత్తః।

తా॥ మూత్రవేగమును శుక్రవేగమును నిరోధించుట, అమ్లరసయుకల పదార్థములు, మలమును బంధించు పదార్థములు, రూక్షపదార్థములు, అజీర్ణకరములగు నన్నపానములు, పరస్పరవిరుద్ధములగు నన్నపానములు, వీనినన్నిటిని అశ్మరీరోగ పీడితులు విడువవలెను.

—॥ ప్రమేహరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ప్రాగ్లఙ్ఘనాని వమనాని విరేచనాని
ప్రోద్వర్తనాని శమనాని చ దీపనాని॥ ౩౧౦॥
నీవారకఙ్గుయవవైణవకోరదూష
శ్యామాకజూర్ణకురువిన్దమకుష్ఠకాశ్చ।
గోధూమశాలికలమాశ్చిరజాః కులుత్థాః
ముద్గాఢకీచణకయూషరసాస్తిలాశ్చ॥ ౩౧౧॥
లాజాః పురాతనసురా మధు వాద్యమణ్డా

స్తక్రఞ్చ రాసభజలం మహిషీజలఞ్చ।
లట్వా కపోతశశతిత్తిరలావబర్హి
వ్యాఘ్రైణవర్తకశుకాదికజాఙ్గలాశ్చ ॥౩౧౨॥
శోభాఞ్జనం చ కులకం చ కటిల్లకం చ
కర్కోటకం తిలకమప్యథ బార్హతఞ్చ।
ఔదుమ్బరాణి లశునాని నవీనమోచం
పత్తూరగోక్షురకమూషకపర్ణిశాకమ్ ॥౩౧౩॥
మన్దారపత్రమమృతా త్రిఫలా కపిత్థం
జమ్బ్వాకసేరుకమలోత్పలకన్దబీజమ్।
ఖర్జూరలాఙ్గలికతాలతరూత్థమజ్జం
వ్యోషఞ్చ తిన్దుకఫలం ఖదిరం కలిఙ్గమ్ ॥౩౧౪॥
తిక్తాని చాపి సకలాని కషాయకాని
హస్త్యశ్వవాహనమతిభ్రమణం రవిత్విట్।
వ్యాయామ ఇత్యపి గణో భవతి ప్రకామం
మిత్రం ప్రమేహగదపీడితమానవానామ్ ॥౩౧౫॥

తా॥ ప్రమేహరోగముచే బీడింపబడిన వారికి తొలుతలంకణము, వమనము, విరేచనము, శ్లేష్మమేదోనాశకౌషధముల చూర్ణముచే నలుగు బెట్టుట, సంశమనము, అనునీక్రియలజేసి పిమ్మట అగ్నిని దీపింపజేసెడి యావధాదుల నుపయోగింపందగు.

మఱియు నీవారములు (ఒకరు పైరుచేయకయే తనంతట నరణ్యమున బండునట్టి ధాన్యములు), కొఱ్ఱలు, యవలు, వెదురుబియ్యము, ఆరుకలు, సామలు, జొన్నలు, కురువిందములు (కురుక్షేత్రముననుండుధాన్యవిశేషములు), అడవియూరుకలు, గోధుమలు, రాజనములు, ప్రాతవియగు ఉలవలు, పెసలు, కందులు, సెనగలు, వీనిచే జేయబడినకట్టులు, నువ్వులు, పేలాలు, ప్రాతది

యగు మద్యము, తేనె, వాద్యమండము (యవలను వేయించి అందు పదునాల్గింత నీళ్లు కలిపి కాచబడినగంజి), మజ్జిగ, గాడిదెయొక్కయు ఎనుముయొక్కయు మూత్రము, ఊరపిచ్చుక, పావురము, కుందేలు, తీతువుపిట్ట, లావుకపిట్ట, నెమలి, పెద్దపులి, జింక, వర్తికయను తీతువుపిట్ట, చిలుకలు మున్నగు జాంగల జంతువుల మాంసములు, మునగకాయలు, చేదుపొట్ల కాయలు, కాకరకాయలు, దోసకాయలు, తిలకవృక్షముయొక్క ఫలములు (తిలకమనునది స్వనామప్రసిద్ధమగు వృక్షవిశేషము), ములకకాయలు, అత్తికాయలు, ఉల్లిగడ్డలు, లేత అరటికాయలు, పొన్నగంటియాకు, పల్లేరు, ఎలుకచెవ్వియాకు, మందారపు ఆకు, తిప్పతీగె, త్రిఫలములు, (కరక, తానికాయ, ఉసిరికకాయలు), వెలగపండ్లు, నేరేడుపండ్లు, నమ్మదుంపలు, తామరదుంపలు, కలువదుంపలు, ఈరెండిటికి త్తనములు, ఖర్జూరపుచెట్టుయొక్కయు, టెంకాయచెట్టుయొక్కయు, తాటిచెట్టుయొక్కయు కొసలనుండు లేతమోవులు, త్రికటుకములు, (శుంఠి పిప్పళ్లు, మిరియాలు), తుమ్మిపండ్లు, పుల్లవెలగపండ్లు, పుచ్చకాయలు, తిక్తరసంబును కషాయరసంబునుకల సకలపదార్థములు, ఏనుగులు గుఱ్ఱములు మున్నగువానిపై నెక్కి సవారిచేయుట, విశేషముగ సంచరించుట, ఎండలో దిరుగుట, దేహపరిశ్రమజేయుట, ఇవియన్నియు ప్రమేహరోగముకల వారికి పథ్యములైయుండును.

— ప్రమేహరోగమునం దపథ్యములు. —

శ్లో॥ వేగరోధం ధూమపానం స్వేదం శోణితమోక్షణమ్।
సదాసనం దివానిద్రా నవాన్నాని దధీని చ ॥౩౧౬॥
అనూపమాంసం నిష్పావం పిష్టాన్నాని చ మైథునమ్,
సౌవీరకం సురా శుక్తం తైలం క్షీరం గుడం ఘృతమ్॥
తుమ్బీం తాలాస్థిమజ్జాం చ విరుద్ధాన్యశనాని చ।
కూశ్మాణ్డమిక్షు దుష్టామ్బు స్వాద్వమ్లలవణాని చ॥౩౧౭॥
అభిష్యన్ది చ యత్నేన ప్రమేహీ పరివర్జయేత్।

తా॥ మలమూత్రాది వేగముల నిరోధించుట, పొగ ద్రాగుట, చెమట వెడలించుట, రక్తస్రావము జేయుట, ఎల్లప్పుడును కూర్చునియుండుట, పగలు నిదురించుట, క్రొత్తబియ్యపు అన్నములు, పెరుగు, జలప్రాంతదేశముననుండు జంతువుల మాంసములు, అనుములు, పిండితో జేయబడిన యన్నములు, స్త్రీసంభోగము, సౌవీరమను కాంజికము, కల్లుపై తేట, నూనె, పాలు, బెల్లము, నెయ్యి, సొరకాయలు, తాటివిత్తనములోని గిజరు, పరస్పర విరుద్ధములగు నన్నములు, గుమ్మడికాయ, చెఱకు, దుష్టమైన జలము, మధుర అమ్ల లవణ రసములుకల పదార్థములు, స్రోతస్సుల స్రవింపజేయు నానావిధపదార్థములు, వీనినన్నిటిని ప్రమేహరోగముకలవారు మిక్కిలి ప్రయత్నముతో విడువవలెను.

—) మేదోరోగమున పథ్యములు. (—

శ్లో॥ చిన్తాశ్రమో జాగరణం వ్యవాయం
ప్రోద్వర్తనం లఙ్ఘనమాతపశ్చ ॥౩౧౯॥
హస్త్యశ్వయానం భ్రమణం విరేకః
ప్రచ్ఛర్దనఞ్చాప్యపతర్పణఞ్చ।
పురాతనా వైణవకోరదూష
శ్యామాకనీవారప్రియఙ్గుజూర్ణాః ॥౩౨౦॥
యవాః కులుత్థాశ్చణకా మసూరాః
ముద్గాస్తు వర్యశ్చమధూని లాజాః।
కటూని తిక్తాని కషాయకాని
తక్రం సురా చిఙ్గటమత్స్య ఏవ ॥౩౨౧॥
దగ్ధాని వార్తాకఫలాని చాపి
ఫలత్రయం గుగ్గులురాయసఞ్చ।
శిరీషలోధ్రద్రుమహారీతకీనాం
చూర్ణేన గాత్రస్య విలేపనఞ్చ ॥౩౨౨॥

కటుత్రయం సర్షపతైలమేలా
రూక్షాణి సర్వాణి చ ముఖ్యతైలమ్।
పత్రోత్థశాకాగురులేపనాని
ప్రతప్తనీరాణి శిలాజతూని ॥౩౨౩॥
ఏతాని సర్వాణి నిషేవితాని
మేదోగదం సత్వర ముత్క్షిపన్తి॥

తా॥ చింత, దేహపరిశ్రమము, రాత్రులయందు నిదురమేల్కొని యుండుట, స్త్రీసంభోగము, ఉద్వర్తనము (పసపు మున్నగు వస్తువులఁజేర్చిన చూర్ణాదులచేత శరీరమున నలుగుపెట్టుట), లంకణము, ఎండలోదిరుగుట, ఏనుగులు గుఱ్ఱములు మొదలగువానిపైనెక్కి సవారిజేయుట, అధికముగ సంచరించుట, విరేచనముజేసికొనుట, వమనముజేసికొనుట, శరీరమును కృశింపజేయు నాహారాదుల సేవించుట, ప్రాతవియగు వెదురుబియ్యము, ఆరుకలు, సామలు, నీవారములు, కొఱ్ఱలు, జొన్నలు, యవలు, ఉలవలు, సెనగలు, చిరుసెనగలు, పెసలు, కందులు, తేనె, పేలాలు, కటురసంబును తిక్తరసంబును కషాయరసంబునుకల సకల పదార్థములు, మజ్జిగ, మద్యము, చింగటమను మత్స్యము, నిప్పున కాల్చబడిన వంగపండ్లు, త్రిఫలములు (కరక తాని ఉసిరికలు), గుగ్గిలము, లోహభస్మము, దిరిసనపుకాయలు, లొద్దుగుపువ్వులు, కరకకాయలు, ఈమూటినిచేర్చి చూర్ణముచేసి యాచూర్ణముచే నలుగుపెట్టుట, త్రికటుకములు, ఆవనూనె, ఏలకులు, రూక్షములగు సకల పదార్థములు నువ్వులనూనె, ఆకుకూరలు, అగరునుబూసికొనుట, వేడినీళ్ళు, శిలాజతువు, ఇవియన్నియు మేదోరోగమును హరించునుకావున పథ్యములైయుండును.

— మేదోరోగమునందపథ్యములు. —

శ్లో॥ స్నానం రసాయనం శాలీన్ గోధూమాన్ సుఖశీలితాన్।
క్షీరేక్షువికృతీర్మాషాన్ సౌహిత్యం స్వేదనాని చ॥ ౩౨౪॥

మత్స్యం మాంసం దివానిద్రాం స్రగ్గన్ధాన్మధురాణి చ।
సర్వస్య భోజనస్యాన్తే జలపానం విశేషతః ॥3౨౫॥
అతిమాత్రం తూపచితే విశేషాద్వమనక్రియామ్।
స్వభావస్థత్వమన్విచ్ఛన్మేదస్వీ వర్జయేదిమాన్॥3౨౬॥

తా॥ స్నానము, రసాయనౌషధముల సేవించుట, రాజనపు బియ్యమును గోధుమలను భుజించుట, శరీరమునకు మిక్కిలి సుఖమును గల్గించుట, పాలు, చెఱుకునకు సంబంధించిన బెల్లము చక్కెర మున్నగునవి, మినుములు, తృప్తికల్గునంతభుజించుట, స్వేదనకర్మ జేయుట, మత్స్యములు, మాంసము, పవటియందు నిదురించుట, పుష్పమాలికల ధరించుట, గంధమునుబూసికొనుట, మధురపదార్థముల సేవించుట, అన్ని పదార్థములను భుజించినపిదప అధికముగ నీళ్ళు త్రాగుట, విశేషముగ వమనముజేసికొనుట, వీనినన్నిటిని శరీరముమిక్కిలి బలిసియుండునపుడు మేదోరోగముకల మనుజులు విడువవలెను.

—॥ ఉదరరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేచనం లఙ్ఘనమబ్దసమ్భవాః
కులుత్థముద్గారుణశాలయో యవాః।
మృగద్విజా జాఙ్గలసంజ్ఞయాన్వితాః
సితా సురా మాక్షికశీధుమాధ్వీకాః॥3౨౭॥
తక్రో రసోనో రుబుతైలమార్ద్రికం
శాలిఞ్చ శాకం కులకం కటిల్లకమ్।
పునర్నవా శిగ్రుఫలం హరీతకీ
తామ్బూలమేలాయవశూకమాయసమ్॥3౨౮॥
అజాగవోష్ట్రీమహిషీపయోజలం
లఘూని తీక్ష్ణాని చ దీపనాని।
వస్త్రేణ సంవేష్టనమగ్నికర్మ

విషప్రయోగోఽత్రయుక్తో యథాయథమ్ ॥౩౨౯॥
విశేషతః ప్లీహసముద్భవే గదే
వామేఽగ్రబాహౌ ధమనీవ్యధః పరమ్ ।
బద్ధాహ్వయే చోదరజే క్షతోత్థితే
నాభేరధశ్శస్త్రవిధిర్యథావిధి ॥౩౩౦॥
సమీరణోత్థే ఘృతపానమాదితః
సాభ్యఞ్జనశ్చాప్యనువాసనం తథా ।
యథామలం పథ్యగణోఽయమాశ్రితః
సఖా నృణాం స్యాదుదరామయే సతి॥ ౩౩౧॥

తా॥ విరేచనము, లంకణము, సంవత్సరకాలమునకుమున్ను పండిన ఉలవలు, పెసలు, ఎఱ్ఱవరివడ్లు, యవలు, జాంగలదేశమున జనించిన మృగములు, పక్షులు, వీని మాంసరసములు, చక్కెర, మద్యము, తేనె, శీధు అను మద్యము, మాధ్వీకమను మద్యము, మజ్జిగ, ఉల్లిగడ్డలు, ఆముదము, అల్లము, శాలిశాకము, పొట్లకాయలు; కాకరకాయలు, గలిజేరు, మునగకాయలు, కరకకాయలు, తాంబూలము, ఏలకులు, యవక్షారము, లోహభస్మము, మేకలయొక్కయు ఆవులయొక్కయు ఒంటెలయొక్కయు బఱ్ఱెలయొక్కయు పాలు, వానిమూత్రములు, చుల్కనగ జీర్ణంబులగునవియు తీక్ష్ణంబులును, అగ్నినిదీపింపజేయునవియునగు పదార్థముల భుజించుట, ఉదరముపై బట్టచేజుట్టుట, నిప్పునకాలిన యినపసలాకులచే రక్తమువేయుట, సర్పవిషము నుపయోగించుట, ఇవియన్నియు నుదరరోగమునం దాయా దోషముల ననుసరించి పథ్యములైయుండును.

మఱియు ప్లీహోదరమునందు యెడమచేతి మణికట్టున సిరావ్యధనము జేయవలెను. బద్ధగుదోదరమునందును క్షతోదరమునందును నాభికి క్రిందిభాగమున శాస్త్రోక్తప్రకారము శస్త్రకర్మ జేయందగును.

వాతముచే గల్గిన ఉదరవ్యాధియందు తొలుతఘృతపానము జేసి పిదప తైలాదులచే నభ్యంజనంబును, అనువాసన వస్తికర్మ జేయుటయు పథ్యము,

ఇత్తెరంగున నాయాదోషముల ననుసరించి ఉదరవ్యాధియందు పథ్యముల నెరుంగునది.

—॥ ఉదరరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ సంస్నేహనం ధూమపానం జలపానం సిరావ్యధమ్ ।
ఛర్దిర్వ్యానందివాస్వప్నం వ్యాయామం పిష్టవైకృతమ్॥౩౩౨॥
ఔదకానూపమాంసాని పత్రశాకాస్తిలా అపి ।
ఉష్ణాని చ విదాహీని లవణాన్యశనాని చ ॥౩౩౩॥
మహేన్ద్రిగిరిజాతానాం సరితాం సలిలాని చ ।
శమీధాన్యం విరుద్ధాన్నం దుష్టనీరం గురూణి చ॥౩౩౪॥
విష్టమ్భీని విశేషాత్తు స్వేదం విష్టమ్భసమ్భవే ।
వర్జయేదుదరవ్యాధౌ వైద్యో రక్షన్నిజం యశః ॥౩౩౫॥

తా॥ స్నేహనము, ధూమపానము, జలపానము, సిరావ్యధనము, వమనము, గుఱ్ఱము మున్నగు వాహనములపైనెక్కి సవారిజేయుట, పగలు నిదురించుట, దేహపరిశ్రమజేయుట, పిండితో జేయబడిన భక్ష్యాదుల దినుట, ఉదకమునజనించిన జంతువులయొక్కయు జలప్రాంతమునందు జంతువులయొక్కయు మాంసములు, ఆకుగూరలు, నువ్వులు, ఉష్ణంబులును విదాహకరంబులును లవణరసంబులునగు నాహారపదార్థములు, మహేన్ద్రిపర్వతమున బుట్టిన నదులలోనుండు జలము, మినుములు మున్నగు శమీధాన్యములు, పరస్పర విరుద్ధములగు పదార్థములు, దుష్టమైన జలము, అజీర్ణకర పదార్థములు, ఇవియన్నియు నుదరవ్యాధికల మనుజులచే విడువందగును.

మఱియు మలబంధముచే గల్గిన ఉదరవ్యాధియందు మలమును బంధించు పదార్థముల సేవించుటయు, శరీరమున చెమట వెడలించుటయు నపథ్యములు. యశమునుగోరు వైద్యుండు ఉదరరోగముకల రోగికి పైజెప్పబడిన తెఱంగున పథ్యముల దెలుపవలెను.

—॥ శోథరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ సంశోధనం లఙ్ఘనమస్రమోక్షః
స్వేదః ప్రలేపః పరిషేచనఞ్చ ।
పురాతనాశ్శాలియవాః కులుత్థాః
ముద్గాశ్చ గోధాహ్వపిశల్లకోఽపి ॥౩౩౬॥
భుజఙ్గభుక్తిత్తిరతామ్రచూడ
లావాదయో జాఙ్గలవిష్కిరాశ్చ ।
కూర్మోఽపి శృఙ్గీ ప్రపురాణసర్పి
స్తక్రం సురా మాక్షికమాసవఞ్చ ॥౩౩౭॥
నిష్పావకాటిల్లకరక్తశిగ్రు
రసోనకర్కోటకబాలమూలమ్ ।
సువర్చలా గృఞ్జనకం పటోలం
వేత్రాగ్రధాత్రీఫలమూలకాని ॥౩౩౮॥
పునర్నవా చిత్రకపారిభద్ర
శ్రీపర్ణినిమ్బేక్షురపల్లవాని ।
ఏరణ్డతైలం కటుకా హరిద్రా
హరీతకీ క్షారనిషేవణఞ్చ ॥౩౩౯॥
భల్లాతకం గుగ్గులురాయసఞ్చ
కటూని తిక్తాని చ దీపనాని ।
మూత్రాణి గోఽజామహిషీభవాని
కస్తూరికా చాపి శిలాజతూని ॥౩౪౦॥
యత్పాణ్డురోగేష్వపి వహ్నికర్మ
పురాప్రదిష్టం హి తదేవ చాపి ।

యథామలం పథ్యమిదం ప్రయుక్తం
శోథామయం సత్వరముచ్ఛినత్తి ॥౩౭౧॥

తా॥ వమనవిరేచనరూపమగు శోధనము, లంకణము, రక్తమోక్షము, చెమటవెడలించుట, పట్టువేయుట, కషాయాదులచే దడుపుట, ప్రాతవియగు రాజనముల బియ్యము, యవలు, ఉలవలు, పెసలు, ఉదుము, ముండ్లపంది, నెమలి, తిత్తిరిపక్షి, కోడి, లావుకపిట్ట, ఇవి మొదలగు జాంగలపక్షుల యొక్కయు; తాబేలు, శృంగి యను మత్స్యము వీనియొక్కయు మాంసము, మిక్కిలి ప్రాతదియగునెయ్యి, మజ్జిగ, కల్లు, తేనె, మద్యము, అనుములు, కాకరకాయలు, ఎఱ్ఱని మునగకాయలు, ఉల్లిగడ్డలు, ములుదోస, లేతముల్లంగి, ప్రొద్దుతిరుగుడు చెట్టుఆకు, గెంజాయి, పొట్లకాయలు, వేముచిగురు, ఉసిరిక కాయలు, ముల్లంగి, గలిజేరు, చిత్రమూలము, దేవదారుచూర, పెద్దగుమ్మడి, వేప, నీరు గొబ్బి అను నీయారిటిచిగుళ్లు, ఆముదము, కటుకరోహిణి, పసపు, కరకాయలు, క్షారములు, జీడిగింజలు, గుగ్గిలము, లోహభస్మము, కటురసముకల సకలపదార్థములు, తిక్తరసముకలపదార్థములు, అగ్నిని దీపింపజేయు పదార్థములు, ఆవులయొక్కయు మేకలయొక్కయు బఱ్ఱెలయొక్కయు మూత్రములు, కస్తూరి, శిలాజతువు, ఇవియన్నియు శోథ (నంజు) రోగమునందు పథ్యములు.

మఱియు మున్ను పాండురోగమున జెప్పిన రీతిగ నీశోథ రోగమునందును అగ్నికర్మ జేయుట మిగుల హితకరమైయుండును.

—(శోథరోగమునం దపథ్యములు.)—

శ్లో॥ పవనం సలిలం వేగరోధం చ విషమాశనమ్।
విరుద్ధం పానమశనం మృత్తికాయాశ్చ భక్షణమ్॥౩౭౨॥
గ్రామ్యానూపం పిశితలవణం శుష్కశాకం నవాన్నం
గౌడం పిష్టం దధి సకృసరం నిర్జలం మద్యమమ్లమ్ ।

ధానా వల్లూరసమశనమథో గుర్వసాత్మ్యం విదాహి
స్వప్నం రాత్రౌ శ్వయథుగదవాన్ వర్జయేన్మైథునఞ్చ॥

తా॥ గాలిలోనుండుట, నీరుద్రాగుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, న్యూనాధికముగ భుజించుట, పరస్పరవిరుద్ధములగు నన్నపానముల సేవించుట, మన్ను తినుట, గ్రామ్యానూపజంతువులమాంసములు, లవణ రసము కల పదార్థములు, ఎండినకాయలు మున్నగువానిచే జేయబడిన కూరలు, క్రొత్తబియ్యముచే సిద్ధమైన యన్నము, బెల్లముచే జేయబడిన సకల పదార్థములు, పెరుగు, పిండితో జేయబడిన పదార్థములు, కృసరము (నువ్వులను బియ్యమును మినపపప్పును ఒకటిగ జేర్చి పక్వముజేయబడిన యన్నము), నీళ్లు లేని మద్యము, పులుపుగల పదార్థములు, బొరుగులు, ఎండినమాంసము, సమశనము (పథ్యములగు పదార్థములను అపథ్యపదార్థములను ఒకటిగ జేర్చి భుజించుట), అజీర్ణకర పదార్థములను అసాత్మ్యపదార్థములను భుజించుట, రాత్రులయందు నిదురించుట, సంభోగము జేయుట, ఇవియన్నియు శోథ (నంజు) రోగముకలవారికి అపథ్యములు కావున సేవింపందగవు.

## —బ్రధ్నవృద్ధిరోగములయందు పథ్యములు.—

శ్లో॥ సంశోధనం వస్తిరసృగ్విమోక్షః
స్వేదః ప్రలేపోఽరుణశాలయశ్చ।
ఏరణ్డతైలం సురభీజలఞ్చ
ధన్వామిషం శిగ్రుఫలం పటోలమ్॥౩౮౮॥
పునర్నవా గోక్షురకాగ్నిమన్థ
తామ్బూలపథ్యాసరలా రసోనమ్।
వార్తిజ్ఞనం గృఞ్జనకం మధూని
కౌమ్భం ఘృతం తప్తజలఞ్చ తక్రమ్॥౩౮౯॥
యదామవాతాపహమగ్నికారి

తదన్నపానఞ్చ సుధా పురాణమ్ ।
అర్ధేన్దువద్వ్యక్షణయోశ్చ దాహో
వ్యత్యాసతో బాహుసిరావ్యధశ్చ ॥ ౩౮౬॥
యథా శ్రుతశ్శస్త్రవిధిశ్చ వర్గ
స్యాన్త్రవృద్ధ్యాభయినాం సుఖాయ ।

తా॥ వమనవిరేచనరూపములగు సంశోధనకర్మలు, వస్తికర్మ, రక్త మోచనము, చెమటబుట్టించుట, పట్టువేయుట, ఎఱ్ఱవరిబియ్యపు అన్నము, ఆముదము, గోమూత్రము, అరణ్యమునందు జంతువులమాంసము, మునగకాయలు, పొట్లకాయలు, గలిజేరు, పల్లేరు, కూరనెల్లి, తాంబూలము, కరకకాయలు, తెగడ, ఉల్లిగడ్డలు, వంకాయలు, గంజాయి, తేనె, కుండలోమాగిన నెయ్యి, వేడినీళ్లు, మజ్జిగ, ఇవియన్నియును, ఆమవాతమును హరించి అగ్నిని దీపింపజేయు పదార్థములును, ప్రాతదియగు కల్లును బ్రధ్మరోగమునందును అండవృద్ధియందును పథ్యములు.

మఱియు అర్ధచంద్రాకారమువలె గజ్జలయందు రక్షవేయవలెను. ఈబ్రధ్మయను గ్రంథి కుడిప్రక్కనున్నచో ఎడమచేతియందు సిరావ్యధనము జేయుటయు, ఎడమప్రక్కనున్నపుడు కుడిచేతిలో సిరావ్యధనముజేయుటయు పథ్యమైయుండును. ఈరోగమునందును అండవృద్ధియందును శాస్త్రోక్త ప్రకారము శస్త్రకర్మ జేయుటయు మిక్కిలిప్రశస్తము. (ఇచ్చట బ్రధ్మమనగా వాతము ప్రకోపమునొందుటచేత గజ్జలయందు గ్రంథిరూపముగ జనించినశోఫ యని యెఱుంగునది).

—॥ బ్రధ్మవృద్ధిరోగములయం దపథ్యములు. ॥—

శ్లో॥ విరుద్ధపానాన్నమసాత్మ్యసేవాం
సంక్షోభణం హస్తిహయాదియానమ్ ॥ ౩౮౭॥
ఆనూపమాంసాని దధీని మాషా

దుగ్ధాని పిష్టాన్నముపోదికాచ।
గురూణి శుక్రోత్థితవేగరోధః
స్యుర్బ్రధ్నవృద్ధ్యామయినామమిత్రమ్॥౩౮౮॥

తా॥ పరస్పర విరుద్ధములగు నన్నపానములు, అసాత్మ్యములగు పదార్థముల సేవించుట, దోషముల చలింపజేయు పనులజేయుట, ఏనుగులు గుఱ్ఱములు మున్నగువానిపై నెక్కి సవారిచేయుట, అనూపదేశమునంగల జంతువుల మాంసములు, పెరుగు, మినుములు, పాలు, పిండిచే జేయబడిన పదార్థములు, బచ్చలికూర, అజీర్ణకరపదార్థములు, శుక్రవేగమును నిరోధించుట, ఇవి యన్నియు బ్రధ్నరోగమునందును అండవృద్ధిరోగమునందును అపథ్యములు కావున సేవింపందగవు.

—॥ గలగణ్డ గణ్డమాలాది రోగములయందు పథ్యములు. ॥—

శ్లో॥ ఛర్ది ర్విరేచనం నస్యం స్వేదో ధూమం సిరావ్యధః।
అగ్నికర్మ క్షారయోగః ప్రలేపో లఙ్ఘనాని చ ॥౩౮౯॥
పురాణఘృతపానఞ్చ జీర్ణలోహితశాలయః।
యవాః ముద్గాః పటోలఞ్చ రక్తశిగ్రుకటిల్లకమ్ ॥౩౯౦॥
శాలిఞ్చ శాకం వేత్రాగ్రం రూక్షాణి చ కటూని చ।
దీపనాని చ సర్వాణి గుగ్గులుశ్చ శిలాజతు ॥౩౯౧॥
విశేషాద్గలగణ్డేషు ఛిత్వా జిహ్వాతలే సిరే।
కుర్యాద్వా మణిబన్ధార్ధే రేఖా స్తిస్రోఽఙ్గులాన్తరాః॥
యథాదోషం యథావస్థం పథ్యమేతత్ప్రకీర్తితమ్।

తా॥ వమనము, విరేచనము, నస్యము, స్వేదము, ధూమపానము, సిరావ్యధనము, అగ్నికర్మ, క్షారప్రయోగము, ప్రలేపము (పట్టువేయుట), లంకణము, అను నీ కర్మలజేయుట, పాతనేతిని త్రాగుట, పాతయెఱ్ఱవరివడ్లు, యవలు, పెసలు, పొట్లకాయలు, ఎఱ్ఱనిమునగకాయలు, కాకరకాయలు,

శాలిశాకము, పేముచిగురు, రూక్షంబులును కటురసముగల్గినవియు అగ్నిని దీపింప జేయునవియునగు సకలపదార్థములు, గుగ్గిలము, శిలాజతువు, ఇవియన్నియును గలగండాది రోగములయందు పథ్యములైయుండును. మఱియు గలగండమునందు నాలుకక్రిందనుండు రెండుసిరలను ఛేదించుటయైనను మణికట్టున నగభాగములో నొక్కొక్క అంగుళమునకు ఒక్కొక్క రేఖవంతున మూడురేఖలుగ గఱ వేయుటయైనను పథ్యములుగనుండును. ఇత్తెరంగున గలగండాదిరోగములయందు ఆయాదోషములను అవస్థాభేదములను అనుసరించి పథ్యములు నుడువఁబడియె.

—॥ గలగండ గండమాలాది రోగములయం దపథ్యములు. ॥—

శ్లో॥ దుగ్ధేక్షువికృతీస్సర్వా మాంసం చానూపసమ్భవమ్ ॥
పిష్టాన్నమమ్లమధురం గుర్వభిష్యన్దకారి చ ।
గలగణ్డం గణ్డమాలాఽపచీగ్రన్థ్యర్బుదామయాన్ ॥
చికిత్సన్నగదంకారో యత్నోఽర్థీ పరివర్జయేత్ ।

తా॥ పాలు, చెఱకు సంబంధంబులగు బెల్లము చక్కెర మున్నగు పదార్థములు, అనూపదేశమునందుండు జంతువులమాంసములు, పిండితో జేయబడిన పదార్థములు, అమ్ల మధుర రసములుగల సకలపదార్థములు, అజీర్ణకరంబులును స్రోతస్సుల స్రవింపజేయునవియునగు పదార్థములు, ఇవియన్నియు గలగండము గండమాల అపచి గ్రంథి అర్బుదములను రోగములయందు అపథ్యములు కావున సేవింపందగవు.

—॥ శ్లీపదరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ప్రచ్ఛర్దనం లఙ్ఘనమస్రమోక్షః
స్వేదో విరేకః పరిలేపనఞ్చ ।
పురాతనాష్షష్టికశాలయశ్చ
యవాః కులుత్థా లశునం పటోలమ్ ॥౩౧౫॥

వా ర్తాకశోభాంజనకారవేల్ల
పునర్నవామూలకపోతికా చ।
ఏరణ్డతైలం సురభీజలఞ్చ
కటూని తిక్తాని చ దీపనాని॥౩౫౬॥
గుల్ఫోపరిష్టాచ్చతురఙ్గులే వా
వాతోద్భవే గుల్ఫతలే చ పైత్తే।
అఙ్గుష్ఠమూలే కఫజే విశేషాత్
సిరావ్యధశ్చాపి యథావిధానమ్ ॥౩౫౭॥
ఏతాని పథ్యాని భవన్తి పుంసాం
రోగే సతి శ్లీపదనామధేయే।

తా॥ వమనము, లంకణము, రక్తమోక్షము, స్వేదము, విరేచనము, పట్టువేయుట, అను నీయారుకర్మలజేయుట; ప్రాతవియగు అరువదినాళ్ళసంబావులు, రాజనములు, యవలు, ఉలవలు, ఉల్లిగడ్డలు, పొట్లకాయలు, వంకాయలు, మునగకాయలు, కాకరకాయలు, గలిజేరు, లేతముల్లంగి, ఆముదము, గోమూత్రము, కటుతిక్తరసములుకల పదార్థములు, అగ్నిని దీపింపజేయుపదార్థములు, ఇవియన్నియు శ్లీపదరోగమునందు పథ్యములు.

మఱియు శ్లీపదము వాతముచే జనించినచో చీలమండకు నాల్గంగుళీముల పైభాగమునందును, పిత్తమువలన జనించెనేని చీలమండయందును, కఫముచే గలిగెనేని బొటనవ్రేలి మొదటియందును సిరావ్యధనము జేయుట మిక్కిలి ప్రశస్తమైయుండును. ఇత్తెరంగున శ్లీపదరోగమునందు పథ్యక్రమము నెరుంగునది.

—॥ శ్లీపదరోగమువందదపథ్యములు. ॥—

శ్లో॥ పిష్టాన్నం దుగ్ధవికృతిం గుడమానూపమామిషమ్ ॥౩౫౮॥
స్వాద్వమ్లం పారియాత్రం చ సిన్ధువిన్ధ్యనదీజలమ్।
పిచ్ఛిలం గుర్వభిష్యన్ది శ్లీపదీ పరివర్జయేత్ ॥౩౫౯॥

తా॥ పిండితోఁ జేయబడిన పదార్థములు, పాలతోఁ జేయబడిన పదార్థములు, బెల్లము, అనూపదేశమునందు జంతువుల మాంసములు, మధుర అమ్ల రసములుకల పదార్థములు, పారియాత్రమను పర్వతమునందును వింధ్యపర్వతమునందు నుండు నదులయొక్కయు సింధునదియొక్కయు జలము, పిచ్ఛిలంబులును అజీర్ణకరంబులును స్రోతస్సుల స్రవింపజేయునవియునగు పదార్థములు, వీనినన్నిటిని శ్లీపదరోగముకలవాడు విడువవలెను.

—౹ విద్రధిరోగమునందు పథ్యములు. ౹—

శ్లో॥ ఆమావస్థే రేచనాని లేపస్స్వేదోఽస్రమోక్షణమ్ ।
జీర్ణాశ్శాల్యమాకకలమాః కులుత్థా లశునాని చ ॥ ౩౬౦॥
రక్తశిగ్రుశ్చ నిష్పావః కారవేల్లం పునర్నవా ।
శ్రీపర్ణం చిత్రకం క్షౌద్రం శోథోక్తాని చ సర్వశః॥౩౬౧॥
పక్వావస్థే శస్త్రకర్మ పురాణా రక్తశాలయః ।
ఘృతం తైలం ముద్గరసో విలేపీ ధన్వజా రసాః ॥౩౬౨॥
శాలిఞ్చ శాకం కదలీ పటోలం హిమవాలుకా ।
చన్దనం తప్తశీతామ్బు సర్వం చాపి వ్రణోదితమ్ ॥౩౬౩॥
నరాణాం విద్రధౌ రోగే పథ్యాపథ్యం యథామలం ।
పథ్యాన్యేతాని సర్వాణి నిర్దిష్టాని మహర్షిభిః ॥౩౬౪॥

తా॥ విరేచనము, పట్టువేయుట, చెమటబుట్టించుట, రక్తమోచనము జేయుట, ప్రాతవియగు సాములు, ప్రాతరాజనములు, ఉలవలు, ఉల్లిగడ్డలు, ఎఱ్ఱనిమునగకాయలు, అనుములు, కాకరకాయలు, గలిజేరు, పెద్దగుమ్మడికాయ, చిత్రమూలము, తేనె, ఇవియన్నియును, శోఫరోగమున జెప్పబడిన పథ్యవర్గంబును విద్రధిపక్వముగాకుండునపుడు పథ్యములైయుండును.

మఱియు అట్టి విద్రధి పక్వంబైనపుడు శస్త్రకర్మ జేయుట, పాత ఎఱ్ఱ వరిధాన్యములు, నెయ్యి, నూనె, పెసలకట్టు, విలేపి (మెతుకు లధికముగ నుండు గంజి), అరణ్యమున జనించిన జంతువుల మాంసరసము, శాలిశాకము,

అరటికాయలు, పొట్లకాయలు, పచ్చకర్పూరము, చందనము, కాగిచల్లారిననీళ్లు ఇవియన్నియును, వ్రణరోగమున జెప్పబడిన పథ్యవర్గంబును పథ్యములు. ఇత్తెరంగున విద్రధిరోగమునందు ఆయాదోషముల ననుసరించి పథ్యములు బుధులచే నిర్ణయింపబడెను.

—॥ విద్రధిరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ శోథినాం యాన్యపథ్యాని వ్రణినామహితాని చ ।
క్రమాదామే చ పక్వే చ విద్రధౌ వర్జయేన్నరః॥౩౬౫॥

తా॥ విద్రధి ఆమావస్థనొందియున్నపుడు శోథరోగమున జెప్పంబడు నపథ్యములును, పక్వావస్థనొందినపుడు వ్రణరోగమునజెప్పబడు నపథ్యంబులును వరుసగా నపథ్యములైయుండును కావున విడువందగును.

—॥ వ్రణశోథాది రోగములయందు పథ్యములు. ॥—

శ్లో॥ విమ్లాపనం రక్తముక్తిరుపనాహోవిపాటనమ్ ।
శోధనం రోపణం షష్ఠం పురాణాస్సితశాలయః ॥ ౩౬౬॥
యవషష్టికగోధూమా జాఙ్గలా మృగపక్షిణః ।
విలేపీ లాజమణ్డశ్చ కటుతైలం ఘృతం మధు ॥౩౬౭॥
తైలం మసూరతువరీ ముద్గయూషశ్చ శర్కరా ।
ఆషాఢఫలవార్తాక కర్కోటక పటోలకమ్ ॥౩౬౮॥
కారవేల్లం నిమ్బపత్రం వేత్రాగ్రం బాలమూలకమ్ ।
సునిషణ్ణకశాలిఞ్చ తణ్డులీయకవాస్తుకమ్ ॥౩౬౯॥
త్రిఫలా పనసం చోచం దాడిమం కటుకాఫలమ్!
జీవన్తీసైన్ధవం ద్రాక్షా స్వాదుతిక్తకషాయకాః ॥౩౭౦॥
సమస్తమేతదన్నన్తు స్నిగ్ధముష్ణం ద్రవోత్తరమ్।
ఏషణం శమనం దాహః స్వేదనం బన్ధనక్రియా ॥౩౭౧॥
వ్రణావచూర్ణనం లేపో ధూపనం పత్రధారణమ్ ।

ఉశీరవాలవ్యజనం చన్దనం తిలలేపనమ్॥ 322॥
తప్తశీతామ్బు కర్పూరవైకృతాపహృతిః పరా।
ఏతత్పథ్యంనరైస్సేవ్యంపథ్యాపథ్యంయథామలమ్ ॥323॥
వ్రణశోథే వ్రణే సద్యోవ్రణే నాడీవ్రణేఽపి చ।

తా॥ విమ్లాపనము (పట్టువేయుట మొదలగుక్రియలచే వాపును గరగించుట), రక్తమోక్షము, ఉడికించబడిన అగసిపిండి మొదలగువానిచే కట్టుకట్టుట, ఛేదించుట, శోధనము (వ్రణములోపలనుండు చీము మున్నగు వానిని కడుగుట), రోపణము (వ్రణమును మాన్పనట్టి యాపధాదుల నుపయోగించుట), ఈయారుకర్మలను వ్రణశోథాదులయందు వరుసగా జేయందగును. మఱియు, ప్రాతవియగు తెల్లసంబావులు, యవలు, అరువదినాళ్లసంబావులు, గోధుమలు, అరణ్యమునబుట్టిన మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసములు, విలేపి (మెతుకులధికముగనుండు గంజి), లాజమండము, ఆవనూనె, నెయ్యి, తేనె, నువ్వులనూనె, చిరుసెనగలయొక్కయు కందులయొక్కయు పెసలయొక్కయు కట్టులు, చక్కెర, ఆషాఢమాసమున జనించు ఫలము, వంకాయలు, దోసకాయలు, పొట్లకాయలు, కాకరకాయలు, వేపాకు, వేము చిగురు, లేతముల్లంగి, చక్రవర్తికూర, శాలిశాకము, చిల్లికూర, పులిచింత, త్రిఫలములు (కరక, తాని, ఉసిరికలు), పనసకాయ, కచోరములు, దానిమ్మపండ్లు, చేదుపుచ్చకాయలు, పాలకూర, సైంధవలవణము, ద్రాక్షపండ్లు, మధుర తిక్త కషాయ రసములుకల పదార్థములు, స్నిగ్ధంబును ఉష్ణంబునై ద్రవముకల యన్నము, ఇవియన్నియును పథ్యములై యుండును.

మఱియు ఏషణము (వ్రణమునందు శలాకలచేత పూయాదుల వెతకుట), శమనము (దోషములశమింపజేయుట), అగ్నికర్మ, స్వేదనము, కట్టుకట్టుట, వ్రణముపై చూర్ణమును చల్లుట, పట్టువేయుట, పొగబెట్టుట, వ్రణములమాన్పనట్టి యాకులను వ్రణములపైబెట్టి కట్టుట, వట్టివేళ్ళ విసనకఱ్ఱలచే విసరుట, చందనమును బూయుట, నువ్వులనూనెపూయుట, కాగి చల్లారిననీళ్ళచే కడుగుట,

కర్పూరమునుబూయుట, వికృతరూపమును బోగొట్టు క్రియలజేయుట, ఇవి యన్నియు వ్రణశోథమునందును వ్రణములయందును,సద్యోవ్రణములయందును పథ్యములైయుండును.

—॥ వ్రణశోథాది రోగములయందపథ్యములు. ॥—

శ్లో॥ నవ్యాని ధాన్యాని తిలాన్కలాయా
న్మాషాన్కులుత్థాన్కృసరాం హిమామ్భః।
శీతేక్షుజాతాన్వివిధాన్వికారా
నమ్లాని శాకాని చ పత్రవన్తి॥౩౭౪॥
అజాఙ్గలం మాంస మసాత్మ్యమన్నం
విదాహివిష్టమ్భిగురూణి చాపి।
కట్వామ్లశీతం లవణం వ్యవాయం
వ్యాయామముచ్చైః పరిభాషణఞ్చ॥౩౭౫॥
ప్రియాసమాలోకనమహ్ని నిద్రాం
ప్రజాగరం చఙ్క్రమణం మితాన్నమ్।
యథాస్థితం ప్రాగధిరోపణఞ్చ
నస్యాని తామ్బూలమజీర్ణతాఞ్చ॥౩౭౬॥
ప్రచణ్డవాతాతపధూమవృష్టి
రజోభయక్రోధవమిప్రహర్షాన్।
శోకం విరుద్ధాశనమమ్బుపానం
తీక్ష్ణోష్ణరూక్షాణి విఘట్టనఞ్చ॥౩౭౭॥
కణ్డూయనం కాష్ఠనఖాదితోదం
నిరస్నభావం విషమోపచారమ్।

నైద్యశ్చికిత్సన్వ్రణశోథరోగం
వ్రణం చ సద్యోవ్రణమామయజ్ఞ్చ॥౩౭౮॥
నాడీవ్రణఞ్చాపి యశోభిలాషీ
వివర్జయేత్స న్తతమప్రమత్తః।

తా॥ క్రొత్తవియగుధాన్యములు, నువ్వులు, పటాణులు, మినుములు, ఉలవలు, కృసరసము (నువ్వులను మినుములను బియ్యమును జేర్చి పక్వము జేయ బడిన యన్నము), మంచునీళ్ళు, పాలచేతను చెఱకు రసముచేతను పక్వమైన పదార్థములు, పులుపుకల్గినపదార్థములు, ఆకుగూరలు, జలప్రాంతమునందును జలమునందును జనించిన జంతువులమాంసములు, అలవాటులేక శరీరమునకు ఇమడని యన్నాదులు, విదాహకరంబులును మలమును బంధించునవియు అజీర్ణ కరంబులునైన పదార్థములు, కటురసంబును అమ్లరసంబునుకల పదార్థములు, శీతలపదార్థములు, ఉప్పు, ఈపదార్థములనన్నిటిని సేవించుట; స్త్రీసంభోగము జేయుట, దేహపరిశ్రమజేయుట, బిగ్గరగమాటలాడుట, ప్రియురాండ్ర జూచుట, పగటియందునిదురించుట, రాత్రులయందు నిదురమేల్కొనియుండుట, అధికముగ సంచరించుట, మిగులస్వల్పముగా భుజించుట, వ్రణములయందు దోషము నిశ్శేషముగ నివర్తించక యథాస్థితిగనున్నపుడు వ్రణమునుమాన్పచికిత్స జేయుట, నస్యము నుపయోగించుట, తాంబూలము, అజీర్ణకర పదార్థముల సేవించుట, అధికమైనగాలియు ఎండయు పొగయు వర్షంబును దుమ్మును గల ప్రదేశముననుండుట, భయము, క్రోధము, వాంతి, సంతోషము, దుఃఖము, పరస్పర విరుద్ధములగు నన్నపానములు, తీక్ష్ణంబులును ఉష్ణంబులును రూక్షంబులునైన పదార్థముల సేవించుట, వ్రణాదులకు పలువిధములగు నభిఘాతముల గలుగజేయుట, గోకుట, పుల్లలు గోళ్ళు మున్నగువానిచే గ్రుచ్చుట, అన్నమును భుజించక ఉపవాసముండుట, విరుద్ధములగు నుపచారముల జేయుట, ఇవియన్నియు వ్రణశోఫయందును వ్రణములయందును నాడీవ్రణములయందును మిక్కిలి మెలకువతో విడిచియుండవలెను.

—॥ భగ్నమునందు పథ్యములు. ॥—

శ్లో॥ శీతామ్బు చన్దనం పఙ్క ప్రదేహా బన్ధనక్రియా।
శాలిప్రియఙ్గుగోధూమా యూషో ముద్గసతీనయోః॥
నవనీతం ఘృతం క్షీరం తైలం మాంసరసో మధు।
పటోలం లశునం శిగ్రు పత్తూరో బాలమూలకమ్॥ ౩౮౦॥
ద్రాక్షా ధాత్రీ వజ్రవల్లీ లాక్షాయచ్చాపి బృంహణమ్।

తా॥ చల్లనైననీళ్ళు, చందనమును బురదనుబూయుట, కట్టుగట్టుట, రాజనములబియ్యము, కొఱ్ఱలు, గోధుమలు, పెసలయొక్కయు చిరుసెనగల యొక్కయు కట్టులు, వెన్న, నెయ్యి, పాలు, నూనె, మాంసరసము, తేనె, పొట్లకాయలు, ఉల్లిగడ్డలు, మునగకాయలు, పొన్నగంటికూర, లేతముల్లంగి, ద్రాక్షపండ్లు, ఉసిరికకాయలు, వజ్రవల్లి, లక్క, ఇవియన్నియును, శరీరమునకు పుష్టినికల్గించునవియును భగ్న (ఎముకలు విరుగుట) రోగమునందు పథ్యములై యుండును.

—॥ భగ్నమునందపథ్యములు. ॥—

శ్లో॥ లవణం కటుకక్షారమమ్లం మైథునమాతపమ్ ॥౩౮౧॥
వ్యాయామఞ్చ న సేవేత భగ్నే రూక్షాన్నమేవ చ।

తా॥ ఉప్పు, చేదు, కారము, పులుపు, ఈరసములుకల పదార్థముల సేవించుట, సంభోగముజేయుట, ఎండలోనుండుట, దేహపరిశ్రమజేయుట, ఇవి యన్నియును రూక్షములగు నన్నములును భగ్నములయందు విడువందగును.

—॥ భగందరమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఆమే సంశోధనం లేపో లఙ్ఘనం రక్తమోక్షణమ్॥౩౮౨॥
పక్వే ప్రసశ్చ శస్త్రవిధిః తథా క్షారాగ్నికర్మ చ।
సర్షపాశ్వాలయో ముద్గా విలేపీ జాఙ్గలో రసః ॥౩౮౩॥

పటోలం శిగ్రు వేత్రాగ్రం పత్తూరం బాలమూలకమ్।
తిలసర్షపయోస్తైలం తిక్తవర్గో ఘృతం మధు ॥౩౮౮॥
ఏతత్పథ్యం నరైస్సేవ్యం యథాదోషం భగన్దరే।

తా॥ భగందర వ్రణము పక్వముగాకుండునపుడు వమనవిరేచనరూప సంశోధనము, పట్టువేయుట, లంకణము, రక్తమోక్షణము, ఇవియన్నియును పథ్యములైయుండును.

భగందరము పక్వమైనపుడు శస్త్రకర్మయు, క్షారప్రయోగంబును, అగ్నికర్మయు పథ్యములు. తుటియు ఆవాలు, వరిధాన్యములు, పెసలు, విలేపి, అరణ్యమునసుండు జంతువులమాంసరసములు, పొట్లకాయలు, మునగకాయలు, పేముచిగురు, పొన్నగంటికూర, లేతముల్లంగి, నువ్వులనూనె, ఆవనూనె, చేదుకల పదార్థములు, నెయ్యి, తేనె, ఇవియన్నియు భగందరరోగమునందు పథ్యములు కావున ఆయాదోషముల ననుసరించి సేవింపందగును.

—॥ భగందరమునం దపథ్యములు. ॥—

శ్లో॥ విరుద్ధాన్యన్నపానాని విషమాశనమాతపమ్ ॥౩౮౯॥
వ్యాయామం మైధునం యుద్ధం పృష్ఠయానం గురూణి చ।
సంవత్సరం పరిహరేదపి రూఢవ్రణో నరః ॥౩౯౦॥

తా॥ పరస్పర విరుద్ధములగు నన్నపానములు, విషమాశనము (స్వల్పముగనైనను అధికముగనైనను అకాలమునసైనను భుజించుట), ఎండలో నుండుట, దేహపరిశ్రమ జేయుట, సంభోగము జేయుట, యుద్ధము జేయుట, ఏనుగులు గుఱ్ఱములు మున్నగు వాహనములపైనెక్కి సవారిచేయుట, అజీర్ణకరములగు పదార్థముల సేవించుట, వీనినన్నిటిని భగందరవ్రణము మానినను సంవత్సరకాలము వరకు విడచియుండవలెను.

—॥ ఉపదంశరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఛర్దిర్విరేకో ధ్వజమధ్యనాడి
వేధో జలౌకా పరిపాతనఞ్చ।

సేకః ప్రలేపోయవశాలయశ్చ
ధన్వామిషం ముద్గరసో ఘృతాని॥౩౮౭॥
కటిల్లకం శిగ్రుఫలం పటోలం
శాలిఞ్చ శాకం నవమూలకఞ్చ।
తిక్తం కషాయం మధు కూపవారి
తైలఞ్చ హన్యాదుపదంశరోగమ్ ॥౩౮౮॥
అజాక్షీరం యథాజీర్ణం గోధూమమం పథ్యమాచరేత్।

తా॥ వమనవిరేచనకర్మలు, లింగమధ్యమునందు నాడియందు సిరా వ్యధనముజేయుట, జలగల కరిపించి రక్తమోచనముజేయుట, కషాయాదులచే కడుగుట, పట్టువేయుట, యవలు, రాజనంపుబియ్యము, అరణ్యజంతువుల మాంసము, పెసలకట్టు, నెయ్యి, కాకరకాయలు, మునగకాయలు, పొట్లకాయలు, శాలిశాకము, లేతముల్లంగి, తిక్త కషాయ రసములుకల పదార్థములు, తేనె, బావినీళ్లు, నూనె, ఇవియన్నియు నుపదంశరోగమున పథ్యములై యుండును. మఱియు మేకపాలను గోధుమలను కూడ జేర్చి రోగియొక్క జీర్ణ శక్తిననుసరించి ఉపయోగించినయెడ మిక్కిలి ప్రశస్తమైయుండును.

—॥ ఉపదంశరోగమునందపథ్యములు. ॥—

శ్లో॥ దివానిద్రాం మూత్రవేగం గుర్వన్నం మైథునం గుడమ్।
ఆయాసమమ్లం తక్రఞ్చ వర్జయే దుపదంశకే ॥౩౮౯॥

తా॥ పగలునిదురించుట, మూత్రవేగమును నిరోధించుట, అజీర్ణకరమగు నన్నము, సంభోగము, బెల్లము, శరీరమునకు శ్రమనుకల్గించుపనులజేయుట, పుల్లనిమజ్జిగ, వీనినన్నిటిని ఉపదంశరోగమునందు విడువవలెను.

—॥ శూకదోషమునందు పథ్యములు. ॥—

శ్లో॥ లేపో విరేకోఽసృఙ్మోక్షః సర్పిష్పానఞ్చ శాలయః।
యవా జాఙ్గలమాంసాని ముద్గయూషం కటిల్లకమ్॥౩౯౦॥

పటోలం శిగ్రు కర్కోటం పత్తూరం బాలమూలకమ్।
వేత్రాగ్రమాషాఢఫలం దాడిమం సైన్ధవం వచా॥౩౯-౧॥
కూపోదకం గన్ధసారః కస్తూరీ హిమవాలుకా।
తిక్తం కషాయం తైలఞ్చ స్యాత్పథ్యం శూకదోషిణామ్॥

తా॥ ఔషధములను బూయుట, విరేచనము,రక్తమోచనము జేయుట, నెయ్యిత్రాగుట, రాజనములబియ్యము, గోవలు, జాంగల జంతువుల మాంసములు, పెసలకట్టు, కాకరకాయలు, పొట్లకాయలు, మునగకాయలు, దోసకాయలు, పొన్నగంటికూర, లేతముల్లంగి, పేముచిగురు, ఆషాఢఫలము, దానిమ్మపండ్లు, సైంధవలవణము, వస, బావినీళ్ళు, చందనము, కస్తూరి, పచ్చకప్పురము, తిక్త కషాయ రసములుకల సకలపదార్థములు, నూనె, ఇవియన్నియు శూకదోషమునందు పథ్యములు.

—॥ శూకదోషమునం దపథ్యములు. ॥—

శ్లో॥ మూత్రవేగం దివానిద్రాం వ్యాయామం మైథునంగుడమ్॥
విదాహి గురు తక్రం చ శూకదోషీ పరిత్యజేత్॥౩౯-౩॥

తా॥ మూత్రవేగమునునిరోధించుట, పవటియందు నిదురించుట, సంభోగము జేయుట, బెల్లమును విదాహకరములగు పదార్థములను గురుపదార్థములను భుజించుట, మజ్జిగ, ఇవి యన్నియు శూకదోషమను రోగమునందు అపథ్యములుకావున సేవింపదగవు.

—॥ కుష్ఠరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ పక్షాత్పక్షాచ్ఛర్దనాని మాసాన్మాసాద్విరేచనమ్।
నస్యం త్ర్యహాత్త్రియహాన్మాసాత్షష్ఠేషష్ఠేఽస్రమోక్షణమ్॥
సర్పిస్సేపశ్చిరోత్పన్నా యవగోధూమశాలయః।
ముద్గాఢకీమసూరాశ్చ మాక్షికం జాఙ్గలామిషమ్॥౩౯-౪॥

ఆషాఢఫలవేత్రాగ్రపటోలం బృహతీఫలమ్।
కాకమాచీ నిమ్బపత్రం లశునం హిలమోచికా ॥౧౯౬॥
పునర్నవా మేషశృఙ్గీ చక్రమర్దదళాని చ।
భల్లాతకం పక్వతాలం ఖదిరశ్చిత్రకో వరా ॥౧౯౭॥
జాతీఫలం నాగపుష్పం కుఙ్కుమం ప్రతతిం హవిః।
కోశాతకీ కరఞ్జా చ తిలసర్షపనిమ్బజమ్॥౧౯౮॥
తైలం తథేఙ్గుదోత్థఞ్చ లఘూన్యన్యాని యాని చ।
స్నేహాస్సరలదేవాహ్వా శింశపాగురుసమ్భవాః ॥౧౯౯॥
మూత్రాణి గోఖరోష్ట్రాశ్వమహిషీజాని యాని చ।
కస్తూరీ గన్ధసారశ్చ తిక్తాని క్షారకర్మ చ ॥౨౦౦॥
యథాదోషం సమస్తాని పథ్యాన్యేతాని కుష్ఠినామ్।

తా॥ పక్షమునకొకసారి వమనమును, మాసమునకొకసారి విరేచనమును, మూడేసి దినములకొకసారి నస్యమును, ఆరుమాసములకొకసారి రక్తమోచనమును జేయుట కుష్ఠరోగసామాన్యముగ పథ్యమైయుండును. మఱియు నేతినిబూయుట, పాతవియగు యవలు, గోధుమలు, రాజనములు, పెసలు, కందులు, చిరుసెనగలు, తేనె, జాంగలజంతువుల మాంసములు, ఆషాఢఫలము, పేముచిగురు, పొట్లకాయలు, ములకకాయలు, కాచికూర, వేపాకు, ఉల్లిగడ్డలు, హిలమోచికయను శాకము (ఇయ్యది కుష్ఠహారంబును కఫపిత్తహారంబులైన స్వనామప్రసిద్ధశాకము), గలిజేరు, ఒద్దికూర, తగిరిసపుఆకు, జీడిగింజలు, తాటిపండు, చంద్ర, చిత్రమూలము, త్రిఫలములు, జాజికాయలు, నాగకేసరములు, కుంకుమపువ్వు, ప్రాతనెయ్యి, బీరకాయలు,కానుగనూనె, నువ్వులనూనె, ఆవనూనె, వేపనూనె, గారకాయలనూనె, శీఘ్రముగ జీర్ణములగు పదార్థములు, తెగడ, దేవదారు, ఇరుగుడు, అగరు వీనివలన సిద్ధములైన తైలములు, ఆవులు గాడిదెలు ఒంటెలు గుఱ్ఱములు ఎనుములు వీనిమూత్రములు, కస్తూరి,

చందనము, చేదుకల సకల పదార్థములు, క్షౌరకర్మ, ఇవి యన్నియునుకూడ కుష్ఠరోగమునందు పథ్యములుకావున ఆయాదోషముల ననుసరించి సేవింపదగును.

—॥ కుష్ఠరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ పాపాత్మకం కర్మ కృతఘ్నతాఞ్చ
నిన్దాం గురూణామపి ఘర్షణఞ్చ।
విరుద్ధపానాశనమహ్ని నిద్రాం
చణ్డాంశుతాపం విషమాశనఞ్చ ॥౪౦౧॥
స్వేదో వ్యవాయం వమివేగమిక్షు
వ్యాయామమన్లాని తిలాంశ్చ మాషాన్।
గురుద్రవఞ్చాపి నవాన్నభోజనం
విదాహి విష్టమ్భిచ వాస్తుమూలకమ్ ॥౪౦౨॥
విన్ధ్యాద్రిసహ్యాద్రిసరిజ్జలఞ్చ
ప్రోక్తం హి కుష్ఠామయినామపథ్యమ్।
అనూపమాంసం దధి దుగ్ధమద్యం
గుడఞ్చ కుష్ఠామయినస్త్యజేయుః ॥౪౦౩॥

తా॥ పాపకృత్యముల జేయుట, కృతఘ్నత్వము (ఒరులు జేసినయుపకారమును మరచుట), గురువులనిందించి ధిక్కరించుట, పరస్పరవిరుద్ధములగు నన్నపానముల సేవించుట, పగటియందు నిదురించుట, ఎండలోనుండుట, విషమాశనము (అకాలమునందును తానుభుజించు పరిమితికి న్యూనాధికముగను భుజించుట), చెమటబుట్టించుట, సంభోగముజేయుట, వమనవేగమును నిరోధించుట, చెఱకురసమును ద్రాగుట, దేహపరిశ్రమజేయుట, పులుపుకల పదార్థముల సేవించుట, నువ్వులు, మినుములు, గురుపదార్థములు, ద్రవపదార్థములు, క్రొత్తబియ్యపు అన్నము, విదాహకరంబులును మలమును బంధించునవియు

నగు పదార్థములు, చక్రవర్తికూర, ముల్లంగి, వింధ్యపర్వతముననుండియు సహ్యాపర్వతముననుండియు ప్రవహించు నదులయొక్క జలము, జలప్రాంత మునందు జంతువులమాంసములు, పెరుగు, పాలు, మద్యము, బెల్లము, ఇవి యన్నియు కుష్ఠరోగమునం దపథ్యములు కావున సేవింపందగవు.

— శీతపిత్తోదర్దకోఠరోగములయందు పథ్యములు. —

శ్లో॥ ఛర్దిర్విరేచనం లేపోఽసృఙ్మోక్షో జీర్ణశాలయః ।
జాఙ్గలైరామిషైర్ముద్గైర్మసూరైర్వా కృతో రసః ॥ ౪౦౪॥
కర్కోటకం కారవేల్లం శిగ్రు మూలకపోతికా ।
శాలిఞ్చశాకం వేత్రాగ్రం దాడిమం త్రిఫలా మధు ॥
కటుతైలం తప్తనీరం పిత్తశ్లేష్మహరాణి చ ।
కటుతిక్తకషాయాణి సర్వాణీతి గణస్సఖా ॥ ౪౦౬॥
శీతపిత్తోదర్దకోఠరోగిణాం పథ్యమీరితమ్ ।

తా॥ వమనవిరేచనములు, ఔషధాదులబూయుట, రక్తమోక్షణము, ప్రాతవిమగువడ్లు, అరణ్యముననుండు జంతువులమాంసముచేనైనను, పెసలచే నైనను, చిరుసెనగలచేనైనను చేయబడినరసములు, దోసకాయలు, కాకరకాయలు, మునగకాయలు, ముల్లంగి, శాలిశాకము, పేముచిగురు, దానిమ్మపండ్లు, త్రిఫలములు, తేనె, ఆవనూనె, వేడినీళ్లు, పిత్తకఫములహరించు నానావిధ వస్తువులు, కటుతిక్త కషాయరసములుకల సకల పదార్థములు, ఇవియన్నియు శీతపిత్తము ఉదర్దము కోఠము అను నీ రోగములయందు పథ్యములైయుండును.

— శీతపిత్తోదర్దకోఠములయం దపథ్యములు. —

శ్లో॥ క్షీరేక్షుజాతా వివిధా వికారా
మత్స్యోదకానూపభవామిషాణి ।
నవీనమద్యం వమివేగధారణం
ప్రాగ్దక్షిణా శాపవనోఽహ్ని నిద్రా ॥ ౪౦౭॥

స్నానం విరుద్ధాశనమాతపశ్చ
స్నిగ్ధం తథామ్లం మధురం వ్యవాయః ।
గుర్వన్నపానాని చ శీతపిత్త
కోఠామయోదర్దవతాం విషాణి॥ ౮౦॥

తా॥ పాలనైనను చెఱుకు రసమునైననుచేర్చి చేయబడిన నానావిధ పదార్థములు, మత్స్యములు, ఉదకమునందును జలప్రాంతమునందును జనించిన జంతువులమాంసములు, నూతనమైన మద్యము, వాంతియొక్క వేగమును నిరోధించుట, తూర్పుననుండియు దక్షిణముననుండియు వీచునట్టిగాలిని సేవించుట, పవటియందు నిదురించుట, స్నానము జేయుట, పరస్పరవిరుద్ధములగు నన్నపానముల సేవించుట, ఎండలోనుండుట, స్నిగ్ధంబులును పులుపుకల్గినవియు మధురంబులునగు పదార్థముల సేవించుట, స్త్రీసంభోగము, అజీర్ణకరములగు నన్నపానములు, ఇవియన్నియు శీతపిత్తము ఉదర్దము కోఠము అను నీరోగములయందు అపథ్యములుకావున సేవింపందగవు.

## —॥ అమ్లపిత్తరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఊర్ధ్వగే వమనం పూర్వం అధోగే చ విరేచనమ్ ।
సర్వత్రానశనం పశ్చాచ్ఛిన్నరూహాశ్చాపి శాలయః ॥౮౧॥
యవగోధూమముద్గాశ్చ పురాణా జాఙ్గలా రసాః ।
జలాని తప్తశీతాని శర్కరా మధుసక్తవః ॥౮౨॥
కర్కోటకం కారవేల్లం పటోలం హిలమోచికా ।
వేత్రాగ్రం వృద్ధకూశ్మాణ్డం రమ్భాపుష్పఞ్చవాస్తుకమ్ ॥
కపిత్థం దాడిమం ధాత్రీ తిక్తాని సకలాని చ ।
పానాన్నాని సమస్తాని కఫపిత్తహరాణి చ ॥౮౩॥
అమ్లపిత్తామయే నిత్యం సేవితవ్యాని మానవైః ।

తా॥ అమ్లపిత్తము ఊర్ధ్వముగ వెడలునెడ వమనంబును, అధోమార్గమున వెడలినచో విరేచనంబును, రెండుమార్గములనుండి వెడలెనేని లంకణంబును తొలుత జేయించి పిదప నిరూహ వస్తికర్మ జేయందగును. మఱియు ప్రాతవి యగు వడ్లు, యవలు, గోధుమలు, పెసలు, అరణ్యముననుండు జంతువుల మాంసరసములు, కాగిచల్లారిన నీళ్ళు, చక్కెర, తేనె, సత్తుపిండి, దోసకాయలు, కాకరకాయలు, పొట్లకాయలు, హిలమోచికయను స్వనామప్రసిద్ధ శాకము, వేముచిగురు, గుమ్మడిపండు, అరటిపువ్వు, చక్రవర్తికూర, వెలగ పండ్లు, దానిమ్మపండ్లు, ఉసిరికకాయలు, తిక్తరసముకల నానావిధ పదార్థములు, కఫపిత్తముల హరించు నానావిధ అన్నపానములు, ఇవియన్నియును అమ్లపిత్తరోగసామాన్యముగ పథ్యములై యుండును. కావున సేవింపందగును.

—॥ అమ్లపిత్తరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ వమివేగం తిలాన్మాషాన్ కులుత్థాం స్తైలభక్షణమ్॥౪౧౩॥
అజాదుగ్ధం చ ధాన్యామ్లం లవణాని కటూని చ।
గుర్వన్నం దధి మత్స్యం చ వర్జయేదమ్లపిత్తవాన్॥౧౪౪॥

తా॥ వాంతిని బైటవెడలనియ్యక అడ్డగించుట, నువ్వులు, మినుములు, ఉలవలు, నూనె, మేకపాలు, ధాన్యామ్లము (పులిసిన కుడితినీళ్ళు), లవణరసంబును కటురసంబునుకల సకలపదార్థములు, అజీర్ణకరమగు నన్నము, పెరుగు, మత్స్యములు, వీనినన్నిటిని అమ్లపిత్తముకలవాడు విడువవలెను.

—॥ విసర్పరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేకో వమనం లేపో లఙ్ఘనం రక్తమోక్షణమ్।
పురాణయవగోధూమకఙ్గుషష్టికశాలయః॥౪౧౫॥
ముద్గా మసూరాశ్చణకాః తువర్యో జాఙ్గలో రసః।
నవనీతం ఘృతం ద్రాక్షా దాడిమం కారవేల్లకమ్॥౪౧౬॥

వేత్రాగ్రం కులకం ధాత్రీ ఖదిరో నాగకేసరమ్ ।
హ్రీబేరకం ముస్తకే చ తిక్తాని సకలాన్యపి ॥౮౧౭॥
యథాదోషం పథ్యమిదం సేవితవ్యం విసర్పిభిః ।

తా॥ విరేచనము, వమనము, పట్టువేయుట, లంకణము, రక్తమోచనము, ప్రాతవియగు యవలు, గోధుమలు, కొఱ్ఱలు, అరువదినాళ్ళ సంబావులు, రాజనములు, పెసలు, చిరుసెనగలు, సెనగలు, కందులు, జాంగలజంతువుల మాంసరసము, వెన్న, నెయ్యి, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, కాకరకాయలు, పేముచిగురు, చేదుపొట్లు, ఉసిరికకాయలు, చంద్ర, నాగకేసరములు, కురువేరు, తుంగగడ్డలు, తిక్త రసముకల సకలపదార్థములు, ఇవియన్నియు విసర్పరోగమున పథ్యములైయుండును కావున ఆయాదోషానుసారముగ నుపయోగింపందగు.

—॥ విసర్పరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ వ్యాయామమహ్నా శయనం సురతం ప్రవాతం
క్రోధం శుచం వమనవేగవిధారణఞ్చ।
శాకం విరుద్ధమశనం దధికూర్చికాఞ్చ
సౌవీరకాదికమథో వివిధం కిలాటమ్ ॥౮౧౮॥
గుర్వన్నపానమఖిలం లశునం కులుత్థాన్
మాషాన్తిలాన్ సకలమాంసమజాఙ్గలం చ।
స్వేదం విదాహి లవణామ్లకటూని మద్య
మర్కప్రభా మపి విసర్పగదీ త్యజేత్తత్ ॥౮౧౯॥

తా॥ దేహపరిశ్రమజేయుట, పగటియందునిదురించుట, రతిక్రీడ సలుపుట, అధికమైనగాలిలో నుండుట, కోపము, దుఃఖము, వాంతిని వెలువడనియ్యక నిరోధించుట, ఆకుకూరలు, పరస్పరవిరుద్ధములగు పదార్థముల భుజించుట, దధికూర్చిక (పాలను పెరుగును సమభాగముగజేర్చి కాచబడిన ద్రవ

పదార్థము), సౌవీరకము మున్నగు కాంజికములు, నానావిధములగు కిలాటములు, (పాలలో పెరుగునైనను మజ్జిగనైనను సమభాగముగ జేర్చి కాచినచో అందు ఘనీభవించియుండు జున్ను కిలాట మనంబరగు) అజీర్ణకరంబులగు నానా విధాన్న పానములు, ఉల్లిగడ్డలు, ఉలవలు, మినుములు, నువ్వులు. జాంగల దేశమునందలి జంతువుల మాంసములుదక్క తక్కినమాంసములు, చెమటవెడలించుట, విదాహకరములగు పదార్థములు, లవణ అమ్ల కటురసములుకల సకల పదార్థములు, మద్యము, ఎండ, ఇవి యన్నియు విసర్పరోగమునం దపథ్యములు కావున విడువవలెను.

—॥ విస్ఫోటకరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ విరేచనం ఛర్దనలేపలఙ్ఘనం
పురాతనాః షష్టికశాలయో వా।
ముద్గా మసూరాశ్చణకా మకుష్ఠకాః
ధన్వామిషం గవ్యఘృతం కటిల్లకమ్॥ ౪౨౦॥
వేత్రాగ్రమూషాఢఫలం పటోలకం
జ్యోతిష్మతీ నిమ్బదళాని చన్దనమ్।
తైలం సితాభ్రిం తిలలేపలఙ్ఘనం
వాలశ్చ విస్ఫోటగదాన్వినాశయేత్॥ ౪౨౧॥

తా॥ విరేచనము, వమనము, ఔషధమునుబూయుట, లంకణము, ప్రాతవియగు నరువదినాళ్లసంబావులు, రాజనములు, పెసలు, చిరుసెనగలు, సెనగలు, అడవిపెసలు, జాంగలమాంసములు, ఆవునెయ్యి, కాకరకాయలు, పేముచిగురు, ఆషాఢఫలము, పొట్లకాయలు, జ్యోతిష్మతీలత, వేపాకు, చందనము, తైలము, పచ్చకప్పూరము, నువ్వులనూరిపూయుట, వట్టివేళ్ళు, ఇవి యన్నియు విస్ఫోటరోగమును హరించును కావున పథ్యములైయుండును.

—॥ విస్ఫోటరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ స్వేదంవ్యవాయంవ్యాయామంక్రోధంగుర్వన్నమాతపమ్।
వమివేగం పత్రశాకం ప్రవాతశయనం దివా ॥౪౨౨॥
గ్రామ్యోదకానూపమాంసం విరుద్ధాన్యశనాని చ।
తిలాన్మాషాన్కులుత్థాంశ్చలవణామ్లం కటూని చ॥౪౨౩॥
విదాహి రూక్షముష్ణం చ విస్ఫోటీ పరివర్జయేత్।

తా॥ చెమటబుట్టించుట, సంభోగము జేయుట, దేహమునకు శ్రమ గల్గించుపనుల జేయుట, క్రోధము, అజీర్ణకరమగునన్నమును భుజించుట, ఎండలోనుండుట, వాంతివేగమును నిరోధించుట, ఆకుగూరలదినుట, అధికముగ గాలివీచు స్థలమున శయనించుట, పవటియందు నిదురించుట, గ్రామమునందలి జంతువులయొక్కయు ఉదకమునందలి జంతువులయొక్కయు జలప్రాంతముననుండు జంతువులయొక్కయు మాంసములు, పరస్పర విరుద్ధములగు నాహారపదార్థములు, నువ్వులు, మినుములు, ఉలవలు, లవణ అమ్ల కటు రసములుకల సకలపదార్థములు, విదాహకరంబులును రూక్షంబులును ఉష్ణంబులునైన పదార్థములు, వీనినన్నిటిని విస్ఫోటరోగముకల మనుజులు విడువవలెను.

—॥ మసూరికారోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ పూర్వం లఙ్ఘనవాన్తిరేచనసిరావేధః శశాఙ్కోజ్వలా
జీర్ణాః షష్టికశాలయోఽపి చణకాముద్గామసూరాయవాః।
సర్వేపి ప్రతుదాః కపోతచటకాః కోయష్టిదాత్యూహకా
జీవఞ్జీవశుకాదయోఽపి కులకం కాటిల్లమాషాఢకమ్॥
కర్కోటీ కదలీం చ శిగ్రుగురుచకం ద్రాక్షాఫలం దాడిమం
మేధ్యంబృంహణమన్నపానమఖిలం కోలానిమాషారసాః।
అక్ష్ణోస్సేకవిధా గవేధుమధుకోద్భూతం సుశీతోదకం
శమ్యాకోదరకోశనీరమపివాకర్పూరచూర్ణానిచ ॥౪౨౪॥

పక్వోముద్గరసోఽపి జాఙ్గలరసః శాలిశ్చ శాకం ఘృతం
ధూమాపోగోమయభస్మకుణ్ఠనమథో శేషే వ్రణోక్తాం క్రియామ్।
ఇత్థం సర్వదశావిభాగవిహితం పథ్యం యథా దోషతః
సంయుక్తం సుఖమాతనోతి నితరాం స్యాణాం మసూరీగదే॥

తా॥ మసూరికారోగమునందు తొలుత లంకణము, వమనము, విరేచనము, సిరావ్యధనము, ఈకర్మల జేయుట ఉచితము. మఱియు చంద్రునిబోలె తెల్లనై ప్రాతవియగు, అఱువదినాళ్ల సంబావుల బియ్యము, సెనగలు, పెసలు, చిరుసెనగలు, యవలు, ఈధాన్యవర్గంబును; పావురములు, పిచ్చుకలు, గడ్డికొంగలు, భరతపిట్టలు, వన్నెపులుగులు, చిలుకలు మున్నగు ప్రతుదముల (ముక్కుతో బొడిచి తినునట్టి పక్షుల) మాంసములు, చేదుపొట్ల, కాకరకాయలు, ఆపాఢఫలము, దోసకాయలు, అరటికాయలు, మునగకాయలు, సౌవర్చలలవణము, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, పరిశుద్ధంబులును పుష్టికరంబులునగు నన్నపానములు, రేగుపండ్లు, మినుములు, మాంసరసములు, ఈపదార్థములును; అడవిగోధుమలను తేనెను చన్నీళ్ళలో కలిపిరైనను, ముత్యపుచిప్పలలోనుండు నీళ్ళనైనను, పచ్చకప్పురముతో గలిసిన నీళ్ళనైనను కన్నులలో బోయుటయు; పక్వమైన పెసలకట్టు, అరణ్యముననుండు జంతువుల మాంసరసములు, శాలిశాకము, నెయ్యి, ఈపదార్థంబులును; పొగను పీల్చుటయు, ఆవులపేడచేజేయబడిన పిడకల భస్మమును ఒడలిపైబూయుటయు మసూరికారోగమునందు పథ్యములుగానుండును. మఱియు వ్రణములకు జెప్పినవి యన్నియుకూడ నీవ్యాధియందు పథ్యములైయుండును. ఇత్తెరంగున నాయా దోషములను కాలములను అనుసరించి పథ్యముల సేవించినచో మనుజులకు సుఖముకల్గును.

— మసూరికారోగమునందపథ్యములు. —

శ్లో॥ రతం స్వేదం భ్రమం తైలం గుర్వన్నం క్రోధమాతపమ్।
కట్వమ్లం వేగరోధం చ మసూరీ గదవాంస్త్యజేత్ ॥౪౨॥

తా॥ సంభోగము, చెమటవెడలించుట, సంచరించుట, నూనె, అజీర్ణకరపదార్థములు, క్రోధము, ఎండలోనుండుట, కారము పులుపుగల పదార్థములు, మలమూత్రాదివేగముల నిరోధించుట, ఇవియన్నియు మసూరీరోగమునందు అపథ్యములు కావున విడువందగును.

—॥ క్షుద్రరోగములయందు పథ్యాపథ్యములు. ॥—

శ్లో॥ క్షుద్రరోగేషు సర్వేషు నానారోగానుకారిషు ।
దోషాన్ దూష్యానవస్థాం చ నిరీక్ష్య మతిమాన్ భిషక్॥
తస్య తస్య చ రోగస్య పథ్యాపథ్యాని సర్వశః।
యథాదోషం యథాదూష్యం యథావస్థఞ్చకల్పయేత్ ॥

తా॥ నానావిధములుగ జనించు క్షుద్రరోగములయందు వాతాదిదోషములను రసరక్తాది దూష్యములను వానియవస్థాభేదములను వైద్యుండు జక్కగ బరిశీలించి ఆయాదోషదూష్యావస్థాను సారముగ నాయా క్షుద్రరోగములయందు పథ్యాపథ్యనియమమును జేయందగును.

—॥ ముఖరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ స్వేదో విరేకో వమనం గణ్డూషః ప్రతిసారణమ్ ।
కబలోఽసృక్స్రుతిర్నస్యం ధూమశ్శస్త్రాగ్నికర్మణీ ॥౨౩౦॥
తృణధాన్యం యవా ముద్గాః కులుత్థా జాఙ్గలో రసః ।
బృహతీ పోట్టికా కారవేల్లం పటోలం బాలమూలకమ్ ॥
కర్పూరనీరం తామ్బూలం తప్తామ్బు ఖదిరో ఘృతమ్।
కటుతిక్తా చ వర్గోఽయం మిత్రం స్యాన్ముఖరోగిణామ్ ॥

తా॥ స్వేదనము, వమనవిరేచనములు, గండూషము, ప్రతిసారణము (లవణములను చేదుకల వస్తువులను జేర్చి దన్తములతోముట), కబలగ్రహము, రక్తమును స్రవింపజేయుట, నస్యము, ధూమపానము, శస్త్రకర్మ, అగ్నికర్మ, ఈకర్మలనన్నిటిని జేయుటయు; గునుకు మున్నగు తృణధాన్యములు, యవలు,

పెసలు, ఉలవలు, జాంగలజంతువుల మాంసరసము, పెద్దచేపలు, కాకరకాయలు, పొట్లకాయలు, లేతముల్లంగి, పచ్చకప్పురముతోఁగూడిననీళ్లు, తాంబూలము, వేడినీళ్ళు, చంద్ర, నెయ్యి, కటు తిక్తరసములుకల పదార్థములు, వీనిని సేవించుటయు ముఖరోగములయందు పథ్యములైయుండును.

—॥ ముఖరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ దన్తకాష్ఠం స్నానమమ్లం మత్స్యమానూపమామిషమ్ ।
దధి క్షీరం గుడం మాషం రూక్షాన్నం కఠినాశనమ్ ॥
అధోముఖేన శయనం గుర్వభిష్యన్దకాని చ ।
ముఖరోగేషు సర్వేషు దివానిద్రాఞ్చ వర్జయేత్ ॥౪౩౪॥

తా॥ దన్తధావనము, స్నానము, పులుపుకల పదార్థములు, మత్స్యములు, ఆనూపజంతువుల మాంసములు, పెరుగు, పాలు, బెల్లము, మినుములు, రూక్షమగునన్నము, కఠినములగు పదార్థములదినుట, బోరగిలబరుండుట, అజీర్ణకరంబులును స్రోతస్సుల స్రవింపజేయునవియునగు పదార్థములు, పగటినిద్ర, ఇవియన్నియు ముఖరోగమునందు అపథ్యములుకావున విడువందగును.

—॥ కర్ణరోగమునందు పథ్యములు. ॥—

శ్లో॥ స్వేదో విరేకో వమనం నస్యం ధూమస్సిరావ్యధః ।
గోధూమాశ్శాలయో ముద్గా యవాశ్చ ప్రతనం హవిః ॥
లావో మయూరో హరిణః తిత్తిరిర్వనకుక్కుటః ।
పటోలం శిగ్రు వార్తాకం సునిషణ్ణం కటిల్లకమ్ ॥౪౩౬॥
రసాయనాని సర్వాణి బ్రహ్మచర్యమభాషణమ్ ।
ఉపయుక్తం యథాదోషమిదం కర్ణామయే హితమ్ ॥

తా॥ స్వేదనము, వమనవిరేచనములు, నస్యము, ధూమపానము, సిరావ్యధనము, గోధుమలు, రాజనములు, పెసలు, యవలు, ప్రాతనెయ్యి, లావుకపిట్ట, నెమలి, జింక, తీతువుపిట్ట, అడవికోడి, అను నీజంతువుల మాంసములు,

పొట్లకాయలు, మునగకాయలు, వంకాయలు, నీరుచెంచలికూర, కాకరకాయలు, రసాయనపదార్థములు, ఇవియన్నియును, ఇంద్రియముల నిగ్రహించి సంభోగాదుల విడచియుండుటయు, మౌనమునవలంబించియుండుటయు, కర్ణరోగములయందు పథ్యములైయుండును కావున ఆయాదోషానుసారముగ సేవింపందగును.

—॥ కర్ణరోగములయం దపథ్యములు. ॥—

శ్లో॥ విరుద్ధమన్నపానఞ్చ వేగరోధః ప్రజల్పనమ్ ।
దన్తకాష్ఠం శిరస్స్నానం వ్యవాయం శ్లేష్మలం గురు ॥
కణ్డూయనం తుషారఞ్చ కర్ణరోగీ పరిత్యజేత్ ।

తా॥ పరస్పరవిరుద్ధములగు నన్నపానములు, మలమూత్రాదివేగముల నిరోధించుట, అధికముగ సంభాషించుట, దన్తధావనము జేయుట, తలకు స్నానము జేయుట, సంభోగము జేయుట, కఫముకు వృద్ధినొందించునవియు అజీర్ణకరంబులునగు పదార్థములభుజించుట, చెవిలోగోకుట, మంచునీళ్లు, వీనినన్నిటిని కర్ణరోగముచే బాధింపబడినవాడు విడువవలెను.

—॥ నాసారోగములయందు పథ్యములు. ॥—

శ్లో॥ స్థితిర్నివాతే నిలయే ప్రగాఢోష్ణీషధారణమ్ ॥౨౩౯॥
గణ్డూషో లఙ్ఘనం నస్యం ధూమం ఛర్దిస్సిరావ్యధః।
కటుచూర్ణం ఘ్రాణరన్ధ్రే నిక్షిప్యాన్తః ప్రవేశనమ్ ॥
స్నేహస్స్వేదశ్శిరోఽభ్యఙ్గః పురాణా యవశాలయః ।
కులుత్థముద్గయోర్యూషః గ్రామ్యజాఙ్గలజా రసాః ॥
వార్తాకం కులకం శిగ్రుః కర్కోటం బాలమూలకమ్ ।
లశునం దధి తప్తామ్బు వారుణీ చ కటుత్రయమ్ ॥ ౨౪౨॥
కట్వామ్లలవణాం స్నిగ్ధముష్ణఞ్చ లఘు భోజనమ్ ।
నాసారోగే పీనసాదౌ సేవ్యమేతత్సుఖావహమ్॥౨౪3॥

తా॥ గాలిలేని యింటిలో నివసించుట, తలకు బిగుతుగ గుడ్డకట్టుట, గండూషము చేయుట, లంకణము, నస్యమును పీల్చుట, పొగ ద్రాగుట, వమనము జేయుట, సిరావ్యధనము జేయుట, కారముకలవస్తువుల చూర్ణమును నాసా ద్వారమునను నిచి లోనికిబీల్చుట, స్నేహనము, స్వేదనము, అభ్యంగనము, ప్రాతవియగు యవలు, రాజనములు, ఉలవకట్లు, పెసలకట్టు, గ్రామములయందును అరణ్యప్రదేశమునందునుండు జంతువుల మాంసరసములు, వంకాయలు, చేదుపొట్లకాయలు, మునగకాయలు, దోసకాయలు, లేతముల్లంగి, ఉల్లిగడ్డలు, పెరుగు, వేడినీళ్లు, మద్యము, త్రికటుకములు, కటు, అమ్ల, లవణ రసములుకల పదార్థములు, స్నిగ్ధంబులును ఉష్ణంబులునైన పదార్థములు, శీఘ్రముగ జీర్ణములగు పదార్థములు, ఇవి యన్నియు పీనస మున్నగు నాసారోగములయందు పథ్యములుకావున వీనిని సేవించినచో మిక్కిలి సుఖముకల్గును.

## —నాసారోగములయందపథ్యములు.—

శ్లో॥ విరుద్ధాన్నం దివాస్వప్నమభిష్యంది గురూణి చ ।
స్నానం క్రోధం శకృన్మూత్రవాత వేగాన్ శుచం ద్రవమ్ ॥
భూశయ్యాం చ ప్రయత్నేన నాసారోగీ పరిత్యజేత్ ।

తా॥ పరస్పర విరుద్ధములగు నన్నములు, పగటియందు నిదురించుట, స్రోతస్సుల స్రవింపజేయునవియు అజీర్ణకరంబులునగు పదార్థములు, స్నానము, క్రోధము, మలమూత్రాది వేగముల నిరోధించుట, వ్యసనము, ద్రవపదార్థముల సేవించుట, నేలపై బరుండుట, వీనినన్నిటిని నాసారోగముకల మనుజులు విడువవలెను.

## —నేత్రరోగములయందు పథ్యములు.—

శ్లో॥ ఆశ్చ్యోతనం లఙ్ఘనమఞ్జనఞ్చ
స్వేదో విరేకః ప్రతిసారణఞ్చ ।
ప్రపూరణం నస్యమసృగ్విమోక్షః
శస్త్రక్రియా లేపనమాజ్యపానమ్ ॥౮౪౫॥

సేకో మనోనిర్వృతిరఙ్ఘ్రిపూజా
ముద్గా యవా లోహితశాలయశ్చ ।
లావో మయూరో వనకుక్కుటశ్చ
కూర్మః కులిఙ్గోఽపి కపిఞ్జలాశ్చ ॥౨౨౬॥
క్షౌమ్యం హవిర్వన్యకులుత్థయూషః
పేయా విలేపీ లశునం పటోలమ్ ।
వార్తాకకర్కోటకకారవేల్లం
సపీనమోచం నవమూలకఞ్చ ॥౨౨౭॥
పునర్నవా మార్కవకాకమాచీ
పత్తూరశాకాని కుమారికా చ।
ద్రాక్షా చ కుస్తుమ్బురుమాణిమన్థం
లోధ్రం వరా క్షౌద్రముపానహౌ చ ॥౨౨౮॥
నారీపయశ్చన్దనమిన్దుఖణ్డం
తిక్తాని సర్వాణి లఘూని వాపి ।
విజానతా పథ్యమిదం ప్రయుక్తం
యథామలం నేత్రగదాన్నిహన్తి॥౨౨౯॥

తా॥ ఆశ్చ్యోతనము (కన్నులదెరచి రెండంగుళముల పొడవునుండి యౌషధబిందువులను కంటిలోవిడచుట), లంకణము, అంజనము, స్వేదనము, విరేచనము, ప్రతిసారణము (కన్నులయందు చూర్ణాదులనునిచి శుభ్రపరచుట), ప్రపూరణము(కన్నులయందౌషధముచే నిండించుట), నస్యము, రక్తమోక్షము, శస్త్రకర్మ, పట్టువేయుట, నెయ్యిత్రాగుట, కషాయాదులచే దడుపుట, మనసున చింతలేకుండుట, అంఘ్రిపూజ, పెసలు, యవలు, ఎఱ్ఱవరివడ్లు, లావుకపిట్ట, నెమలి, అడవికోడి, తాబేలు, ఊరబిచ్చుక, చాతకము, ఈజంతువుల మాంసములు, కుండలోమాగిననెయ్యి, అడవిలోపండిన ఉలవలచే సిద్ధమైనకట్టు,

పేయ (మెతుకులు లేకుండ కాచబడిన గంజి), విలేపి (మెతుకులతో గూడిన గంజి), ఉల్లిగడ్డలు, పొట్లకాయలు, వంకాయలు, దోసకాయలు, కాకర కాయలు, లేత అరటికాయలు, లేతముల్లంగి, గలిజేరు, గుంటకలగర, కాచి కూర, పొన్నగంటికూర, కలబంద, ద్రాక్షపండ్లు, దనియాలు, సైంధవలవ ణము, లొద్దుగు, త్రిఫలములు, తేనె, పాదుకల దొడిగి సంచరించుట, చను బాలు, చందనము, పచ్చకప్పురము, చేదుకల సకల పదార్థములు, చులకనగ జీర్ణములగు పదార్థములు, ఇవియన్నియు నేత్రరోగములయందు పథ్యములు. కావున ఆయాదోషముల ననుసరించి సేవింపందగును.

—॥ నేత్రరోగములందపథ్యములు. ॥—

శ్లో॥ క్రోధం శుచం మైథునమశ్రువాయు
విణ్మూత్రనిద్రావమివేగరోధమ్ ।
సూక్ష్మేక్షణం దన్తవిఘర్షణఞ్చ
స్నానం నిశాభోజనమాతపఞ్చ॥౧౫౦॥

ప్రజల్పనం చ్ఛర్దనమమ్బుపానం
మధూకపుష్పం దధి పత్రశాకమ్ ।
కాలిన్దపిణ్యాకవిరూఢకాని
మత్స్యం సురా మాంసమజాఙ్గలఞ్చ॥ ౧౫౧॥

తామ్బూలమమ్లం లవణం విదాహి
తీక్ష్ణం కటూష్ణం గురు చాన్నపానమ్ ।
నరో న సేవేత హితాభిలాషీ
సర్వప్రకారేషు దృగామయేషు॥౧౫౨॥

తా॥ క్రోధము, దుఃఖము, స్త్రీసంభోగము, కన్నీళ్లు, వాతము, పురీ షము, మూత్రము, నిద్ర, వాంతి, వీనివేగములనిరోధించుట, మిక్కిలిసూక్ష్మ ములగు నాకారములుకల వస్తువులజూచుట, దంతధావనముచేయుట, స్నాన

ముచేయుట, రాత్రులయందు భుజించుట, ఎండనుచూచుట, అధికముగ మాట్లాడుట, వమనము జేయుట, నీళ్ళనధికముగ ద్రాగుట, ఇప్పపువ్వులు, పెరుగు, ఆకుగూరలు, పుచ్చకాయలు, గానుగపిండి, మొలకలెత్తిన ధాన్యముచే సిద్ధమైనయన్నము, మత్స్యములు, మద్యము, జాంగలజంతువులు దక్క తక్కిన జంతువులమాంసము, తాంబూలము, పులుపుకలపదార్థములు, ఉప్పు, విదాహకరంబును తీక్ష్ణంబును కటురసంబును ఉష్ణంబునగు నన్నము, అజీర్ణకరములగు నన్నపానములు, వీనినన్నిటిని సకల నేత్రరోగములయందును ఆరోగ్యమునుగోరు మనుజుండు విడువవలెను.

## శిరోరోగమునందు పథ్యములు.

శ్లో॥ స్వేదో నస్యం ధూమపానం విరేకో
లేపస్సేకో లఙ్ఘనం శీర్షవస్తిః।
రక్తోన్ముక్తిర్వహ్నికర్మోపనాహౌ
జీర్ణం సర్పిశ్శాలయష్షష్టికాశ్చ॥౪౫౩॥
యూషం దుగ్ధం ధన్వమాంసం పటోలం
శిగ్రుం ద్రాక్షాం వాస్తుకం కారవేల్లమ్।
ఆమ్రం ధాత్రీ దాడిమం మాతులుఙ్గం
తైలం తక్రం కాఞ్జికం నాళికేరమ్॥౪౫౪॥
పథ్యా కుష్ఠం భృఙ్గరాజః కుమారీ
ముస్తోశీరం చన్ద్రికా గన్ధసారః।
కర్పూరం చ ఖ్యాతిమానేష వర్గః
సేవ్యో మర్త్యైశ్శీర్షరోగే యథాస్వమ్॥౪౫౫॥

తా॥ శరీరమున చెమటబుట్టించుట, నస్యము, పొగద్రాగుట, విరేచనము, తలకు పట్టుబెట్టుట, కషాయాదులచే దడుపుట, లంకణము, శిరోవస్తికర్మ, రక్తమోచనము జేయుట, అగ్నికర్మ, కట్టుగట్టుట, ప్రాతనెయ్యి, రాజ

నంపుబియ్యము, అరువదినాళ్ల సంబావుల బియ్యము, యూష (మెతుకులు లేకుండ కాచబడినగంజి), పాలు, అరణ్యమునందుండు జంతువులమాంసము, పొట్లకాయలు, మునగకాయలు, ద్రాక్షపండ్లు, చక్రవర్తికూర, కాకర కాయలు, మామిడికాయలు, ఉసిరికకాయలు, దానిమ్మకాయలు, మాదీఫల ములు, నూనె, మజ్జిగ, కాంజికము, టెంకాయలు, కరకకాయలు, చెంగల్వ కోష్టు, గుంటకలగర, కలబంద, తుంగగడ్డలు, వట్టివేళ్లు, వెన్నెలలోనుండుట, గంధమును బూసికొనుట, పచ్చకప్పురము, ఇవియన్నియు శిరోరోగమునందు పథ్యములు.

## శిరోరోగమునందపథ్యములు.

శ్లో॥ క్షుజ్జృమ్భామూత్రబాష్పనిద్రావిడ్వేగధారణమ్ ।
దుష్టనీరం విరుద్ధాన్నం సరిత్సు చ నిమజ్జనమ్ ॥౭౫౬॥
దన్తకాష్ఠం దివానిద్రాం శిరోరోగీ పరిత్యజేత్ ।

తా॥ తుమ్ములు, ఆవలింతలు, మూత్రము, కన్నీళ్లు, నిద్ర, మలము, వీనివేగములనిరోధించుట, చెడిననీళ్లను ద్రాగుట, పరస్పరవిరుద్ధములగుపదార్థ ములసేవించుట, నదులయందు స్నానముజేయుట, దంతధావనము, పగటి యందు నిదురించుట, వీనినన్నిటిని శిరోరోగముకల మనుజుండు విడువవలెను.

## స్త్రీరోగములయందు పథ్యాపథ్యములు.

శ్లో॥ యత్పథ్యం యదపథ్యఞ్చ రక్తపిత్తేషు కీర్తితమ్ ॥౭౫౭॥
ప్రదరేఽపి యథాదోషం తత్తు నారీ భజేత్త్యజేత్ ।
వాతవ్యాధివతాం పథ్యం అపథ్యఞ్చ యదీరితమ్ ॥౭౫౮॥
యోనివ్యాపత్సు సర్వాసు తద్విద్యాచ్చ యథామలమ్।

తా॥ రక్తపిత్తవ్యాధియందు జెప్పబడిన పథ్యములన్నియు ప్రదరరో గమునందు పథ్యకరంబులును, అందుజెప్పబడిన అపథ్యములన్నియు నపథ్య కరంబులునైయుండును కావున ప్రదరరోగముకల స్త్రీలు ఆయాదోషాను

సారముగ ర క్తపి త్తమునందలి యపథ్యములనన్నిటిని విడచి పథ్యములమాత్రము సేవించవలెను.

మఱియు వాతవ్యాధియందు జెప్పబడిన పథ్యములు యోనివ్యాపత్తునందు పథ్యములుగా గ్రహింపందగును. అందు జెప్పబడిన యపథ్యములు యోనివ్యాపత్తునం దపథ్యములు కావున విడువందగును.

—॥ గర్భవతులగు స్త్రీలకు పథ్యములు. ॥—

శ్లో॥ శాలయష్షష్టికా ముద్గా గోధూమా లాజసక్తవః ॥౭౫॥
నవనీతం ఘృతం క్షీరం రసాలా మధు శర్కరా ।
పనసం కదలం ధాత్రీం ద్రాక్షామ్లం స్వాదుశీతలమ్॥౭౬॥
కస్తూరీ చన్దనం మాలా కర్పూరమనులేపనమ్ ।
చన్ద్రికా స్నానమభ్యఙ్గో మృదుశయ్యా హిమానిలః ॥
సన్తర్పణం ప్రియా వాచో విహారాశ్చ మనోరమాః ।
ప్రియంకరశ్చాన్నపానం గర్భిణీభ్యోహితం సదా ॥౭౭॥

తా॥ రాజనములు, అరువదినాళ్ళసంబావులు, పెసలు, గోధుమలు, పేలాలసత్తుపిండి, వెన్న, నెయ్యి, పాలు, రసాల ( పెరుగుతో జేరినసత్తు పిండి ), తేనె, చక్కెర, పనసపండ్లు, అరటికాయలు, ఉసిరికెకాయలు, ద్రాక్షపండ్లు, పులుపుకల్గినవియు మధురంబులును శీతలంబులునైన పదార్థములు, కస్తూరి, చందనము, పుష్పమాలికలు, పచ్చకప్పురమును బూయుట, వెన్నెలలోనుండుట, స్నానము, అభ్యంగనము, మెత్తనైనశయ్య, చల్లనిగాలి, సన్తర్పణము, (శరీరమునకు పుష్టిని కలుగజేసెడి యాహారాదులు), మనసునకు ప్రియములగు మాటలు, రమ్యములగు విహారములు, ఇంపైన యన్నపానములు, ఇవియన్నియు గర్భవతులగు స్త్రీలకు నెల్లప్పుడును హితకరములై యుండును.

—( గర్భిణీస్త్రీలకు అపథ్యములు. )—

శ్లో॥ స్వేదనం వమనం క్షారం కలహం విషమాశనమ్ ।
అసాత్మ్యం నక్తసఞ్చారం చౌర్యం చాప్రియదర్శనమ్ ॥
అతివ్యవాయమాయాసం భారం ప్రావరణం గురు ।
అకాలే జాగరం స్వప్నం కఠినోత్కటకాసనమ్ ॥౪౬౪॥
శోకక్రోధభయోద్వేగశ్రద్ధావేగవిధారణమ్ ।
ఉపవాసాధ్వతీక్ష్ణోష్ణగురువిష్టమ్భిభోజనమ్ ॥౪౬౫॥
రక్తనిస్సారణం శ్వభ్రకూపేక్షా మద్యమామిషమ్ ।
ఉత్తానశయనం యచ్చ స్త్రియో నేచ్ఛన్తి తత్త్యజేత్ ॥
తథా రక్తస్రుతిం వస్తిం శుద్ధిమామాసతోఽష్టమాత్ ।
ఏభిర్గర్భస్స్రవేదామః కుక్షౌ శుష్యేన్మ్రియేత వా ॥౪౬౬॥
భజేన్న నిత్యం తిక్తామ్లకటూష్ణకషాయకాన్ ।
వాతలైశ్చ భవేద్గర్భః కుబ్జాన్ధజడవామనః ॥౪౬౭॥
పిత్తలైః ఖలతీ పిఙ్గశ్శ్విత్రీ పఙ్గుః కఫాత్మభిః ।
అపథ్యమిదముద్దిష్టం గర్భిణీనాం మహర్షిభిః ॥౪౬౮॥

తా॥ స్వేదనము, వమనము, క్షారము, కలహము, అకాలమునందును న్యూనాధికముగను భుజించుట, అసాత్మ్యములగు పదార్థముల భుజించుట, రాత్రివేళల సంచరించుట, దొంగిలించుట, తనకిష్టముగాని వస్తువులజూచుట, అధికముగ సంభోగముచేయుట, శరీరమునకాయాసమును గల్గించుపనుల జేయుట, భారమునుమోచుట, మిక్కిలి భారముగానుండు ఉత్తరీయ్యమును ధరించుట, అకాలమున (రాత్రులయందు) నిదురమేల్కొనియుండుట, పగలు నిద్రజెందుట, కఠినంబును ఉన్నతంబునగు బల్లపై గూర్చునియుండుట, దుఃఖము, క్రోధము, భయము, చింత, శ్రద్ధ, అను నీమైదిటియొక్క వేగమును నిరోధించుట, ఉపవాసముజేయుట, త్రోవనడచుట, తీక్ష్ణంబును, ఉష్ణంబును, అజీర్ణకరంబును, మలమును బంధించునదియునగు నన్నమును భుజిం

చుట, రక్తమోచనముజేయుట, లోతుగలదొనలను బావులను జూచుట, మద్యపానము జేయుట, మాంసముతినుట, వెలికిలబరుండుట, ఇవి యన్నియును గర్భిణీ స్త్రీలకు పథ్యములుగావు కావున విడువందగును. మఱియు అట్టి గర్భిణీ స్త్రీలకు ఇష్టములేని విషయముల నన్నిటిని విడువవలెను.

మఱియు గర్భిణీస్త్రీలకు రక్తమోచనమును, ఎనిమిదవనెలకుమున్న వస్తికర్మను వమనవిరేచనములను జేయించినచో గర్భముననుండు శిశువు పరిపాకమునొందకయే బైటవెడలును; లేక గర్భమునందే శోషించును; లేక మరణమునైననొందును; కావున నెనిమిదవమాసము వచ్చునందాక పై జెప్పబడిన పనులజేయందగదు. మఱియు తిక్త అమ్ల కటు ఊషణ కషాయ రసములుకల సకల పదార్థముల నెల్లప్పుడు సేవింపందగదు. వాతమును వృద్ధినొందించు నాహారముల సేవించు నెడ శిశువునకు కుబ్జత్వము(గూని) గ్రుడ్డితనము, జడత్వము, గుజ్జారితనము ఇవి సంభవించును. పిత్తమును వృద్ధినొందించు నాహారాదులచేత బట్టతలయు పింగళవర్ణంబునుకల్గును. కఫమును వృద్ధినొందించు నాహారాదులచేత చిత్రవర్ణంబును కుంటితనంబును కల్గును. కావున అట్టి యాహారాదుల నొకప్పుడును గర్భవతులు సేవింపదగదు. ఇత్తెరంగున ఋషివర్యులచే గర్భిణీ స్త్రీలకు పథ్యము నిర్ణయింపంబడియె.

## —॥ ప్రసవించిన స్త్రీలకు పథ్యములు. ॥—

శ్లో॥ లఙ్ఘనఞ్చ మృదుస్స్వేదో గర్భకోష్ఠవిశోధనమ్ ।
అభ్యఞ్జనం తైలపానం కటుతిక్తోష్ణ సేవనమ్॥ ౪౨౦॥
దీపనం పాచనం మద్యం పురాణాష్షష్టిశాలయః ।
కులుత్థోలశునం శిగ్రు వార్తాకుశ్చాలమూలకమ్॥౪౨౧॥
పటోలం మాతులుఙ్గఞ్చ తామ్బూలం దాడిమద్వయమ్ ।
శ్లేష్మానిలఘ్నం సప్తాహాత్పరం కిఞ్చిచ్చ బృంహణమ్ ॥
ద్వాదశాహాత్పరం మాంసం సార్ధమాసాచ్చ యన్త్రిణమ్।
భోజనాదీం స్త్యజేదేతత్ప్రసూతాపథ్యమీరితమ్ ॥౪౨౩॥

తా॥ లంకణము, మృదువైన స్వేదనము, గర్భాశయమును శోధన చేయుట, అభ్యంగనము, తైలమును పానము జేయుట, కటురసంబును తిక్తరసంబును ఉష్ణంబునైన యాహారమును భుజించుట, అగ్నిని దీపింపజేయునవియు భుజించినపదార్థముల జీర్ణింపజేయునవియునగు నాహారాదుల సేవించుట, మద్యమును పానము జేయుట, ప్రాతవియగు అరువదినాళ్ల సంబావుల బియ్యము, ఉలవలు, ఉల్లిగడ్డలు, మునగకాయలు, వంకాయలు, లేతముల్లంగి, పొట్లకాయలు, మాదీఫలములు, తాంబూలము, పుల్లదానిమ్మకాయలు, తియ్యదానిమ్మకాయలు, కఫవాతముల హరించు సకల పదార్థములు, ఇవి యన్నియు ప్రసవించిన స్త్రీలకు పథ్యములై యుండును.

మఱియు ప్రసవించిన పిమ్మట నెనిమిదవదినము మొదలు జేసి శరీరమునకు క్రొంచెముగ పుష్టినిగల్గించు పదార్థముల సేవించుటయు, పండ్రెండవదినము మొదలు జేసి మాంసమునుదినుటయు, నెలమీద పదునైదుదినములుగడచిన పిదప భోజనాదివిషయమైన నియమముల వదలియుండుటయు ప్రసవించిన స్త్రీలకు పథ్యములుగామండును.

—॥ ప్రసవించిన స్త్రీలకు అపథ్యములు. ॥—

శ్లో॥ శ్రమో నస్యం రక్తముక్తిర్మైధునం విషమాశనమ్ ।
విరుద్ధాన్నం వేగరోధమసాత్మ్యమహితాశనమ్ ॥౮౭౫॥
దివానిద్రామభిష్యన్ది విష్టమ్భి గురుభోజనమ్ ।
వర్గోఽయం వర్జితో నిత్యం ప్రసూతాభ్యో భిషగ్వరైః॥
సూతికాఖ్యేషు రోగేషు వాతశ్లేష్మోద్భవేషు చ ।
తత్ర రోగానుకల్పేన పథ్యాపథ్యం వినిర్దిశేత్ ॥౮౭౬॥

తా॥ శ్రమనుకల్గించు పనుల జేయుట, నస్యము, రక్తస్రావము జేయుట, సంభోగము జేయుట, న్యూనాధికముగ భుజించుట, పరస్పర విరుద్ధములగు నన్నములభుజించుట, మలమూత్రాది వేగముల నిరోధించుట, అసాత్మ్యంబులును ఇష్టములుకానివియునగు నాహారపదార్థముల సేవించుట, పగటియందునిదురిం

చుటు, స్రోతస్సుల స్రవింపజేయునదియు మలమును బంధించునదియు అజీర్ణకరంబునునగు ఆహారమును సేవించుట, ఇవియన్నియు ప్రసవించిన స్త్రీలకు పథ్యములుకావు ; కావున విడువవలెను. మఱియు వాతకఫములచే జనించిన సూతికారోగములయందు ఆయారోగముల ననుసరించి పథ్యాపథ్యక్రమము నెఱుంగునది.

—॥ బాలరోగములయందు పథ్యాపథ్యములు. ॥—

శ్లో॥ యత్పథ్యం యదపథ్యం చ నృణాముక్తం జ్వరాదిషు ।
తత్తద్విధేయమౌచిత్యాత్ బాలానాం తేషు జానతా ॥
పూర్వం పథ్యమపథ్యం చ మన్దాగ్నౌ యత్ప్రకీర్తితమ్।
ఔచిత్యాత్తద్విధేయాంతాం బాలానాం పారిగర్భికే॥
ఆగన్త్వాన్మాదినాం పథ్యమపథ్యం చ యదీరితమ్ ।
ఔచిత్యాద్యోజయేత్తత్తు బాలేషు గ్రహరోగిషు ॥ ౪౯ ॥

తా॥ బాలురకు జ్వరాది రోగములు కల్గినప్పుడు జ్వరాది రోగముల యందు పైఁజెప్పబడిన విధముగనే పథ్యాపథ్యముల నెఱుంగునది. శిశువులకు జనించు పారిగర్భికమను వ్యాధియందు మందాగ్ని రోగమున జెప్పబడిన రీతిగ పథ్యాపథ్యములను సమయోచితముగ నెఱుంగునది. బాలగ్రహములయందు ఆగంతూన్మాదమున జెప్పబడిన పథ్యాపథ్యములచే ఆయాగ్రహములకు దగినట్టులు చేయందగును.

—॥ విషరోగములయందు పథ్యములు. ॥—

శ్లో॥ అరిష్టాబన్ధనం మన్త్రయుక్తిశ్ఛర్దిర్విరేచనమ్ ।
జాగరశ్శోణితాకృష్టిః పరిషేకోఽవగాహనమ్ ॥ ౫౦॥
హృదయావరణం నస్యమఞ్జనం ప్రతిసారణమ్ ।
ఉద్వర్తనం ప్రధమనం ప్రలేపో వహ్నికర్మ చ ॥ ౫౧॥
ఉపధానం ప్రతివిషం ధూమస్సంజ్ఞాప్రబోధనమ్ ।

శాలయష్షష్టికాద్యాశ్చ కోరదూషప్రియఙ్గుకాః ॥
ముద్గా హరేణవస్తైలం సర్పిశ్చాపి నవం క్వచిత్ ।
శిఖితిత్తిరలావైణగోధాఖుశ్వావిదామిషమ్ ॥ ౪౮౩॥
వార్తాకుః కులకం ధాత్రీ నిష్పావస్తణ్డులీయకమ్ ।
మణ్డూకపర్ణీ జీవన్తీ సునిషణ్ణముపోదికా॥ ౪౮౪॥
కాలశాకఞ్చ లశునం దాడిమఞ్చ వికఙ్కతమ్ ।
ప్రాచీనామలకం పథ్యా కాపిత్థం నాగకేసరమ్ ॥
గోచ్ఛాగనరమూత్రాణి తక్రం శీతామ్బు శర్కరా ।
అవిదాహీని చాన్నాని సైన్ధవం మధు కుఙ్కుమమ్॥
పశ్చిమోత్తరవాతాశ్చ హరిద్రా సితచన్దనమ్ ।
ముస్తం శిరీషం కస్తూరీ తిక్తాని మధురాణి చ ॥౪౮౫॥
హేమచూర్ణఞ్చవర్గోఽయం యథావస్థం యథావిషమ్।
విషరోగేషు సర్వేషు ప్రయోక్తవ్యో విజానతా ॥

తా॥ రక్షాబంధనము జేయుట, మంత్రముల బ్రయోగించుట, వమన విరేచనముల జేయించుట, నిదుర మేల్కొనియుండుట, శరీరమున రక్తమును వెడలించుట, నీళ్ళచే దడుపుట, స్నానము, హృదయమును గుడ్డ మొదలగు వానిచే గప్పుట, నస్యము, అంజనము, ప్రతిసారణము, విషహారంబులగు చూర్ణములబూసి రుద్దుట, ప్రధమనమను నస్యము, (అరంగుళము లనిడుపును ఇరు ప్రక్కల రెండుద్వారములును కల్గిన గొట్టమున త్రికటుకములు మున్నగు వాని చూర్ణమునుబోసి నాసాద్వారమున నునిచి యాచూర్ణమును ప్రాణవాయువుచే లోనికి బీల్చుట ప్రధమననస్యమని యెరుంగునది) విషహరౌషధములనూరి పూయుట, అగ్నికర్మ, తత్కాలమునందు విషమును హరించుటకై వేరొండు విషమును బ్రయోగించుట, ధూపము వేయుట, మైమరచియున్నపుడు తెలివిని పుట్టించుట, అరువదినాళ్ళసంబావులు మున్నగు వరి

ధాన్యములు, ఆరుకలు, కొఱ్ఱలు, పెసలు, రేణుకలు, తైలము, క్రొత్తగా కాచబడిననెయ్యి, నెమలి, తీతువుపిట్ట, లావుకపిట్ట, జింక, ఉడుము, ఎలుక, ముండ్లపంది, అను నీజంతువుల మాంసములు, వంకాయలు, పొట్లకాయలు, ఉసిరికకాయలు, అనుములు, చిట్రికూర, మండూకబ్రహ్మి, పాలకూర, చక్రవర్తికూర, బచ్చలికూర, కరివేముకూర, ఉల్లిగడ్డలు, దానిమ్మ, పుల్లవెలగ, ప్రాచీనామలకము (నీటిబుట్టిన ఉసిరికె), కరకకాయలు, వెలగపండ్లు, నాగకేసరములు, ఆవులయొక్కయు మేకలయొక్కయు మనుజులయొక్కయు మూత్రములు, మజ్జిగ, చల్లనినీళ్ళు, చక్కెర, సంతాపమును గల్గించకయుండు నాహారపదార్థములు, సైంధవలవణము, తేనె, కుంకుమపువ్వు, పడమటినుండియు ఉత్తరపుదిక్కునుండియు వచ్చునట్టిగాలి, పసుపు, తెల్లనిచందనము, తుంగగడ్డలు, దిరిసనము, కస్తూరి, తిక్తంబులును మధురంబులునగు సకల పదార్థములు, బంగరుచూర్ణము, ఇవి యన్నియు విషరోగములయందు పథ్యములు కావున విషముచేగల్గు నవస్థాభేదములను విషభేదములనుబట్టి యుపయోగింపందగును.

—॥ విషరోగమునం దపథ్యములు. ॥—

శ్లో॥ క్రోధో విరుద్ధాధ్యశనం వ్యవాయం
తామ్బూలమాయాసమపిప్రవాతమ్ ।
అమ్లం చ సర్వం లవణం చ సర్వం
సంస్వేదనాని వివిధాని చ యాని తాని॥౨౮౯॥
నిద్రాం భయం ధూమవిధిం క్షుధాం చ
విషాతురో నైవభజేత్కదాచిత్ ।

తా॥ క్రోధము, పరస్పర విరుద్ధములగు పదార్థములభుజించుట, అధ్యశనము (భుజించినతోడనే మరలభుజించుట), సంభోగము జేయుట, తాంబూలము, శరీరమునకు శ్రమనుకల్గించుట, అధికమగు గాలిలో నుండుట, అమ్లలవణరసములుకల సకల పదార్థములు, నానావిధములగు స్వేదనకర్మలు,

నిద్ర, భయము, పొగ ద్రాగుట, తుమ్ముట, ఇవియన్నియు విషరోగమునం దపథ్యములు కావున నొకప్పుడైనను సేవింపందగవు.

—( రోగసంకరమునందు పథ్యములు. )—

శ్లో॥ సర్వామయానాం యది సఙ్కరో భవేత్
తదా ప్రయత్నేన భిషఙ్మనీషీ ॥౪౯॥
ప్రోక్తేషు పథ్యేషు విరోధియద్యత్
తత్తత్పరిదద్యాచ్చ చికిత్సితేషు ।

తా॥ జ్వరాదిరోగములలో ననేకము లొక్కటిగఁజేరి బాధించునెడ ఆయావ్యాధులకు జెప్పబడిన పథ్యములలో నెయ్యది రోగములకు విరుద్ధములై యుండునో ఆయా పదార్థముల వథ్యములుగా నెఱుంగనది.

—( రోగసంకరమునం దపథ్యములు. )—

శ్లో॥ అహితానిచ సర్వాణి తత్తద్రోగే విశేషతః ।
రుగ్బలాబలవిద్వైద్యో వర్జయేద్వ్యాధిసఙ్కరే ॥

తా॥ అనేక రోగము లొక్కెడజేరి బాధించుచుండెనేని ఆయా వ్యాధుల నుద్దేశించి చెప్పబడిన అపథ్యముల నన్నిటిని ఆయావ్యాధి బలాబలములంబట్టి విడువవలెనని భావము.

—( వాతప్రకోపమునందు పథ్యములు. )—

శ్లో॥ అభ్యఙ్గః పరిమర్దనఞ్చ శమనం సంస్నేహనం బృంహణం
స్నేహం స్వేదనమాసనాని శయనంసంవాహనంవస్త్రయః।
నస్యం ప్రావరణం సమీరణపరిత్యాగోఽవగాహశ్శిరో
వస్తిర్విస్మరణం దివాకరకరస్నానంచవిస్మాపనమ్॥ ౪౧॥
ద్రోణీతైలసమన్వితా సరసతా గాఢోపనాహస్సురా
భూశయ్యా సుఖశీలతా చ లవణస్వాద్వమ్లసంజ్ఞా రసాః ।

మజ్జాతైలవసాఘృతాని చ నవా మాషాః కులుత్థాస్తిలాః
గోధూమాశ్చసముద్భవాశ్చకలమా యేశాలయష్షష్టికాః॥
పేయా ధాన్యజలం పయాంసి కృసరో మణ్డస్సుఖోష్ణోదకం
గోమూత్రంనలదామ్బుకం దధి పయః పేటీపయః కూర్చికా।
ఆనూపాః రురుఖడ్గికోలమహిషన్యఙ్కుద్విపేన్ద్రాదయో
గ్రామ్యాగోఽశ్వతరక్రమేలకఖరచ్ఛాగాశ్చవాహాదయః॥
హంసోత్క్రోశశారిసారసబకక్రౌఞ్చాదయశ్చోదకా
గోధా దర్దురశల్యకప్రభృతయో యే బైలసంజ్ఞాన్వితాః।
సర్పద్వీట్కృకవాకుతిత్తిరికులిఙ్గా ఏవ ధన్వోద్భవాః
కుమ్భీరోఽపి తిమిఙ్గిలోఽపి మకరో గణ్డూపదః కచ్ఛపః॥
మత్స్యా రోహితవర్మిమద్గురశిలిన్ధ్రైరణ్డభృఙ్గిల్లిశ
ప్రోష్ఠీగర్గరభాకురప్రభృతయో యేఽన్యేఽమ్బుజాజన్తవః।
వార్తాకుంకులకఞ్చశిగ్రులశునం ద్రాక్షామ్రమామ్రాతకం
ధాత్రీ దాడిమమమ్లవేతసఫలం కోలం కపిత్థం శివా॥౭౯౬॥
తాలఞ్చాపి పచేళిమం బహుసుతా గోకణ్టకో వాస్తుకం
శుక్లాక్షీ గణికారికా చ సరణీ మన్దారపత్రాణ్యపి।
తామ్బూలంసితశర్కరా చ సరలో బోలస్తురుష్కోఽగురు
శ్రీవాసస్సురదారుగుగ్గులురపి గ్రన్థాహ్వయంకుఙ్కుమమ్॥
స్నిగ్ధోష్ణా విధయోఽపి హేమరజతం సీసఞ్చసఞ్చూర్ణితం
ఫుల్లోత్పాటనమల్లికా సుమనసాం మాలా విశాలాపి చ।
తత్త్వజ్ఞానపురస్కృతైర్మునివరైః వైద్యైస్సునిర్ధారితం
పానాహారవిహారభేషజమిదంవాతం ప్రశాన్తిన్నయేత్॥

తా॥ అభ్యంగనము, శరీరమర్దనము, సంశమనక్రియ, స్నేహనము, బృంహణము (శరీరమునకు పుష్టినికల్గించు నాహారాదుల సేవించుట), స్వేదనము, కూర్చునియుండుట, శయనము, ఒడలు పిసికించుకొనుట, వస్తికర్మలు, నస్యము, గుడ్డచే శరీరమును గప్పికొనియుండుట, శరీరమునకు గాలిసోకనీయకుండుట, అవగాహనముజేయుట, శిరోవస్తికర్మ, విస్మరణము, ఎండలోనుండుట, స్నానము, ఆశ్చర్యకరములగుపనులజేయుట, తైలాదులచేనిండియుండు తొట్టిలోనుండుట, ద్రవపదార్థముల జేర్చి గట్టిగా పిండికట్లు కట్టుట, మద్యము, భూమిపై బరుండుట, శరీరమునకు సుఖమును గల్గించు నుపచారములు, లవణ మధుర అమ్ల రసములుకల పదార్థములు, మజ్జ (ఎముకలలోనుండు క్రొవ్వు), నూనె, వస (మాంసస్నేహము), నెయ్యి, నూతనములైన మినుములు, ఉలవలు, నువ్వులు, గోధుమలు, కలమధాన్యములు, రాజనములు, అరువదినాళ్ళ సంబావులు, పేయ (స్వల్పముగా మెతుకులు కల్గిన గంజి), బియ్యమును కడిగిన నీళ్ళు, పాలు, కృసరము, మండము, సుఖోష్ణంబైన జలము, గోమూత్రము, వట్టివేళ్ళతో ఊరిననీళ్ళు, పెరుగు, టెంకాయనీళ్ళు, కూర్చిక, ఇత్తి, ఖడ్గమృగము, పంది, ఎనుబోతు, పొడలయిఱ్ఱి, ఏనుగులు, ఇవిమున్నగు ఆనూపజంతువులయొక్కయు; ఆవులు, కంచరగాడిదె, ఒంటె, గాడిదె, మేకలు, గుఱ్ఱములు ఇవి మున్నగు గ్రామ్యజంతువులయొక్కయు; హంసలు, పెన్నెడపులుగులు, శ్యేనము, చక్రవాకములు, కొంగలు, క్రౌంచములు ఇవి మున్నగు జలజంతువులయొక్కయు మాంసములు, ఉడుము, కప్ప, ఏదుపంది మున్నగు బిలములయందుండు జంతువులయొక్కయు, నెమలి, కోడి, తీతువుపిట్ట, పిచ్చుక ఇవి మున్నగు మరుభూమిలో జనించిన జంతువులయొక్కయు; ముసలి, తిమింగిలము, మకరము, గండూపదము, తాబేలు, ఈజంతువులయొక్కయు, రోహితము (ఎఱ్ఱనిమీను), వర్మి, మద్గురము (ఎల్లప్పుడును నీటిలో మునిగియుండు మత్స్యము), శిలింధ్రము, ఏరణ్డము, భృంగి, ఇల్లిశము, ప్రోష్ఠి (పైకి ఎగిరి పడునట్టి చేప), గర్గరము, భాకురము ఇవి మున్నగు మత్స్యములయొక్కయు

మాంసములు ; వరకాయలు, పొట్లకాయలు, మునగకాయలు, ఉల్లిగడ్డలు, ద్రాక్షపండ్లు, మామిడిపండ్లు, ఇప్పకాయలు, ఉసిరికెకాయలు, దానిమ్మపండ్లు, చింతపండు, రేగుపండ్లు, వెలగపండ్లు, కరకకాయలు, తాటిపండ్లు, పిల్లిపీచర గడ్డలు, పల్లేరు, చక్రవర్తికూర, పొన్నగంటికూర, చిరినెల్లి, గొంతెమగోరు, జిల్లేడాకులు, తాంబూలము, తెల్లచక్కెర, తెగడ, బోడతరము, తురుష్క ధూపము, అగరు, శ్రీవాసధూపము, దేవదారు, గుగ్గిలము, గ్రంథికము, కుంకుమపువ్వు, స్నిగ్ధంబులును ఉష్ణంబులునైన నానావిధక్రియలు, బంగరుచూర్ణము, వెండిభస్మము, సీసము, చక్కగా వికసించిన మల్లెపువ్వుల మాలికలు, ఇవియన్నియు వాతము ప్రకోపమునొందియున్నపుడు పానము, ఆహారము, విహారములు, ఔషధములు, అను నీవిషయములయందు పథ్యములైయుండునని జ్ఞానవంతులును వైద్యపారీణులునగు మునివరులచే నిర్ణయించబడెను.

—( వాతరోగమునం దపథ్యములు. )—

శ్లో॥ చిన్తా జాగరణం ప్రజల్పనమసృఙ్మోక్షో వమిర్లఙ్ఘనం
వ్యాయామో గజవాజివాహనవిధిః సన్ధారణం మైథునమ్।
ఆఘాతోఽప్యపతర్పణం ప్రతపనం ధాతుక్షయః క్షోభణం
శోకశ్చఙ్క్రమణం విరుద్ధమశనం సమ్యక్వమున్క్రమః॥
వృద్ధత్వంజలదాగమోఽపి రజనీశేషోఽపరాహ్ణోభయం
రూక్షాత్యల్పకషాయతిక్తకటుకక్షారాతిశీతాశనమ్।
తే సశ్వేతృణధాన్యనామవిదితా యేచోడికాచార్యటాః
కఙ్గూద్దాలమకుష్ఠకోద్రవయవశ్యామాకజూర్ణాదయః॥
శిమ్బ్యాజమ్బుకరాజమాషచణకా ముద్గాః కలాయావిషం
శాలూకం క్రముకం కసేరు తిలకం కాటిల్లకం తిన్దుకమ్।
కర్కోటం నవతాలసస్యమపి వా తస్యాస్థిమజ్జా జలం
నాదేయఞ్చ తటాకజఞ్చ కరకాణి క్షారబీజాని చ॥౧౦౦॥
పిణ్యాకఃశిశిరామ్బురాసభపయః పత్రోత్థశాకంత్రివృ

దూర్వానిమ్బఃకటుకాకరీరమఖిలంశుష్కామిషంమాక్షికమ్।
ధూమో బద్ధమురుద్రుజః పరిభవః ఖట్వా చ నిర్ధారితం
పానాహారవిహారభేషజమిదం స్యాద్వాతకోపే విషమ్॥

తా॥ చింత, నిదురమేల్కొనియుండుట, అధికముగ మాట్లాడుట, రక్తమోచనము జేయుట, వాంతి, లంకణము, దేహపరిశ్రమజేయుట, ఏనుగులు గుఱ్ఱములు మున్నగువానిపై నెక్కి సవారిచేయుట, మలమూత్రాదులను నిరోధించుట, సంభోగముచేయుట, దెబ్బతగులుట, అపతర్పణము, (ధాతువులను పుష్టినొందించకయుండు ఆహారాదులు), సంతాపము నొందుట, రసాదిధాతువులు క్షీణించుట, చలనమునొందుట, శోకము, విశేషముగ సంచరించుట, విరుద్ధపదార్థముల భుజించుట, పాచనములకు విరుద్ధములగు క్రియలజేయుట, ముసలితనము, వర్షాకాలము, రాత్రియొక్క కడపటిభాగము, సాయంకాలము, భయము, రూక్షంబును, మిగుల స్వల్పంబును, కషాయ తిక్త కటుకక్షార రసములు గల్గినదియు, శీతలంబునైన యన్నమును భుజించుట, చోడిక, చార్మట, అనునవి మున్నగాగలతృణధాన్యములు, కొఱ్ఱలు, అడవియూరుకలు, అడవిపెసలు, ఆరుకలు, యవలు, సామలు, జొన్నలు మున్నగుధాన్యములు, జంబుకములు, అలచందులు, సెనగలు, పెసలు, పటాణులు, ఇవి మున్నగు శింబీధాన్యములు, విషము, తామర కలువ మున్నగువాని దుంపలు, పోకలు, నమ్మదుంపలు, తిలకవృక్షము, కాకరకాయలు, తుమ్మిపండ్లు, దోసకాయలు, లేతతాటిముంజలు, తాటికాయ విత్తనములోని గిజరు, తాటికల్లు, నదీజలము, గుంటనీళ్ళు, వడిగండ్లు, క్షారము, బీజములు, గానుగపిండి, మంచునీళ్ళు, గాడిదెపాలు, ఆకుగూరలు, తెగడ, నేలవేము, కటుకరోహిణి, వెదురుమోవులు, ఎండినమాంసములు, తేనె, పొగ, వాతమును నిరోధించుట, తిరస్కారము, శయనము, ఇట్టి పాన ఆహార విహార ఔషధములన్నియు వాతమును వృద్ధినొందించును కావున వాతము ప్రకోపము నొందియున్నపుడు పైజెప్పబడినవియన్నియు నపథ్యములై యుండును.

—॥ పిత్తప్రకోపమునందు పథ్యములు. ॥—

శ్లో॥ సర్పిఃపానవిధిర్విరేచనమసృజ్మోక్షః సితాశ్శాలయః
గోధూమాస్తృణధాన్యకానిచణకాముద్గామసూరాయవాః॥
మణ్డాః పర్యుషితః పయాంసి చ పయఃపేటీషు వ్రామాక్షికం
లాజా ధన్వరసాః ఘృతాని చ సితా శీతోదకఞ్చోద్భిదమ్॥
కర్కోటం కదలఞ్చ కట్టకిఫలం వేత్రాగ్రమాషాఢకం
మృద్వీకా కులకంచ కోమలతరం కూశ్మాణ్డమైర్వారుకమ్॥
తుమ్బ్యా పర్పటకోఽల్పమారిషదలం కాటిల్లకం దాడిమం
ధాత్రీ కోమలతాలసస్యమభయా ఖర్జూరమాదుమ్బరమ్ ॥
బిమ్బఞ్చాపి కషాయతిక్తమధురాః సేవ్యం మధూకం వరీ
కాంస్యాయోరజతంచ హేమకటుకా నిమ్బత్రివృచ్ఛన్దనమ్।
హార్మ్యం భూమిగృహం సుశీతలవనం ధారాగృహంచన్ద్రికా
రమ్యామ్భోరుహనవ్యపత్రశయనం శీతాః ప్రదేహా అపి॥
భూశయ్యామణయః ప్రదోషసమయోగీతం ప్రియాలిఙ్గనం
స్నానంమిత్రసమాగమః ప్రియకథామన్దానిలోఽబ్దేక్షణమ్।
వాదిత్రశ్రవణం మనోరమతరా భావాస్సులాస్యేక్షణమ్
పున్నాగోత్పలపాటలాబ్జసుమనఃకల్హారపుష్పాణి చ॥౧౦౬॥
కర్పూరఞ్చప్రతీరనీరమఖిలా శీతా క్రియా చాశ్రితం
పానాహారవిహారభేషజమిదం పిత్తం ప్రశాన్తిన్నయేత్।

తా॥ ఘృతపానము, విరేచనము, రక్తమోక్షణము, తెల్లనిరాజనములు, గోధుమలు, నీవారములు మున్నగు తృణధాన్యములు, సెనగలు, పెసలు, చిరుసెనగలు, యవలు, పులిసిన మండము, పాలు, టెంకాయనీళ్ళు, చెఱకు, తేనె, పేలాలు, జాంగలజంతువుల మాంసరసములు, నెయ్యి, చక్కెర, చల్లనినీళ్ళు, ఊటనీళ్లు, ములుదోసకాయలు, అరటికాయలు, పనసపండు,

పేముచిగురు, ఆషాఢఫలము, ద్రాక్షపండ్లు, చేదుపొట్ల, లేతదియగు బూడిదె గుమ్మడికాయ, దోసకాయ, సొరకాయ, పర్పాటకము, తోటకూర, కాకర కాయలు, దానిమ్మపండ్లు, ఉసిరికెకాయలు, లేతతాటి ముంజలు, కరకకాయలు, ఖర్జూరపుపండ్లు, అత్తికాయలు, దొండపండు, కషాయ తిక్త మధురరసములు కల పదార్థములు, ఇప్పకాయలు, పిల్లిపీచరగడ్డలు, కాంస్యభస్మము, అయోభస్మము, రజతభస్మము, స్వర్ణభస్మము, కటుకరోహిణి, వేప, తెగడ, చందనము, ఈపదార్థములును; మేడలయందును భూమిగృహములయందునుండుట, చల్లనైన ఉద్యానవనములు, ఉదకధారలతోగూడిన యిల్లు, వెన్నెల, అరటిపట్టలచేతను నూతనములైన తామరరేకులచేతను రచింపబడిన శయనమునబరుండుట, చల్లనైయుండు అనులేపనములు, భూమిపైబరుండుట, మణులు, ప్రదోషకాలము, సంగీతము, ప్రియురాండ్ర నాలింగనము జేసికొనుట, స్నానము, మిత్రులతో జేరియుండుట, మనసుకింపైన కథలవినుట, మెల్లగా వీచుచుండుగాలి, మేఘములజూచుట, వాద్యములవినుట, మిగుల రమ్యములగు భావములుకల నాయికలజూచుట, నృత్యమును జూచుట, పొన్న పువ్వులు, కలువపువ్వులు, పాదిరిపువ్వులు, తామరపువ్వులు, జాజిపువ్వులు, ఎఱ్ఱతామర పువ్వులు, పచ్చకప్పురము, నదీజలము, నానావిధములగు శీతోపచారములు, ఇవి మున్నగు పానాహారవిహారములన్నియు ప్రకోపమునొందిన పిత్తమును శాన్తినొందించునుగాన పిత్తము ప్రకోపించినపుడు పైజెప్పబడినవియన్నియు పథ్యములైయుండునని భావము.

—॥ పిత్తప్రకోపమునం దపథ్యములు. ॥—

శ్లో॥ ధూమస్స్వేదనమాతపో నిధువనం సన్ధారణం క్రోధవత్
క్షారోఽధ్వా గజవాజివాహనవిధిః తీక్ష్ణాని కర్మాణి చ ॥
వ్యాయామోఽన్నవిదాహకారిసమయో గ్రీష్మో విరుద్ధాశనం
మధ్యాహ్నో జలజాత్యయోఽపి రజనీమధ్యం చ మద్యం వయః।
వ్రీహిర్వేణుఫలం తిలోఽపి లశునం మాషాః కులుత్థా గుడో

నిష్ఠ్యూతో మదిరాఽతసీనవజలం ధాన్యామ్లముష్ణోదకమ్॥
జమ్బీరంనఖదామ్బుహిఙ్గు లకుచం మూత్రాణి భల్లాతకం
తామ్బూలం దధి సర్షపోఽపి బదరం తైలాశనం త్రిఫ్రిడీ।
కట్వమ్లం లవణం విదాహి చ భిషఙ్ముఖ్యైః సునిర్ధారితం
పానాహారవిహారభేషజమిదం పిత్తప్రకోపే విషమ్॥ ౫౦॥

తా॥ ధూమపానము, స్వేదనము, ఎండలోనుండుట, సంభోగము జేయుట, మలమూత్రాదుల నిరోధించుట, కోపపడుట, క్షారముతోగూడిన పదార్థముల సేవించుట, త్రోవనడచుట, ఏనుగులు గుఱ్ఱములు మున్నగువానిపై నెక్కి సవారిచేయుట, క్రూరములగు పనుల జేయుట, దేహపరిశ్రమ జేయుట, విదాహకరమగు నన్నమును భుజించుట, గ్రీష్మకాలము, విరుద్ధాహారమును భుజించుట, మధ్యాహ్నకాలము, శరదృతుకాలము, అర్ధరాత్రికాలము, యౌవనవయస్సు, వడ్లు, వెదురుబియ్యము, నువ్వులు, ఉల్లిగడ్డలు, మినుములు, ఉలవలు, బెల్లము, అనుములు, మద్యము, అగసియాకు, క్రొత్తనీళ్ళు, పులిపిన గంజి, వేడినీళ్ళు, నిమ్మకాయలు, వట్టివేళ్ళనీళ్ళు, ఇంగువ, కమ్మరేగు, గోమూత్రము, జీడిగింజలు, తాంబూలము, పెరుగు, ఆవాలు, రేగుపండ్లు, నూనె, చింతపండు, కటు అమ్ల లవణ రసములుకల సకలపదార్థములు, విదాహకరపదార్థములు, ఇట్టి పానాహార విహారాదులన్నియు పిత్తమును మిక్కిలి వృద్ధినొందించునుకావున పిత్తము ప్రకోపమునొంది యున్నపుడు అపథ్యములుగా నుండును.

—॥ కఫప్రకోపమునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఛర్దిర్లఙ్ఘనమఞ్జనం నిధువనం ప్రోద్వర్తనం స్వేదనం
చిన్తా జాగరణం శ్రమోఽతిగమనం తృడ్వేగసన్ధారణమ్।
గణ్డూషః ప్రతిసారణం ప్రఘమనంహస్త్యశ్వయానక్రియా
ధూమః ప్రావరణంనియుద్ధమతిసంక్షోభోఽపినస్యంభయమ్

రూక్షోష్ణా విధయః పురాతనభవా యే శాలయష్షష్టికా
నిష్పావస్తృణధాన్యకఙ్చణకాముద్గాః కులుత్థాయవాః।
క్షారస్సర్షపతైలముష్ణసలిలం ధన్వామిషం రాజికా
వేత్రాగ్రం కులకం కటిల్లకఫలం వార్తాకమౌదుమ్బరమ్॥
కర్కోటంలశునం చ మోచకుసుమంశ్రుకాశనంసూరణో
నిమ్బో మూలకపోతికా చ వరుణస్తిక్తాత్రివృన్మాక్షికమ్।
తామ్బూలంనలదామ్బు జీర్ణమదిరావ్యోషంవరాగోజలం
లాజాశ్చాపి సుభృష్టతణ్డులభవం భక్తం సుఖోష్ణాలయః॥
కాంస్యాయోఽఞ్జనమాక్షికంచ కటుక స్తిక్తఃకషాయోరసః
పానాహారవిహారభేషజమిదం శ్లేష్మాణముగ్రం జయేత్ ।

తా॥ వమనము, లంకణము, అంజనము, సంభోగము, ఉద్వర్తనము (శరీరమునకు నలుగుపెట్టుట), స్వేదనము, చింత, నిదురమేల్కొంచియుండుట, శరీరమునకు శ్రమనుకల్గించుపనులజేయుట, అధికముగ నడచుట, దప్పిని వాతాదివేగములను నిరోధించుట, గండూషము, ప్రతిసారణము (కల్కచూర్ణాదులచేతరుద్దుట), ప్రధమనము (నాసాద్వారమున చూర్ణాదులనునిచి లోనికి నాకర్షించుట), ఏనుగులు గుఱ్ఱములు, మున్నగువానిపైనెక్కిసవారిచేయుట, ధూమపానము, వస్త్రముచే ముసుకు బెట్టుకొనియుండుట, మల్లయుద్ధము చేయుట, శరీరమునకు అధికముగ చలనము గల్గించుట, నస్యము, భయము, రూక్షంబులును ఉష్ణంబులునగు క్రియలజేయుట, ప్రాతవియగు రాజనములు, అరువదినాళ్ళసంబావులు, అనుములు, నీవారములుమున్నగు తృణధాన్యములు, సెనగలు, పెసలు, ఉలవలు,యవలు, క్షారములు, ఆవనూనె, వేడినీళ్లు, జాంగల జంతుమాంసములు, ఆవాలు, పేముచిగురు, పొట్లకాయలు, కాకరకాయలు, వంకాయలు, అత్తికాయలు, దోసకాయలు, ఉల్లిగడ్డలు, అరటిపువ్వు,గంజాయి విత్తులు, కందగడ్డలు, వేప, లేతముల్లంగి, ఉలిమిరి, కటుకరోహిణి, తెగడ,

తేనె, తాంబూలము, వట్టివేళ్ళనీళ్ళు, పాతమద్యము, త్రికటుకము, త్రిఫలములు, గోమూత్రము, పేలాలు, వేయించబడిన బియ్యముపలన సిద్ధమైన యన్నము, సుఖోష్ణంబైన యిల్లు, కాంస్యభస్మము, అయోభస్మము, అంజనము, ముత్యములభస్మము, కటు తిక్త కషాయరసములుకల పదార్థములు, ఈచెప్పంబడిన పానాహారవిహారౌషధములు ప్రకోపించిన కఫమును శమింపజేయును కావున కఫము ప్రకోపమునొందినపుడు పథ్యములై యుండును.

—॥ కఫప్రకోపమునం దపథ్యములు. ॥—

శ్లో॥ స్నేహాభ్యఞ్జనమాసనాహ్ని శయనంస్నానంవిరుద్ధాశనం
పూర్వాహ్ణశ్శిశిరోవసన్తసమయోరాత్ర్యాదిరాద్యంవయః॥
భక్తాదౌ చ నవాన్నపానకరణం మాషా నవాస్తణ్డులాః
మత్స్యం మాంసమపీక్షుదుగ్ధవికృతిస్తాలాస్థిమజ్జా ద్రవాః।
పేయా భవ్యముపోదికా చ పనసం ఛత్రాకమాషాఢకం
ఖర్జూరాణ్యనులేపనాన్యపి పయఃపేటీ పయః పాయసః।
స్వాద్వమ్లం లవణం గురూణి తుహినం సన్తర్పణంచాశ్రితం
పానాహారవిహారభేషజమిదం స్యాత్ శ్లేష్మకోపే విషమ్॥

తా॥ స్నేహనము, అభ్యంగనము, కూర్చునియుండుట, పగటియందు నిదురించుట, స్నానము, పరస్పర విరుద్ధములగు నాహారములను భుజించుట, పూర్వాహ్ణకాలము, శిశిరవసంతఋతువులు, రాత్రియొక్క తొలిజాము, బాల్యవయస్సు, భోజనమునకు ముందుకాలము, నవీనములగు నన్నపానముల సేవించుట, మినుములు, క్రొత్తబియ్యము, మత్స్యములు, మాంసము, చెఱకు, పాలతోజేయబడిన పదార్థములు, తాటివిత్తనములోని గిజరు, ద్రవపదార్థములు, పేయ, భవ్యఫలము, బచ్చలికూర, పనసకాయలు, క్రొత్తమల్లి, ఆషాఢఫలము, ఖర్జూరపుపండ్లు, అనులేపనములు, టెంకాయనీళ్లు, పాలు, పరమాన్నము, మధుర అమ్ల లవణ రసములుకల పదార్థములు, అజీర్ణకరపదార్థములు,

మంచునీళ్లు, సంతర్పణము (రసాదిధాతువులను పుష్టినొందించు పదార్థముల సేవించుట) ఈజెప్పంబడిన పానాహార విహారౌషధములన్నియు కఫమును వృద్ధినొందించును గాన కఫము ప్రకోపించి యున్నపుడు అపథ్యములై యుండును.

—॥ వసన్త ఋతువునందు పథ్యములు. ॥—

శ్లో॥ ఉద్వర్తనం వాన్తివిరేకనస్యా
న్యయే ప్రియే చఙ్క్రమణం వ్యవాయమ్।
వ్యాయామమేణాక్షి వసన్తకాలే
బాలే హితాన్యాహురమూని వైద్యాః॥౫౧౩॥
కాశ్మీరకృష్ణాగరుచన్దనైశ్చ
కృతో విలేపో విహితో హితాయ।
అగ్ర్యా నిశా వాసకమాతులానీ
కటుత్రయం గ్రన్థికమశ్వగన్ధా॥౫౧౪॥
యవానికా జీరకమార్ద్రికశ్చ
పునర్నవా మూలకపోతికాపి।
కూశ్మాణ్డకం రామఠమేథికే చ
హితాయ తుమ్బీ త్రపుసం సుపక్వమ్॥౫౧౫॥
దుగ్ధికా వాస్తుకః కాఞ్చనారోద్భవః
కుట్మలస్స్యద్ధితాయైవ నౄణాం ప్రియే।
తణ్డులీయః పటోలస్తథా సూరణో
మారిషః కారవేల్లశ్చ కోశాతకీ॥౫౧౬॥
మాగధీ క్షౌద్రయుక్తా తథా పూతనా

జాఙ్గలానాం పలం షష్టికాస్సర్షపాః ।
వాజిమన్థో మకుష్ఠో యవో ముద్గకో
వర్తులశ్చాఢకీ కోద్రవాస్స్యుర్హితాః॥ ౫౧౭॥
తృణధాన్యం వరాఙ్గో హే మసూరీ రక్తశాలయః ।
రాజికా జూనలశ్చఞ్చుశ్శిగ్రుః పక్వం కలిఙ్గకమ్॥ ౫౧౮॥
వృన్తాకం శిగ్రుపుష్పాణి రసోనం రసికప్రియే ।
లఘురూక్షం కటూష్ణం యద్ధితం తత్కుసుమాఙ్గమే॥
రసస్తీక్ష్ణః కషాయశ్చ క్షారశ్చారుష్కరం తథా ।
స్వేదనం ధూమపానఞ్చ గణ్డూషః ప్రతిసారణమ్॥౫౨౦॥
ప్రావరణం ప్రధమనం హస్త్యశ్వైర్గమనం భృశమ్ ।
నియుద్ధం మాక్షికం మద్యం జీర్ణముష్ణం గవాం పయః॥
తామ్బూలమఞ్జనం లాజాః చిన్తా జాగరణం శ్రమః।
వసన్తే చ గణో గుణ్యో వాసన్తీసుమకోమలే॥౫౨౨॥
పానీయం నైర్ఝరం వాప్యం కౌప్యం హంసోదకం వరమ్।
గోధూమాశ్చైత్సమశ్నీయాత్తదా వర్షోషితానపి॥ ౫౨౩॥
కఫామయహరీ ఖ్యాతా తత్రాప్యఙ్గారకర్కటీ ।
నటీవానన్దదా నాట్యే తాలాన్తే చలకుణ్డలా॥౫౨౪॥
వ్యోషక్షారయుతం తక్రం క్వథితా క్వాథలీ తథా ।
శశాజహారిణం మాంసం తైత్తిరం వార్తికం వరమ్॥౫౨౫॥
గృహచటకస్య చ మాంసం
నీరదరావస్య చామిషం మత్స్యాః ।

నాదేయాస్తాలాకాశ్చోద్భ్యాశ్చైషాంశ్చమత్స్యకాఃక్షుద్రాః॥
స్నాతః కర్పూర్ణనీరైః భూషితో నిజకాన్తయా సార్ధమ్ ।
గత్వోపవనే పశ్యేద్రమేచ్ఛ తత్రైవ నిర్జనే దేశే॥ గీ ౨౭॥

తా॥ ఉద్వర్తనము (చూర్ణాదులచే నలుగుపెట్టుట) వమనవిరేచనములు, నస్యములు, సంచరించుట, సంభోగము, దేహపరిశ్రమ జేయుట. కుంకుమపువ్వు కృష్ణాగరు చందనము ఈమూడిటిని చేర్చినూరి యొడలికిబూయుట, త్రిఫలములు, పసుపు, అడ్డసరము, గంజాయి, త్రికటుకములు, గ్రంథికము, పెన్నేరుగడ్డ, ఓమము, జీలకఱ్ఱ, అల్లము, గలిజేరు, తేతముల్లంగి, గుమ్మడికాయ, ఇంగువ, మెంతులు, పొరకాయలు, దోసపండ్లు, చిన్నపాలకూర, చక్రవర్తికూర, దేవకాంచనపుమొగ్గలు, చిర్రికూర, పొట్లకాయలు, కందగడ్డలు, తోటకూర, కాకరకాయలు, బీరకాయలు, తేనెను కలిపి నూరపడిన పిప్పళ్లు, తేనెతో కలిసిన కరక్కాయలు, జాంగలజంతువుల మాంసములు, అరువదినాళ్ళ సంబావులు, ఆవాలు, సెనగలు, అడవిపెసలు, యవలు, పెసలు, పట్రాణులు, కందులు, ఆరుకలు, నీవారములు మున్నగు తృణధాన్యములు, చిరుసెనగలు, ఎఱ్ఱవరివడ్లబియ్యము, నల్లావాలు, జొన్నలు, ఆముదములు, మునగకాయలు, పుచ్చపండు, వంకాయలు, మునగపువ్వులు, ఉల్లిగడ్డలు, శీఘ్రముగ జీర్ణముగునదియు రూక్షంబును కటురసంబును ఉష్ణంబునైన యన్నము, తీక్ష్ణంబులును కషాయరసంబులునగు పదార్థములు, జీడిగింజలు, క్షారములు, స్వేదనము, ధూమపానము, గండూషము, ప్రతిసారణక్రియ, ప్రావరణము, ప్రధమన నస్యము, ఏనుగులు గుఱ్ఱములు మున్నగువానిపై సవారిచేయుట, మల్లయుద్ధము (కుస్తీ) చేయుట, తేనె, ప్రాతదియగు మద్యము, వేడిగానుండు ఆవుపాలు, తాంబూలము, అంజనము, పేలాలు, చిత్త, నిమరమేల్కొనియుండుట, దేహమునకు శ్రమనుగల్గించు పనులజేయుట, ఏటినీళ్ళు, గుంటనీళ్ళు, బావినీళ్ళు, హంసోదకము, సంవత్సరకాలమునకు మున్నుపండిన గోధుమలు, నిప్పున కాల్చబడిన గోధుమపిండి రొట్టె, మనసునకు ఆనందమును గల్గించు నాట్యము, త్రికటుక

ముల శాకముతోఁగూడిన మజ్జిగ, కుందేలు, క్వాథతి (ఉత్తరదేశమున ప్రసిద్ధమైన భక్ష్యవిశేషము), మేకలు, జింక, తీతువుపిట్ట, వార్తికము, ఊరపిచ్చుక, నెమలి, అను నీజంతువులమాంసములు, నదులయందును గుంటల యందును బావులయందును జనించిన మత్స్యములు, చిన్నచేపలు, ఇవియన్ని యును వసంత ఋతువునందు మిగుల పథ్యములై యుండును. మరియు కొంచెము వేడిగల్గిన నీళ్ళలోఁ స్నానముజేసి అలంకారయుక్తముగు తన ప్రియురాలితోఁగూడి యుద్యానవనమునకేగి యచ్చటగల వినోదముల జూచుచు జనములేని ప్రదేశమునక్రీడించుట మిక్కిలి పథ్యముగ నుండును.

## —॥ వసన్త ఋతువునందపథ్యములు. ॥—

శ్లో॥ నాడికా పోతికా రాజకోశాతకీ
మాషదధ్యాలుకానిక్షుశృఙ్గాటకా ।
ధాజమాషాశ్చ నీవారకుల్మాషకాః
హోలకం మేషమాంసం త్యజేత్కుక్కుటమ్॥ ౨౮॥
కృసరా పృథుకేక్షువికారమయే
మహిషీభవదుగ్ధమురోజఘనే ।
వటకానపి మాషకృతాంశ్చ పలా-
ణ్డుమితీహ వసన్త ఉశన్త్యహితమ్॥ ౨౯॥
అమ్లం స్నిగ్ధం దివాస్వాపం దుర్జరం భోజనం ప్రియే ।
త్యాజ్యమాహురయే వైద్యా వసన్తర్తౌ హితేప్సుభిః॥

తా॥ తూటుకూర, ముల్లంగి, బీరకాయలు, మినుములు, పెరుగు, పెండలము, చెఱకు, దుప్పగడ్డలు, అలసందులు, నీవారములు, కారుమినుములు, హోలకము (తృణాగ్నిచే నర్ధపక్వముగ కాల్చబడిన శమీధాన్యములు), పొట్టేలిమాంసము, కోడిమాంసము, కృసరము, అటుకులు, చెఱకు రసముతో జేయబడిన బెల్లము మున్నగునవి, ఎనుముపాలు, మినపపిండితో జేయుబడిన

ఫడియములు, నీరుల్లి, అమ్లంబులును స్నిగ్ధంబులునగు పదార్థములు, పగటి యందు నిదురించుట, అజీర్ణకరభోజనము, ఇవియన్నియు వసంత ఋతువు నందు అపథ్యములుకావున విడువవలెను.

—॥ గ్రీష్మ ఋతువునందు పథ్యములు. ॥—

శ్లో॥ కున్దేన్దుద్యుతిశాలిధాన్యససితా ముద్గాః పురాణా యవా
గోధూమా అపిజాఙ్గలాః ఖగమృగాఃయూషోరసాలాపిచ।
స్వచ్ఛాః పానకరాగఖాణ్డవరసాః సక్తుస్సితామ్భోయుతో
భక్ష్యాశ్చన్ద్రరుచః శశాఙ్కకిరణా గోక్షీరనిర్వర్తితాః॥
గవ్యం మాహిషమేవ వాపి సతతం దుగ్ధం హవిశ్శర్కరా
మద్యంవారియుతం తథామ్లమపివా పక్వఞ్చరమ్భాఫలమ్।
మృద్వీకాపనసంరసాలమపిచస్వాదూనిచత్వార్యమూ
న్యన్నంస్వాదులఘుద్రవంసుశిశిరంస్నిగ్ధంసమస్తఞ్చయత్॥
పాథః పాటలివాసితం లఘుతరం స్వచ్ఛం హిమంవారివా
వ్యోమవ్యాపి మహీరుహేషు వికసత్పత్రప్రసూనేషు చ।
పుష్పామోదమనోహరేషు పరితస్సంరుద్ధసూర్యాంశుషు
క్రూరప్రాణివివర్జితేషు మధుపధ్వానాదిరమ్యేషు చ॥
దాహోన్మాథిషు కాననేషు తటినీతీరే స్ఫురత్సైకతే
శీతే వేశ్మని సేవ్యచన్దనజలైః సిక్తే సచన్ద్రాతపే।
కల్హారోత్పలపద్మపల్లవకృతే తల్పే ప్రసూనాఞ్చితే
మధ్యాహ్నే శయనంస్థలంజలధరేధారాగృహేవాస్థితిః॥
క్రీడావారిషు కామినీభిరథవా సార్ధః వయస్యైస్తతో

రాత్రౌ మారుతచన్ద్రికాభిలషితే సుప్తిశ్చ సౌధాఙ్గణే।
వాసస్సూక్ష్మతరం మృణాళవలయం కర్పూరవచ్ఛన్దనా
లేపో రత్నవిభూషణం వ్యజనజో వాతో జలార్ద్రానిలః॥
కర్పూరాభరణం ప్రతీరసలిలం ముక్తాస్రజో మల్లికా
మాలా పక్షిత ఏవ మైథునవిధిః స్నానంచ నిద్రా దివా।
గీతం మఞ్జుకలస్వనాశ్చ శిఖరీ భృఙ్గాశ్శుకాశ్శారికా
పానాహారవిహారభేషజమిదం గ్రీష్మేహితంస్యాన్నృణామ్॥

తా॥ తెల్లని సంబావులబియ్యము, చక్కెర, పెసలు, ప్రాతవియగు యవలు, గోధుమలు, జాంగలదేశమున జనించిన పక్షులు మృగములు మున్నగు జంతువుల మాంసములు, పెసలు మున్నగువాని రసములు, పెరుగుతోఁగూడిన సత్తుపిండి, స్వచ్ఛములగు పానకములు, రాగములు, ఖాండవములు, మాంసరసములు, చక్కెరతోడను ఉదకముతోడను గూడిన సత్తుపిండి, వెన్నెలలోనుండుట, పచ్చకప్పురముతోఁగూడిన పాలు, ఆవుపాలు, ఎనుముపాలు, వానినెయ్యి, చక్కెరతోడను నీళ్ళతోడను కలిసినమద్యము, పులిసినమద్యము, అరటిపండు, ద్రాక్షపండ్లు, పనసపండు, తీయమామిడిపండ్లు, మధురంబులును చుక్కనగ జీర్ణంబులగునవియు ద్రవంబులును మిగుల చల్లనైనవియు స్నిగ్ధంబులునగు నానావిధాహారపదార్థములు, పాటలీ పుష్పములచే పరిమళింపజేయబడినదియు తేలికగానుండునదియు స్వచ్ఛంబును చల్లనైనదియునైన జలమును పానముజేయుట, ఆకసమున వ్యాపించునంత పొడవుకల వృక్షములు కల్గినవియు, వికసించిన పుష్పములు కల్గినవియు, పుష్పపరిమళముచే రమ్యములైనవియు, సూర్యకిరణముల జొరనీయక దట్టమై చల్లనైనవియు, క్రూరములగు వ్యాఘ్రాది జంతువులు లేకుండునవియు, తుమ్మెదల ఝుంకారధ్వనిచే మనోహరంబులును, సంతాపమును హరించునవియునైన వనములయందైనను, ఇసుకదిన్నెలచే రమ్యమైన నదీతీరమునందైనను నిర్మించబడే చందన

దకముచే తడపబడి వెన్నెలతోఁగూడిన యింటిలోఁ గలువలు, తామరపువ్వులు, చిగురుటాకులు మున్నగువానిచే నిర్మించబడిన శయ్యపై మధ్యాహ్నకాలమున శయనించుట, ఉదకముచేనిండిన యింటియందైనను ధారాగృహమునందైనను నివసించుట, ప్రియురాండ్రతోనైనను స్నేహితులతోనైననుగూడి జలకేళి సలుపుట, వెన్నెలయు మంచిగాలియుకల మేడపై రాత్రులు పరుండి నిదురించుట, మిగుల పలుచనై తేలికగానుండు వస్త్రముల ధరించుట, తామరకాడలను కంకణములుగా ధరించుట, పచ్చకప్పురముతోఁగూడిన చందనమును బూసికొనుట, రత్నములతోఁగూడిన భూషణముల ధరించుట, ఉదకముచే తడిసిన విసనకఱ్ఱలగాలిని సేవించుట, పచ్చకప్పురముచే బరిమళించు భూషణముల ధరించుట, నదీజలము, ముత్యాలహారములు, మల్లెపువ్వులహారములు, ఒక పక్షమునకు (పదునైదు దినములకు) ఒకతూరి సంభోగము చేయుట, స్నానము, పగటినిద్ర, గానమును, మనోజ్ఞంబులును శ్రావ్యంబులునైన ధ్వనుల చేయు నెమళ్ళయొక్కయు తుమ్మెదలయొక్కయు చిలుకలయొక్కయు గోరువంకలయొక్కయు నాదములనువినుట, ఇత్తెరంగున నుడువంబడిన పానాహార విహారాపథము లన్నియు గ్రీష్మకాలమునందు జనులకు పథ్యములై యుండును.

—॥ గ్రీష్మ ఋతువునం దపథ్యములు. ॥—

శ్లో॥ వ్యాయామం సూర్యకిరణం కట్వమ్లలవణం స్త్రియమ్ ।
ఉష్ణోపయుక్తాన్ రూక్షాదీన్ గ్రీష్మే నిత్యం వివర్జయేత్ ॥

తా॥ దేహపరిశ్రమజేయుట, ఎండలోనుండుట, కటు అమ్ల లవణ రసములుకల పదార్థములు, అధికముగ సంభోగముజేయుట, ఉష్ణమును వృద్ధి నొందించు రూక్షాదిపదార్థముల సేవించుట, ఇవియన్నియు గ్రీష్మకాలమునందపథ్యములగావున సేవింపందగవు.

—॥ వర్ష ఋతువునందు పథ్యములు. ॥—

శ్లో॥ పూర్వం సంశుద్ధిరాస్థాపనమపి ప్రతనాః
శాలయో ధన్వమాంసం

జీర్ణంగోధూమధాన్యంపలలభవరసాః
మధ్వరిష్టంపురాణమ్।
యూషస్సన్దీపనాని ద్రవపరివిహితం
దోషసాధారణఞ్చ
స్నిగ్ధోష్ణం క్షౌద్రమిశ్రం లఘుతరమశనం
మస్తు సౌవర్చలాఢ్యమ్ ॥౧౭౩౮॥

దివ్యామ్బుఃసారసామ్భఃక్వథితహిమజలం
కౌపనీరంపటూని
స్వాదూన్యమ్లాని వస్త్రం తనుతరమమలం
ధూపితం గన్ధమాల్యమ్ ।
హర్మ్యంచాక్లేదభూమిఃనభసిచశయనం
శీకరోష్ణప్రహీనే
పాదాభ్యామప్రయాణం జలధరసమయే
పథ్యమేతన్నరాణామ్॥౧౭౩౯॥

తా॥ వర్ష ఋతువునందు తొలుత వమనవిరేచనరూపముగు శోధన క్రియను జేసి పిమ్మట ఆస్థాపనవస్తికర్మను జేయదగును. మఱియు ప్రాతవియగు రాజనములు, జాంగలజంతువులమాంసము, ప్రాతగోధుమలు, మాంసరసములు, తేనె, ప్రాతవియగు అరిష్టములు, యూష, అగ్నినిదీపింపజేసెడిపదార్థములు, ద్రవయుక్తమై దోషములకు సాధారణమైన యన్నము, స్నిగ్ధంబును ఉష్ణం బునైన యన్నము, తేనెతోగూడి శీఘ్రముగ జీర్ణమగు నన్నము, సౌవర్చల లవణముతోగూడిన పెరుగుమీది తేటనీరు, వర్షోదకము, సరస్సులలోనుండు నీళ్ళు, కాగిచల్లారిన నీళ్ళు, బావినీళ్లు, లవణ మధుర అమ్ల రసములుకల సకల పదార్థములు, మిగులపలుచనై ధూపములచే బరిమళించుచు తెల్లనైయుండు వస్త్రములు, గంధము, పుష్పమాలికలు, మేడలు, చెమ్మలేని ప్రదేశము,

మంచును ఉష్ణంబునులేని బయలున శయనించుట, పాదసంచారము లేకుం డుట, ఇవియన్నియు వర్షాకాలమున పథ్యములై యుండును.

—॥ వర్షఋతువునం దపథ్యములు. ॥—

శ్లో॥ ఆయాసం సూర్యకిరణముదమన్థం నదీజలమ్ ।
అవశ్యాయందివానిద్రాంవ్యవాయంశీతమారుతమ్॥౧౬౮౦॥
శీతోపహితరూక్షాదీన్ తీక్ష్ణాదీన్ శీతసంహితాన్ ।
నరో యత్నేన వర్షాసు సర్వానేతాన్వివర్జయేత్ ॥౧౬౮౧॥

తా॥ దేహమున కాయాసమును గల్గించు పనుల జేయుట, ఎండలో నుండుట, ఉదమన్థము (సత్తుపిండిలో నెయ్యికలిపి నీళ్ళుబోసి కలియ పెట్ట బడిన పదార్థము), ఏటినీళ్ళు, మంచు, పగటినిద్ర, సంభోగము, చల్లనిగాలి, శీతగుణముతోగూడిన రూక్షతీక్ష్ణపదార్థములు, ఇవి యన్నియు వర్షఋతువు నందుఅపథ్యములుకావున మిక్కిలి ప్రయత్నముతో వీనినన్నిటిని విడువవలెను.

—॥ శరదృతువునందు పథ్యములు. ॥—

శ్లో॥ నాదేయఞ్చ ఘృతం విరేచనమసృఙ్మోక్షస్సితా శ్శాలయో
గోధూమామృగపక్షిణోమరుభవాముద్గాయవాః ఖాణ్డవాః।
స్వచ్ఛోమ్భఃసరసోఘృతంమధుపయోధాత్రీపటోలంసితా
లఘ్వన్నానికషాయతిక్తమధురాఃపిత్తాపహాంచేక్షవః॥౧౬౮౨॥
కర్పూరం సరసీజలం హిమజలం హంసోదకం చన్దనం
సౌధం చారు చ చన్ద్రికా తనుతరం వస్త్రం సుగన్ధాస్స్రజః।
ముక్తాదామ చ రూక్షశీతవిధయో గీతం చ నృత్యేక్షణం
పానాహారవిహారభేషజమిదంపథ్యం శరదృత్తమమ్॥౧౬౮౩॥

తా॥ నదీజలము, నెయ్యి, విరేచనము, రక్తమోచనము, తెల్లనిరాజన ముల బియ్యము, గోధుమలు, అరణ్యమున జనించిన మృగములు పక్షులు

కున్నగు జంతువుల మాంసములు, పెసలు, యవలు, ఖాండవములు, స్వచ్ఛమైన మాంసరసము, నెయ్యి, తేనె, పాలు, ఉసిరికెకాయలు, పొట్లకాయలు, చక్కెర, చుల్కనగ జీర్ణములగు నన్నములు, కషాయ తిక్త మధురరసములు కల పదార్థములు, పిత్తమునుహరించు సకలపదార్థములు, చెఱకు, పచ్చకప్పురము, సరస్సులలోనిజలము, చల్లనినీళ్ళు, హంసోదకము, చందనము, మనోహరమగు మేడపైనుండుట, వెన్నెలలోనుండుట, మిక్కిలి పలుచనైన వస్త్రమును ధరించుట, మంచిపరిమళముతోఁగూడిన పుష్పమాలికలు, ముత్యాలహారములు, రూక్షశీతలక్రియలు, గానమునువినుట, నాట్యమునుజూచుట, ఇట్టి పానాహారవిహార ఔషధములన్నియు శరదృతువునందుపథ్యములైయుండును.

### శరదృతువునందు అపథ్యములు.

శ్లో॥ సౌహిత్యందధి తైలమర్కకిరణాః ప్రాగ్మారుతః కాంజికమ్
మద్యంకూపజలంవసాచతుహినంక్షారాశ్చమాషాస్తిలాః।
ఆనూపోదకమాంసమహ్నిశయనంతీక్ష్ణానిరూక్షాన్వితో
వర్గోఽయంశరదిప్రకామమహితోనౄణాంభవేత్సర్వదా॥

తా॥ కడుపునిండ భుజించుట, పెరుగు, నూనె, ఎండలోనుండుట, తూర్పుననుండి వీచుగాలిని సేవించుట, కాంజికము, మద్యము, బావినీళ్లు, వస (మాంసస్నేహము), మంచునీళ్ళు, క్షారములు, మినుములు, నువ్వులు, అనూపదేశమునందును జలమునందును జనించిన జంతువులమాంసములు, పగటియందు నిదురించుట, తీక్ష్ణంబులును రూక్షంబులునైన పదార్థములు, ఇవియన్నియు శరత్కాలమునందు జనులకు అపథ్యములు.

### హేమంతశిశిర ఋతువులయందు పథ్యములు.

శ్లో॥ తైలైర్వాతహరైస్సుగన్ధిమిలితైరభ్యఞ్జనం సర్వతః
తైలైర్మూర్ధ్ని వస్తయశ్చ కుశలైస్స్వర్థం నియుద్ధాని చ।
పాదాఘాతఇతోయథావిధికృతంస్నానంలఘూష్ణాఽవరం
ధూమశ్చాగరుకం చ కుఙ్కుమమదాలేపోనవాన్నానిచ॥

స్వాద్వమ్లం లవణం చ మాషవికృతిర్గోధూమజా పిష్టకా
ఇక్షుక్షీరసముద్భవా వికృతయో మద్యాని తైలం వసా ।
ఆనూపాశ్చ బిలేశయాశ్చ ప్రసహా
గ్రామ్యాహ్వాయాశ్చౌదకాః
స్నిగ్ధోష్ణాని చ భోజనాని రవిత్విట్ స్వేదస్సుఖోష్ణోదకమ్॥

పాదత్రాణమపి క్షపాసు చ పునః కోష్ణం సగర్భం గృహం
శయ్యా తూలవతీ ప్రియా రసవతీ కాన్తా స్ఫురద్యౌవనా।
స్త్రీభోగోఽపి చ రల్లకాజినకుథక్షౌమప్రవేణ్యావృతి
ర్హేమన్తే శిశిరే చ పథ్యముదితంపూర్వైర్భిషగ్భిర్నృణామ్

తా॥ వాతహరంబులును మంచి పరిమళముతో గూడినవియునగు తైలములచే సర్వాంగములయందును అభ్యంగనము జేయుట, అట్టి తైలములచే శిరోబస్తికర్మ జేయుట, మిక్కిలి సమర్థులగువారితో మల్లయుద్ధము జేయుట, పాదములచే మర్దనము చేయుట, శాస్త్రోక్తప్రకారము స్నానము జేయుట, తేలికగాను ఉష్ణంబునైన వస్త్రమును ధరించుట, అగరు ధూపము, కుంకుమపువ్వును, కస్తూరిని నూరిపూసికొనుట, నూతనములగు అన్నములు, మధుర అమ్ల లవణ రసములుకల పదార్థములు, మినపపిండిచేతను గోధుమపిండిచేతను చేయబడిన సకల పదార్థములు, చెరకురసముచేతను పాలచేతను చేయబడిన నానావిధ పదార్థములు, మద్యములు, తైలము, వస, ఆనూపంబులును బిలేశయంబులు ప్రసహంబులును గ్రామ్యంబులును ఔదకంబులునైన నానావిధ జంతువుల మాంసములు, స్నిగ్ధంబులును ఉష్ణంబులునగు నాహారపదార్థములు, ఎండ, స్వేదనము, సుఖోష్ణంబైనజలము, పాదరక్షలధరించుట, రాత్రులయందు కొంచెముగ నుష్ణంబైన గర్భగృహముననుండుట, పరుపుతోగూడిన శయ్యపై బరుండుట, మనసునకు రమ్యమైనదియు యౌవనవతియునగు ప్రియురాలితో రమించుట, కంబళి చర్మము గంత పట్టుగుడ్డ మున్నగు వానిని గప్పికొనుట,

పీటు మున్నగువానిచే నావరింపబడిన భూమిపైనుండుట, ఇవియన్నియు హేమంతఋతువునందును శిశిరఋతువునందును పథ్యములైయుండును.

—॥ హేమన్తశిశిర ఋతువులయందపథ్యములు. ॥—

శ్లో॥ తుషారముదమన్థశ్చ ప్రవాతం ప్రమితాశనమ్ ।
కషాయకటుతిక్తాని లఙ్ఘనం వాతలాని చ ॥౧౭౮॥
రూక్షాదీన్ శీతసంయుక్తాన్ ప్రార్థయన్నాత్మనో హితమ్॥
హేమన్తే శిశిరే చాపి న భజేత సదా నరః ॥౧౭౯॥

తా॥ మంచునీళ్ళు, ఉదమన్థము, (నేతితోఁగూడినసత్తుపిండిని ఉదకమున బోసి మథించబడినపదార్థము), అధికముగవీచునట్టిగాలి, తృప్తిగల్గునంతభుజించుట, కషాయ కటుతిక్త రసములుకల సకల పదార్థములు, లంకణము, వాతమును వృద్ధినొందించు పదార్థములు, శీతలపదార్థములతోఁగూడిన రూక్షాది పదార్థములు, వీనినన్నిటిని తనకు సౌఖ్యమునుగోరు మనుజుండు హేమన్తశిశిర ఋతువులయందు విడచి యుండవలెను.

—॥ సకల రోగములయందును వాతాదిదోషానుసారముగ పథ్యాపథ్యనిర్ణయము. ॥—

శ్లో॥ ఏకద్విత్రిమలోద్భూతే జ్వరాదా కథితేష్వపి ।
పథ్యేష్వేతేషు సర్వత్ర విచార్య మతిమాన్భిషక్ ॥౧౮౦॥
వాతఘ్నం వాతజే పథ్యం పిత్తఘ్నం యచ్చ పిత్తజే ।
శ్లేష్మఘ్నం శ్లేష్మజే చాపి ద్విదోషఘ్నం ద్విదోషజే ॥౧౮౧॥
త్రిదోషఘ్నం త్రిదోషోత్థే యథాదోషం చ కల్పయేత్ ॥
అపథ్యాని పునశ్చాత్ర యాన్యుక్తాని గదే గదే ।
తాని సర్వాణ్యపి సదా తత్రతత్ర వివర్జయేత్ ॥౧౮౨॥

తా॥ వాతాదిదోషత్రయములో నొకదోషముచేనైనను రెండుదోషములచేనైనను త్రిదోషములచేనైనను జనించిన జ్వరాది రోగములయందు

